# చతుర

ఏప్రిల్ 2000 రూ. 7/-



పొత్తూరి విజయలక్ష్మి

# సహజీవనం

# చతుర ప్రపంచం

## ప్రమాదంలో పడ్డ చిరుతపులి సంఖ్య

చిరుతపులి అతి ప్రాచీనమైన పెంపుడు జంతువు. 5000 ఏళ్ల క్రితం రాజులందరూ చిరుతపులులను పెంచేవాళ్లు. 50 ఏళ్లక్రితం దాకా కూడా ఈ ఆచారం ఇండియాలో సాగింది. అయితే స్వతంత్రం వచ్చిన తరువాత ప్రభుత్వం చిరుతపులులను పెంచడం అపరాధంగా చట్టం చేయడంతో ఈ జాతి అడవులకే పరిమితమయింది. ఒక్క ఇండియాలోనేకాక ఆస్ట్రేలియా, ఫ్రాన్స్, ఈజిప్ట్, ఇటలీ దేశాల చక్రవర్తులు తమ రాచరికానికి చిహ్నంగా చిరుతపులులను పెంచేవారు. ఇందుకోసం వాటిని ఇండియా నుంచి ప్రత్యేకంగా దిగుమతి చేసుకునేవారు. ఇలా స్టేటస్ సింబల్‌గా మారింది చిరుతపులి.




ప్రపంచంలో అత్యంత వేగంగా పరుగెత్తే జంతువు చిరుతపులే. రెండునుంచి నాలుగు క్షణాలలో ఇది ఒక్కసారిగా గంటకు 75 కిలోమీటర్ల వేగాన్ని అందుకుని అలా 300 గజాల దూరం ఆ వేగంతో పరుగెత్తగలదు. అయితే 300 గజాల తర్వాత అది అలిసిపోయి విశ్రాంతి తీసుకుంటుంది. అందుకే ఈ 300 గజాల లోపే తన ఆహారానికి ఏదైనా జంతువు లభ్యమయితే అది పారిపోకుండా దానిమీదికి దూకి పట్టుకోగలదు. దాని తోకని ఎత్తి పట్టుకుని పరుగెత్తడంతో పడవలోని చుక్కానిలా పరుగెత్తే సమయంలో ఆ తోక తేలిగ్గా డైరెక్షన్‌లను మార్చుకుందుకు ఉపయోగిస్తుంది. మరే పులి జాతి జంతువుకీ ఈ సౌకర్యం లేదు. అంతేకాదు అడవుల్లో నివశించే పులిజాతికి చెందిన క్రూరమృగాల్లో చెట్టుని ఎక్కగలిగేది ఒక్క చిరుతపులే.

చిరుతపులి జాతి క్రమంగా అంతరించిపోతోంది. ప్రధానకారణం అడవులని నరకడం. దాంతో అవి ఆహారం కోసం గ్రామాల్లోకి చొరబడి మనుషుల చేత వధింపబడటం సర్వసాధారణ విషయం అయిపో



యింది. మరో కారణం.. సహజంగా చిరుతపులి వర్గంలో ఫెర్టిలిటీ కౌంట్ బహు తక్కువ. నాలుగు జతల్లో ఒకజతే పిల్లల్ని పెడుతుంది. తడవకి 4, 5 పిల్లల్ని కంటుంది ఆడ చిరుతపులి.

40 లక్షల ఏళ్ల క్రితం చిరుతపులి నేటి అమెరికాలో పుట్టిందని శాస్త్రజ్ఞులు కనుక్కొన్నారు. యూరప్, చైనా, ఇండియా, ఆఫ్రికాలకి క్రమంగా విస్తరించాయి. 10,000 ఏళ్ల క్రితం 'ఐస్ఏజ్' అంతం అయేదాకా చిరుత పులులు మంచు మీద ప్రపంచమంతా తిరిగేవి. అమెరికాలో కూడా అవి స్వల్ప సంఖ్యలోనే మిగిలాయి. ఆఫ్రికా, ఇండియాల్లోనే ప్రపంచంలో ఎక్కువ చిరుతపులులున్నాయి. పిల్లలుగా వుండగానే చిరుతలు వ్యాధులబారిన పడి మరణించడం వాటి సంఖ్య తగ్గిపోవడానికి మరో కారణం.

ఈ శతాబ్దం ఆరంభంలో లక్ష చిరుతపులులుండేవి. ఇప్పుడు వాటి సంఖ్య 30,000 కి దిగిపోయింది. 'వరల్డ్ వైల్డ్ లైఫ్ ఫండ్' చిరుతపులిని 'ఎండేంజరస్ స్పీషీస్'గా గుర్తించి ఆఫ్రికాలో దీన్ని రక్షించడానికి ఎక్కువగా కృషి చేస్తోంది.

చిరుతపులుల గురించి తెలుసుకోవాలంటే డబ్ల్యు.డబ్ల్యు.డబ్ల్యు, సి హెచ్.ఇ.ఇ.టి.ఎ. హెచ్, ఒ.ఆర్.జి... అనే వెబ్ సైట్ ని దర్శించవచ్చు దీన్ని వైల్డ్‌లైఫ్ ఫండ్ నిర్వహిస్తోంది.

---

## డాలర్ జాగ్రత్తలు

ఆధునిక కంప్యూటర్ రివల్యూషన్‌వల్ల ప్రింటింగ్ టెక్నాలజీ బాగా అభివృద్ధి చెందింది. కలర్‌జిరాక్స్ యంత్రాలను ఉపయోగించి అమెరికాలో డాలర్ నోట్లకి కౌంటర్ ఫీట్ నోట్లను సృష్టించడం అధికమయింది. జాగ్రత్తగా చూస్తే కానీ నిపుణులు కూడా తేడా కనుక్కోలేని విధంగా నేరస్థులు ప్రింటింగ్ టెక్నాలజీని ఉపయోగించి దొంగనోట్లు తయారు చేస్తున్నారు. దాంతో కళ్లు తెరిచిన అమెరికన్ సంస్థ 'బ్యూరో ఆఫ్ ఎంగ్‌వింగ్ అండ్ ప్రింటింగ్' తమ కరెన్సీ నోట్లకి కౌంటర్ ఫీట్ నోట్లని సృష్టించలేని కొన్ని కొత్త విధానాలను ప్రవేశపెట్టింది.

మొదటిది పేపర్ తయారీ. అమెరికాలోని ఓ రహస్య ప్రదేశంలో కరెన్సీకి ఉపయోగించే కాగితం తయారవుతుంది. అందులో మామూలు పేపర్‌కిలాగ చెట్టుగుజ్జును వాడరు. 75 శాతం రేగ్ (కాటన్) 25 శాతం ఇతర పదార్థాలు వాడతారు. పేపర్ తయారీలోనే దాని మీద వాటర్ మార్క్‌ని మార్పిస్తారు. దాన్ని ఏ ఆధునిక ప్రింటింగ్ మెషీన్ కూడా కాపీకొట్టలేదు. కాగితం విషయంలో తీసుకునే మరో భద్రత కాపర్‌వైర్‌తో ప్రతీనోట్‌లో ఇంబైబ్ చేసే సేఫ్టీత్రెడ్. ఎవరూ కౌంటర్‌ఫీట్‌కి వాడే నోట్ల కాగితాల్లో దీన్ని కాపీ కొట్టలేరు. ఎందుకంటే ఆ విధానం టాప్ సీక్రెట్.

అలాగే ప్రింటింగ్ విషయంలో కూడా కొత్త జాగ్రత్తలు తీసుకుంటున్నారు. డాలర్ నోటు విలువను సూచించే అంకెలకి వాడే ఆకుపచ్చ రంగుని ప్రత్యేకంగా తయారుచేసి వాడుతున్నారు. చూడగానే కంటికి ప్రతివారికీ తేడా తెలిసేంత స్పష్టమయిన ఆకుపచ్చ రంగది. కంప్యూటర్ టెక్నాలజీతో ఓ రహస్య ప్రదేశంలో ఫ్యాక్టరీలో తయారుకాబడే ఆ ఆకుపచ్చ రంగు కౌంటర్‌ఫీట్ నోట్లను తయారుచేసే నేరస్థులకి అందుబాటులో వుండదు. ఈ ఆకుపచ్చరంగుని డూప్లికేట్ చెయ్యడం అసాధ్యం. ఈ నాలుగు జాగ్రత్తలనీ ఇంకా ఏ నేరస్థుడూ బద్దలు కొట్టిన దాఖలాలు లేవు. ఇది కాక ఆఖరి జాగ్రత్త ప్రతినోటు మీదా వుండే ముడతలు, గీతలు. డాలర్ ముద్రణకుపయోగించే బ్లాక్స్‌ని చేత్తో ప్రత్యేకంగా తయారుచేస్తారు కాబట్టి బొమ్మని యథాతథంగా బ్లాక్‌గా రూపొందించడం అసాధ్యం.




ఇదికాక మరో జాగ్రత్త వుంది. అది ప్రతి నోటులోనూ వున్న కంటికి కనపడనిది. ఆ జాగ్రత్త పేరు 'బ్యూరో ఆఫ్ కౌంటర్ ఫీట్ ఏజెన్సీ'. అమెరికన్ సీక్రెట్ సర్వీస్‌లోని ఓ విభాగమైన ఇందులో పనిచేసే అనేకమంది నిత్యం దొంగనోట్ల నేరస్థులను పట్టుకునే ప్రయత్నంలో వుంటారు. పట్టుబడ్డ వాళ్లకి 15 ఏళ్ల జైలుశిక్ష.

అమెరికాలో డ్రగ్స్ తీసుకోవడం అధికం. డాలర్ నోటుమీద కొకెయిన్‌లాంటి డ్రగ్స్‌ను వుంచి ముక్కులోకి ఆ మందుని పీల్చుకోవడం అలవాటు. అందుకని ఆ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ కొన్ని వందల నోట్లని ఈ విషయంలో కూడా పరిశీలించింది. ఆల్కహాల్‌లో నోట్లని ముంచి తర్వాత దాన్ని గడ్డ కట్టించిచూస్తే డాలర్ మీదువున్న రసాయనిక పదార్థాల ఫింగర్‌ప్రింట్స్ (వాటినిర్దుష్ట రూపాలు) కనిపించాయి. ప్రతి అయిదు నోట్లకీ 4 నోట్ల మీద డ్రగ్స్ అంటుకుని వున్నాయని గుర్తించారు. సగటున ఒక నోటుమీద 23 మైక్రోగ్రామ్స్ చొప్పున వుంది. ఈ లెక్కన చెలామణిలోని మొత్తం అమెరికన్ డాలర్స్ నోట్లమీద 330 పౌన్ల డ్రగ్స్ అంటుకుని వుండచ్చని లెక్కకట్టారు. అయితే ఇది పీల్చినా మనిషికి అంతగా హానికరం కాదుకాబట్టి ఇబ్బంది వుండదు.

---

## దివాళాతీసిన చిత్రకారుడు

'కూటికోసం కోటివిద్యలు' అన్న సామెత నిజమే అయినా కొందరి విద్యలు కూటినికూడా సమకూర్చి పెట్టలేకపోతాయంటే ఆశ్చర్యం ఏంలేదు. కొందరు కొన్నికొన్ని రంగాల్లో ఎంతో ప్రతిభావంతులుగా ప్రపంచ ప్రఖ్యాతి కూడా పొందగలుగుతారు. కానీ... వ్యక్తిగత జీవితంలో తాము అనుభవించేది ఏంలేకపోగా కష్టాలే మిగులుతాయి. ఈ కోవలోకే వస్తాడు... హాలెండుకు చెందిన ప్రఖ్యాత చిత్రకారుడు రెంబ్రాంట్. అయితే ఇతనిదంతా స్వయంకృతాపరాధమంటారు పరిచయస్థులు.

హాలెండులో లెయిడెన్ అనే చిన్న ఊళ్లో క్రీ.శ 1606 లో పుట్టాడు రెంబ్రాంట్. ఇతని పూర్తిపేరు హార్మెన్ స్జూన్ వేన్‌రిజిన్. అయితే తన చిత్రాలన్నిటికీ కేవలం తన పేరులోని మొదటిభాగంతోనే సంతకం చేయడంతో ఎక్కువమందికి



రెంబ్రాంట్ పూర్తిపేరు తెలియదు. తననే మోడల్‌గా తీసుకుని రెంబ్రాంట్ 90 దాకా సెల్ఫ్ పోర్ట్రెయిట్స్ గీశాడు. అందులో 50 ఆయిల్ పెయింటింగ్స్, 30 ఇచింగ్స్, 10 డ్రాయింగ్స్. ఇతని జీవితకాలంలో గీసిన మొత్తం 900 చిత్రాల్లో ఇవి 10 శాతం. అహంకారంతో కూడిన గర్వానికి బానిసై ఈ చిత్రకారుడు ఇన్ని సెల్ఫ్ పోర్ట్రెయిట్స్ గీశాడని ఆధునిక మానసిక శాస్త్రజ్ఞులు అంటూ వుంటారు.

అతను జీవించి ఉన్న కాలంలో అతని లాంటి చిత్రకారుడు యూరప్‌లో మరొకరు లేరన్నది వాస్తవం.

1631 లో తన 25వ ఏట ఆమ్‌స్టర్‌డామ్ కి వెళ్లాడు. ఆ రోజుల్లో ఆ పట్టణంలో చిత్రాలని కొని చిత్రకారులని పోషించేవారి సంఖ్య అధికంగా వుండటం ఇందుకు కారణం. హెండ్రిక్ అనే ఆర్ట్ డీలర్ ద్వారా తన చిత్రాలను అమ్మసాగాడు. 1634 లో హెండ్రిక్ పినతల్లి కూతురయిన సస్కిమాని వివాహం చేసుకున్నాడు. వారికి టైటస్ అనే కొడుకు పుట్టాడు. అయితే 1642 లో ఆమె మరణించింది. తర్వాత తన పనిమనిషి అయిన 19 ఏళ్ల స్టోఫెల్స్ తో ప్రేమలో పడ్డాడు. వాళ్లకి ఓ కూతురు కూడా పుట్టింది. కార్నీలియా అని పేరు పెట్టారా పాపకి. అయితే తన భార్య ఆస్తి తాలూకూ వారసత్వం పోగొట్టుకోకూడదని రెంబ్రాంట్ తన కూతురికి తల్లయిన స్టోఫెల్స్ ను జీవితాంతం వివాహం చేసుకోలేదు.

ఎంత గొప్ప చిత్రకారుడో... వ్యక్తిగత ఆర్థికజీవితం అంత విచ్చలవిడితనానికి గురయినవాడు రెంబ్రాంట్. వచ్చిన డబ్బంతా ఆడంబరమైన దుస్తులకి ఖర్చు చేసేవాడు. అలాగే తన మోడల్స్‌కి ధరించడానికి కొన్న ఖరీదయిన దుస్తులు, నగలు వాళ్లకే వదిలేసేవాడు. దాంతో త్వరలోనే అతడు ఆర్థికంగా దివాలా తీశాడు. అప్పటినుంచీ అతని ఆస్తిపాస్తుల వ్యవహారాలన్నీ కొడుకు టైటస్, ఆర్ట్ డీలర్ హెండ్రిక్ కలిసి చూడసాగారు. వాళ్ల ఉద్యోగిగా రెంబ్రాంట్ జీతం మీద బొమ్మలు గీయసాగాడు. అలా 40 ఏళ్లు పైనే 900 కి పైగా బొమ్మలు గీసిన రెంబ్రాంట్ 1669 లో తన 63వ ఏట మరణించాడు.

అయితే అతని చిత్రాలకి ఎన్ని దశాబ్దాలు, శతాబ్దాలయినా చావు లేదు. ★



# 'వేకువపూలు' పై సమీక్షలు

ఫిబ్రవరి 'చతుర' లో ప్రచురితమైన జతిన్‌కుమార్ రచన 'వేకువపూలు' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## సందేశాత్మకం

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

సమాజంలో నానాటికీ పెచ్చు పెరిగిపోతున్న అవినీతీ, లంచగొండితనం, సాంఘిక దురాచారాలకు కారణం వ్యక్తులకు తమ హక్కుల పరిరక్షణపట్ల శ్రద్ధలేక పోవటం, పోరాట పటిమ సన్నగిల్లటమే! విద్యావంతులైన యువత తమ జీవితాలను మెరుగుపరచుకోవడం మాత్రమేగాక, సమాజాన్ని చైతన్యపరచి, బాధితులను పోరాటదిశగా పయనింపచేయాలన్నది ఫిబ్రవరి 'చతుర' 'వేకువపూలు' అందించిన సందేశం.

జాతీయోద్యమంలో బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా పోరాడి, చెరసాలజీవితం అనుభవించీ, అది తన కర్తవ్యంగా భావించాడే గానీ, దాన్నుండి లబ్ధి పొందాలని ఆశించని రామారావు మాస్టారి మూడవ కుమార్తె సమతది చిన్నప్పట్నుంచీ 'స్త్రీ-పురుష' వ్యత్యాసాలను సరిపెట్టుకోలేని తత్వం. అందుకు అనువైన వాతావరణంలోనే పెరిగి సమాజంలో పెరుగుతున్న వరకట్న చావులకు వ్యతిరేకంగా పోరాటం సాగించి, తమ కళాశాల లెక్చరర్ ఘాతుకాన్ని పేపర్లకెక్కించీ కోర్టుకీడ్చీ బెదురు పుట్టిస్తుంది.

ఒకపక్క చదువును అశ్రద్ధ చెయ్యకుండా యూనివర్శిటీ ఫస్టులు సంపాదిస్తూనే, విప్లవోద్యమాల పట్ల శ్రద్ధ చూపుతూ చదువు కంటే సమాజ పరిరక్షణే ముఖ్యకర్తవ్యమని, బలమైన ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటం సాగిస్తుంది. విజయం సాధిస్తుంది. జీవితంపట్ల ఒక అవగాహన కలిగి, వైవాహిక జీవితాన్ని తన ఆశయాలకు తగిన 'రాకేష్'తో ముడివేసుకుంటుంది.

కుహనా ప్రేమలగురించి డాక్టర్ జానకి, సౌందర్య పాత్రలద్వారా చక్కగా చిత్రీకరించటమేకాక భగ్న ప్రేమికులు, భంగపడ్డ వనితలు ధైర్యంతో ముందుకెళ్ళాలని చూపించారు. భర్తలచేత హింసించబడుతున్న సుభద్రలకు దారిచూపారు. తెలివి కలిగీ దాంపత్యపు విలువ తెలిసీ మూర్ఖంగా ప్రవర్తించే స్రవంతిలాంటి వారిని వేలెత్తి చూపారు. వివిధ సమస్యలను విశ్లేషణాత్మకంగా వివరించడానికి అనేక పాత్రలు సృష్టించడం కొంచెం ఎక్కువైనా తప్పదేమో మరి! చక్కనిశైలితో ఆద్యంతం మంచి పట్టుతో సాగిన నవల 'వేకువపూలు'!

-లా.వా. స్ఫూర్తి,
పార్వతీపురం - 535 501

## నచ్చిన జీవితం...!

(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

జతిన్‌కుమార్ నవల 'వేకువపూలు' ఆద్యంతం ఆసక్తికరంగా సాగింది. కానీ రచయిత చెప్పదల్చుకున్నదేదో విపులంగా చెప్పలేకపోయారనిపిస్తుంది. కథానాయికగా సమత వ్యక్తిత్వ చిత్రీకరణ బావుంది. ఆమెను ఉన్నతంగా చూపగల్గినా, ఆచరణలో ఆమె సమాజానికి చేసిన సేవ ఏమిటో విపులీకరించలేదు. సంస్థ, ఉద్యమాలు, సంఘాలగురించి వివరించినా కథానాయిక ఆ సంఘంలో ఏం చేసిందన్నది తెలియదు.



'కట్నాలు దురాచారమనీ, స్త్రీకి సమానహక్కులు కావాలని, స్త్రీ ముందుకు రావాలని ఉంటుంది కానీ ఆచరణలో పెట్టడానికి ఎవరూ కలిసిరారు' అని ఓ సందర్భంలో బాధపడ్తుంది సమత. నిజమే సమాజంలో జరుగుతున్నదదే. ఎవరో ఏదో చేస్తే లాభపడ్దామని చూస్తారేకానీ వారికి సహాయం చేద్దామని అనుకునేవారు లేరీరోజుల్లో.

తను నమ్మినవాడికోసం సమాజానికి ఎదురు నిలబడ్డ ఝాన్సీ, అవకాశం వచ్చినపుడు ఆలోచించి (శంకరం విషయంలో) నిర్ణయం తీసుకోవడం హర్షించదగ్గదే. శంకరంలాంటివాళ్ళు సమాజంలో అరుదుగా కన్పిస్తారు. కూతురు ఝాన్సీకి, తల్లి ఝాన్సీకి ఎంత తేడా అని ఆశ్చర్యపోతారు మాష్టారు. నిజమే తల్లిగా మారిన స్త్రీ ఆనందం వర్ణనాతీతం.

తనకు నచ్చినట్లుగా జీవితం గడపటాన్కి వివాహం అడ్డు అనుకుని అవివాహితగా ఉండిపోయి కూడా ఝాన్సీ విషయంలో అమూల్యమైన సలహా ఇవ్వడం జానకి పాత్రకే చెల్లింది. "కోట్లాదిమంది ఆత్మల్ని చంపుకొని, ఆత్మగౌరవాన్ని కోల్పోయి శరీరాలకు సుఖం తెచ్చుకుంటూ ఉంటే, కేవలం ఆ సుఖంకోసం పెళ్ళికి తలపడుతోంటే ఏ కొద్దిమందో శరీరాల్ని కష్టపెట్టుకుని అయినా ఆత్మల్ని బతికించుకునేవారు ఉండరా" అన్న జానకి మాటలు అక్షరసత్యాలు.

రాకేష్ వ్యక్తిత్వ చిత్రీకరణ బాగుంది. కానీ సరిత, రాకేష్‌లు అంత కష్టపడ్డా వాళ్ళ వల్ల ప్రయోజనం పొందిన వారెవరో, ఎవరికోసం అనేది ఇంకొంచెం వివరంగా రాసి ఉంటే బాగుండేది. మంచి నవల అందించిన జతిన్‌కుమార్ గారికి అభినందనలు.

–రమాదేవి,

హైదరాబాద్ - 500 047.

# సామాజిక ఉద్యమ నేపథ్యం

*(తృతీయ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

"వేకువపూలు" సమకాలీన సమాజానికి ఒక దర్పణం. "తెల్లవాడు నాడు నిన్ను బందిపోటు అన్నాడు (సీతారామరాజు గురించి), నల్లవాడు నేడు నిన్ను నక్సలైట్ అన్నాడు, ఎల్లవారు రేపు నిన్ను వేగుచుక్క అంటారు' అనే శ్రీశ్రీ పద్యానికి సవివర వ్యాఖ్యానరూపమే ఈ నవల. నిజమైన స్వాతంత్ర్య సమర యోధుల ఉనికి నిస్తేజంగా మారి ధనబలం, కండబలం, ప్రాతిపదికగా రాజకీయ, సామాజిక కార్యక్రమాలు నడుస్తున్న నేపథ్యానికి ఈ నవల ఒక సజీవ తార్కాణం. అయితే ఆ ఉద్యమ స్ఫూర్తి పోలేదు. కొద్దోగొప్పో అయిదేండ్లకొకసారి లేదా ఇంకాముందే ఎన్నికలు వస్తున్నాయి. ప్రతీ ఎన్నికలలో సగటు ఓటరు అవగాహనాస్థాయి పెరుగుతూ వస్తున్నది. అనేకానేక నియంతృత్వ వ్యవస్థల కన్నా మనదేశంలో కొన్ని సామాజికాంశాలు విలువ యివ్వబడుతూ నిలదొక్కుకుంటున్నాయి.

అన్నింటినీ విధ్వంసం చేయాలనే తపనతో, ఉద్రేకంతో మొదలైన ఉద్యమాలు ప్రజలకు, జనజీవన స్రవంతికి చాలా దూరంలో వుంటున్నాయి. భారతీయ సామాజిక వ్యవస్థ బహుళ ప్రాధాన్యత కలది. అన్ని కులాలు, మతాలు వేటికవి తమతమ స్వయం ప్రతిపత్తిని నిలబెట్టుకుంటూ ప్రధానజీవన స్రవంతిలో ముందుకు పోతుంటాయి. ఈ విషయాన్ని సరియైన విధంగా అవగాహన చేసుకున్న నాయకులు మాత్రమే తమతమ మార్గములయందు, ఉద్యమాలయందు సఫలం అవుతున్నారు. తద్భిన్నంగా పోయినవారు ప్రధానస్రవంతికి దూరంగా వుండి క్రమక్రమంగా కనుమరుగవుతున్నారు. వర్గ కులబలాల్ని

ఏ కొంతమేరకయినా తగ్గించేవిధంగా కనీసం అర్థం చేసుకునే దిశగా సగటు పాఠకుడు ఆలోచించేందుకు దోహదం చేస్తుందీ 'వేకువ పూలు'. రచయిత జతిన్‌కుమార్‌గారికి అభినందనలు.

–డాక్టర్ కాసర్ల రంగారావు,
పాల్వంచ - 507 115.

## ఒకే కొమ్మ... రకరకాల పూలు

**(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)**

"వేకువపూలు" ఎంతో మధురంగా, ప్రకృతిశోభను నింపుకున్న స్వచ్ఛతతో కన్పిస్తాయి. రాత్రి కళ్లముందే జరిగిన ఘోరాల్ని మొగ్గగా మనసులో దాచుకొని ఉదయం అమాయకంగా పూస్తాయి రేపటి భవిష్యత్తును అతిగా ఊహించుకొంటూ. అలాగే ఈ నవలలోని పాత్రలన్నీ సంచరించాయి. ఒక ఝాన్సీ, సమత, రాజ్యం, లోకేష్, శంకరం, తేజ, స్రవంతిలు- ఈ ప్రధాన పాత్రలన్నీ ఒకే కొమ్మకి పూసిన రకరకాల పువ్వులు. ఇంకొన్ని గడ్డిపువ్వులు. అయితే ఉపయోగంలోకి వస్తూ లేకుంటే రాలిపోతూ!

హృదయాల్ని రంజింపజేసేలా ఆద్యంతం ఏకబిగిన చదివించిన ఈ నవల ఆలోచింపజేస్తుంది స్పందించగలిగే హృదయమున్న మనుషుల్ని.

వాస్తవాల జీవన విధానాన్ని అక్షరరూపం దిద్దితే చేతికున్న ఐదువేళ్లలా భిన్నంగా సాగే ఎన్నో మనోప్రవృత్తులు నవలాపఠనం జరిగినంతసేపూ కళ్లముందు కదలాడుతాయి. "మనది" నుండి "నాది"కి మనిషి కుంచించుకుపోయేసరికి తేజ, స్రవంతుల్లా, ఎదిరించి పోరాడే నైజంతో ఝాన్సీలా, అవగాహనకు నిలువెత్తురూపాల్లా రాకేష్, సమతలు, స్వార్థమే ధ్యేయంగా రాజ్యం, ఆప్యాయతలకు వారధిలా శంకరం, ప్రతివ్యక్తి జీవితంలో ఎక్కడో ఒకచోట అలా వచ్చి ఇలా స్ఫురించిపోతారు.

వేకువపూలన్నీ గడ్డిపూలు కాకుంటే రచన ప్రయోజనం సిద్ధించినట్టే.

–పి.ఇ. సత్యనారాయణ పట్నాయక్,
కాశీబుగ్గ-532 222

## సమస్యల నవల

**(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)**

అనుక్షణం పరిస్థితులతోనూ, సంఘంతోనూ, సంబంధ బాంధవ్యాలతోనూ సంఘర్షిస్తేగానీ జీవితంలో "వేకువపూలు" పూయవు అనేది ఈ నెల చతుర నవల ఇతివృత్తం.

వేర్వేరు మహిళలు భిన్న మనస్తత్వాలతో, చిత్తశుద్ధితో లక్ష్యంకోసం పోరాడిన తీరు పాఠకులను ఆకట్టుకుంటుంది. సమత పాత్ర నవలకు శిరోమణి. ఇది ఒక ఇజానికిగాని, సిద్ధాంతానికిగాని కట్టుబడక తన ప్రవర్తనతో ఎదుటివాళ్ళ శైలిలో మార్పుతెచ్చే విలక్షణ పాత్ర.

ఇతివృత్తం నూతనంగానే వున్నా, కథనంలో వేగం లోపించింది. రచయిత పాత్రలను ఒక మూసలోకి తెచ్చారేగాని, నవలను నడిపే అంతస్సూత్రం కానరాలేదు. శైలి బావున్నా శిల్పంలో పటుత్వం లేదు.

ఇప్పుడు "స్త్రీ" కూజాలో పోసిన నీరు కాదు, కావలసినప్పుడు తాగడానికి. ఆమె ఉవ్వెత్తున దుమికే జలపాతం. ఆదరించి 'శక్తి'ని ఉత్పత్తి చేస్తాడో, వినాశానికి గురవుతాడో అది ఆధునిక పురుషుడి చేతిలో వుంది. నవల్లో సమత ఈ విషయం స్పష్టీకరించింది.

మహిళా సమస్యల నవల గాబట్టి ప్రతిస్థాయి మగాడు చదవాల్సిన నవల ఇది.

–డాక్టర్ కె. శివసుబ్బారావు,
లింగపాలెం



# చతుర

సంపుటి: 23 సంచిక: 3 ఏప్రిల్: 2000

"వధువు కావలెను. వరుడు ఆరడుగుల స్ఫురద్రూపి. ఉద్యోగం లేదు. చెయ్యదలచలేదు. వయసు 30. ఏదైనా పెద్ద కంపెనీలో ఎగ్జిక్యూటివ్‌గా పనిచేస్తున్న యువతి కావాలి" అన్న ప్రకటన చూసి ఆ అమ్మాయి అదిరిపడింది. అతన్ని కాంటాక్ట్ చేయగా... "స్త్రీ పురుషులు అన్నింటా సమానమని ప్రపంచమంతా ఒప్పుకుంటోంది కాబట్టి ఆర్థికశాఖ నా భార్య నిర్వహిస్తే పిల్లల్ని కనడం మినహాయించి ఇంటిపనులన్నీ నేను సమర్థించగలనని హామీ ఇస్తున్నాను" అన్నాడతడు.

ఉన్నత పదవిలో వున్న ఓ సౌందర్యరాశి... ఈ సంబంధానికి ఇష్టపడి వివాహానికి సిద్ధపడింది. అటుపైన కథ ఏ మలుపు తిరిగింది? ఆసక్తికరంగా చదివిస్తూనే ఆలోచింపచేసే **పొత్తూరి విజయలక్ష్మి** రచన **"సహజీవనం"** ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

# సహజీవనం

- పొత్తూరి విజయలక్ష్మి

టెలిఫోన్ మోతకి నిద్రాభంగం కాగా, బద్ధకంగా పక్కకి తిరిగింది మాధవి. దుప్పటి మొహంమీదికి లాక్కుంది. అయినా నేను నీకంటే మొండిదాన్ని సుమా అన్నట్లు ఆగకుండా మోగుతూనే వుంది ఫోన్.

"ఆదివారం కూడా సుఖంగా నిద్రపోని వ్వరు" అనుకుంటూ విసుగ్గా పక్కకి దొర్లి ఫోన్ అందుకుంది.

"హమ్మయ్య నిద్రలేచావా?" అవతలి గొంతు వినగానే చిర్రెత్తుకొచ్చింది మాధవికి.

"నీలాంటి దానితో స్నేహం చెయ్యడం నాదే బుద్ధితక్కువ. ఆదివారం కదా హాయిగా పడుకుని అఘోరించక తెల్లారగానే లేచి కూర్చుంటావ్ గుడ్లగూబలా. పోనీ నువ్వు లేచావుసరే నన్నూ లేపి కూర్చోబె ట్టావు. శనిగొట్టు మొహమా" అని తిట్టింది మనసారా!

"తెల్లారురుఝామున లేపినట్లు ఏడుస్తు న్నావు. ఎనిమిదిన్నర దాటింది. ఇంకేం నిద్ర?" మందలించింది మాధురి.

"అబ్బ అయితే అయిందిలే. అయినా అర్జెంటుగా లేచి మనం ఏం చెయ్యాలిట? మొగుడా పిల్లలా?" అంది మాధవి బద్ధ కంగా.

"అదుగో ఆ మొగుడి విషయం మాట్లాడ్డా నికే ఇంత అర్జెంటుగా ఫోన్ చేసింది. ఇవ్వాల్టి పేపర్లో మాంచి ఏడ్ పడింది చూడు" చెప్పింది మాధురి.

"నీకీజన్మకి బుద్ధిరాదే! ఆదివారం వచ్చిం దంటే నీకిదేపని!" విసుక్కుంది మాధవి.

"మరేం చేస్తాం? మనకోసం వెతికేవాళ్ళు విసిగివేసారిపోయారు. మరో మూడేళ్ళు ఆగితే ముద్దుముద్దుగా ముప్పై వచ్చేస్తాయి. అందుకే నా కంగారు. నీకు చూడబోతే చీమకుట్టినట్లైనా లేదు. నీకోసం నాకోసం నేనే తాపత్రయపడుతున్నాను. ఇంత చేస్తుంటే సంతోషించక విసుక్కుంటావేం?" నిష్ఠూరం ఆడింది మాధురి.

"సర్లే ఫోన్ పెట్టేయ్" అంది మాధవి.

"నేను గంటలో వస్తాను" అనేసి ఫోన్ పెట్టేసింది మాధురి. లేచి బాత్‌రూమ్‌కి పరి గెట్టింది మాధవి.

బ్రష్ చేసుకుని బయటికి వచ్చేసరికి డోర్ బెల్ వినిపించి తలుపుతీసింది.

"గుడ్ మార్నింగ్ అక్కా" అంటూ ఫ్లాస్క్ అందించింది ఇంటివారి పనిపిల్ల.

కాఫీ తాగేసి బిజినెస్ న్యూస్ తీసుకుని కూర్చుంది మాధవి.

ఏకాగ్రతతో చదువుతూ వుండగా బాంబే డయింగ్‌వారి సమాచారం మీద పడింది దృష్టి. ఆ కంపెనీపేరు చూడగానే బట్టలు గుర్తొచ్చాయి. ఉలిక్కిపడి లేచింది. డ్రైక్లీనిం గ్‌కి ఇచ్చింది డ్రెస్‌లు. వాడు శుక్రవారం ఇస్తానన్నాడు. శుక్రవారం మర్చిపోయింది. శనివారం బిజీగావుండి వీలుకాలేదు. ఇవ్వాళ ఆదివారం. షాపుకి శలవు. రేప్పొ ద్దున ఏం వేసుకోవాలి? అందులోనూ ఇంపార్టెంట్ సెమినార్ కూడా వుంది.

చివాల్న లేచి బీరువా తెరిచింది. గుండె జబ్బున్నవాడు గనుక ఆ బీరువా పరిస్థితి చూస్తే ఢామ్మని గుండె ఆగి చస్తాడు.

నీరసం వచ్చింది మాధవికి. కీకారణ్యంలా వున్న ఆ బీరువాలోంచి ధరించయోగ్యమైన వస్త్రాలు వెతుక్కోవాలి. ఆ పళంగా ఇంత కిరోసిన్ పోసి ఆ బీరువా తగలెట్టేయాల న్నంత కోపం వచ్చింది.

అది సమస్యకి పరిష్కారం కాదని ఓపి కగా బీరువాలోని సామాన్లన్నీ బయటపడే సింది.

సరిగ్గా అదేసమయంలో ఆ గదిలో అడు గుపెట్టింది మాధురి. గది అంతా పరికించి చూసి "శభాష్ ఎంత బాగుందో! అసలా వీరప్పన్ అడవుల్లో దాక్కునే బదులు నీ గదిలో దాక్కుంటే మన మిలట్రీ అంతా ఏకమై వెదికినా పట్టుపడడు" అంది అల్ల రిగా.

చుర్రున చూసి తన పన్లో మునిగిపో యింది మాధవి. తనవంతు సహాయం

చెయ్యడానికి నడుం బిగించింది మాధురి.

మాధురి మాటల్లో అతిశయోక్తి ఎంతమాత్రంలేదు. నిజంగా అడివిలాగానే వుంటుంది మాధవి రూమ్. పన్నెండూ బై పన్నెండూ రూమ్. అందులో మధ్యగా సింగిల్ కాట్. దానిమీద పడుకోవాలంటే ఓ పదినిము షాలు వెచ్చించి ఆ మంచంమీద వుండే లారీడు సామాన్లు దించి కిందపెట్టాలి. మంచం ఎదురుగా కూలర్, దానిమీద బండెడు పుస్తకాలుంటాయి. ఓ పక్కగా రైటింగ్ టేబిల్. దానిమీద కూడా గుండు సూది మోపడానికి లేకుండా సామాన్లుం టాయి. మరోమూల టి.వి.స్టాండు. దాని కింద సి.డి. ప్లేయరు. టి.వి.మీదా స్టాండు లోనూ చుట్టుపక్కలా పడుంటాయి కేసెట్లు, సి.డి.లు. ఇక బట్టలు ఇందుగలవు అందు లేవు అన్నట్లు సర్వం వ్యాపించి వుంటాయి.

మూడురకాల పేపర్లు కొంటుంది మాధవి. ఇండియాటుడే, వీక్, బిజినెస్ ఇండియా, ఫ్రంట్‌లైన్ వగైరా ఓ డజను మేగజైన్లు కొంటుంది. నెలకి కనీసం రెండు జతల బట్టలు, ఓ డజను కేసెట్లు ఓ జత చెప్పులు కొంటుంది. కొనుక్కునే సరదా తప్పించి సర్దుకునే సహనం లేకపోవడంతో ఆ రూమ్ నిజంగానే అరణ్యంలా వుంటుంది.

పనిపిల్ల వుంది. కానీ అదొచ్చేసరికి పొద్దున తొమ్మిది గంటలు అవుతుంది. బయటికి వెళ్ళే హడావిడిలో వుంటుంది మాధవి. త్వరగాకానీ అని కంగారు పెడుతూ వుంటే గదిలో ఖాళీగా వున్న రెండడుగుల నేలమీదా చీపురు ఆడించి చక్కాపోతుంది ఆ పిల్ల.

ఏ రెండు వారాలకో ఒకసారి పనిపిల్ల నడుం కట్టుకుని ఏ ఆదివారమో గదంతా శుభ్రం చేస్తే ఆ గదికి ముక్తిమోక్షం.

తల్లి ఎప్పుడైనా వచ్చి కూతురి గది చూసి "ఏవిటీ ఖర్మ. మగపిల్లాడైతే పెళ్ళి చేస్తే భార్యవచ్చి ఇల్లు సర్దుతుంది. అని ఆశప డచ్చు ఇదేమో ఆడపిల్ల. దీన్ని గురించి ఏమనుకోవాలి? అని బాధపడుతుంది. అంతకుమించి ఏమైనా చెయ్యడానికి ఆవిడకీ పని చేతకాదు. ఆవిడ భర్త ఆర్మీలో మేజర్. దురదపుడితే గోక్కోవడం, తుమ్మితే ముక్కు తుడుచుకోవడం కంటే తేలిక పన్లు తప్పించి బరువుపనులు ఆవిడకీ రావు.

మాధవీ, మాధురి పనిపిల్ల సహాయంతో ఆ గది సర్దేసరికి పన్నెండు కొట్టింది. పొద్దున్న బ్రేక్‌ఫాస్ట్ చేసిన మాధురి బాగానే వుందిగానీ మాధవి మాత్రం శోష వచ్చి పడిపోయేలా అయిపోయింది. స్నానంచేసి వచ్చింది. ఇద్దరూ బయటికి వచ్చారు. మాధురి కార్లో మంచి హోటల్‌కి వెళ్ళారు. మెనూకార్డ్ అందుకుంది మాధురి. ఏం తిందాం అని అడిగింది. "ఏదో ఒకటి త్వరగా వచ్చేది ఆర్డరివ్వు" అంది మాధవి నీరసంగా.

భోజనం ఆర్డర్ చేసింది మాధురి. భోజనం ముగించి బయటపడ్డారు. నేను డ్రైవ్‌చేస్తాను అంటూ తాళాలు అందుకుంది మాధవి. ఇద్దరూ కలిసి వాళ్ళ ఫ్రెండ్ ఇంటికి వెళ్ళారు. ఆవిడ ఢిల్లీనుంచి బట్టలు తెప్పించి చుడీదార్లు కుట్టించి అమ్ముతుంది ఇంట్లోనే. ఆవిడకి వీళ్ళిద్దరూ రెగ్యులర్ కస్టమర్స్. మాధురికి రెడీమేడ్ బట్టలు దొరుకు తాయి కానీ మాధవి బాగా పొడుగు. కాబట్టి ప్రత్యేకంగా కుట్టించుకోవాల్సిందే.

ఆ ఫ్రెండ్ మాధవికోసం స్పెషల్‌గా కుట్టించి అమ్ముతుంది. అదృష్టవశాత్తూ ఆవిడ ఒక డ్రెస్ కుట్టించి రెడీగా వుంచింది. హమ్మయ్య రేపటి సెమినార్‌కి కొత్త డ్రెస్ వచ్చేసింది అని ఆనందపడింది మాధవి. అక్కడినుంచి బయలుదేరి దార్లో ఐస్‌క్రీం పార్లర్‌లో దూరి కసాటా ఐస్‌క్రీం తిని తీరిగ్గా రూమ్‌కి చేరారు. బట్టలు మార్చుకుని చెరో నైటీ తగిలించుకుని మంచం పక్కకి జరిపి నేలమీదే చెరో దిండూ వేసుకుని పడుకున్నారు.



"ఆదివారం ఎప్పుడొస్తుందా అని వారం అంతా ఎదురుచూస్తాం. తీరా ఆదివారం ఖాళీగా కూర్చోవాలంటే అదో బోర్. కదూ" అంది మాధవి.

కీచుమంటూ అరిచి లేచికూచుంది మాధురి "ఈ పని హడావిడిలో పడి అసలు విషయం మర్చేపోయాను" అంది.

"నీకీ అరిచే అలవాటు ఈ జన్మకి పోదు. ఇంతకీ ఏమిటా అసలు విషయం? " స్నేహితురాలు అరిచేసరికి అదిరిపడి లేచిన మాధవి అడిగింది.

"టైమ్స్ ఆఫ్ ఇండియా పేపరేది? అందులో మాంచి మేచ్ గురించి వుంది" అంటూ లేచింది మాధురి.

తల బాదుకుంది మాధవి. 'పట్టువదలని విక్రమార్కుడు మళ్ళీ చెట్టు ఎక్కాడు' అన్నట్టు "ఇప్పటికి ఎన్ని ప్రకటనలు చూశావ్. ఎన్ని లెటర్స్ రాశావ్? నీ ఓపికకి మెచ్చుకోవాలే" జాలీ, విసుగూ మేళవించాయి మాధవి గొంతులో.

"ఏం చెయ్యను. ఒంటరిజీవితం విసుగ్గా వుంది. తోడుకోసం వెదుకులాడుతూ వుంటే ఆ జీవితం ఎండమావిలా ఊరిస్తూ చేతికి అందడంలేదు. అయినా ఫర్వాలేదు. 'ఫైటర్ హమేషా జీతేగా' అని జావేద్ అఖ్తర్ చెప్పడంలేదూ" అని పేపరు తెచ్చి ముందేసుకుని కూర్చుంది.

గబగబా పేజీలు తిప్పి ఓ ప్రకటన తీసింది. ప్రకటన ఆంగ్లంలో వుంది. తెలుగులోకి తర్జుమా చేస్తే ఇదీ సారాంశం.

వధువు కావలెను. స్ఫురద్రూపి, బ్రాహ్మణ కులస్థుడు అయిన ఆరడుగుల సివిల్ ఇంజినీరు యువకునికి వధువు కావాలి. వరునికి ఉద్యోగంలేదు. వయసు ముప్ఫై. ఏదైనా పెద్ద కంపెనీలో ఎగ్జిక్యూటివ్‌గా పనిచేస్తున్న యువతిగానీ, సివిల్ సర్వీసులు పాసై ఉద్యోగం చేస్తున్న యువతిగానీ కావాలి. సంప్రదించవలసిన చిరునామా పోస్ట్ బాక్స్ 2220.

"ఎలాఉందీ మేచ్. మనకు సూటబుల్‌గా వుందికదూ" ఉత్సాహంగా అడిగింది మాధురి.

"ఎవడో ఆశబోతు వెధవ. తనకి ముప్ఫై ఏళ్ళొచ్చినా ఉద్యోగం లేదుట. పైగా పెద్ద ఉద్యోగం చేసుకునే భార్య కావాలిట. రాసేవాడికి బుద్ధిలేదు సరే. అది చూసి నువ్వు ఎగిరి గంతులు వెయ్యడం మరీ అందంగా వుంది" అంది మాధవి చిరాగ్గా.

"ఉద్యోగం లేకపోతే ఏ వ్యాపారమో వుండే వుంటుంది. చదువురానివాడు కాదు కదా! ఏదో వ్యాపకం వుండకుండా వుంటుందా? ఏది ఏమైనా నాకీ మేచ్ నచ్చింది. నేను లెటర్‌రాస్తాను. నా ఫోటోలు నీ దగ్గర బోలెడున్నాయిగా. ఆ ఆల్బమ్ ఇలా పడెయ్" అంటూ తెల్లకాయితం తీసుకుని ఉత్తరం రాయడం మొదలుపెట్టింది మాధురి.

మాధవి, మాధురి ఇద్దరిదీ ఒకే వయసు. ఇద్దరికీ ప్రాణస్నేహం. ఇద్దరూ మొట్టమొదటిసారి కలుసుకున్నది మెద్రాస్ ఐ.ఐ.టి. హాస్టల్ మెస్‌లో. బి.టెక్‌లో జేరిన కొత్తలో సీనియర్స్ ముందు కాస్త భయంగా మెసులుతూ ఇంటినుండి వచ్చి హాస్టల్‌లో వుండడం ఇద్దరికీ కొత్త కావటాన దిగులుగా వుంటున్న ఆ సమయంలో ఒకరోజు మాధవి ఏదో పనిలోపడి చాలా ఆలస్యంగా మెస్‌కి వెళ్ళింది. ఆరోజే లైబ్రరీనుండి ఆలస్యంగా వచ్చిన మాధురి కూడా అదే సమయానికి మెస్‌కి వచ్చింది. వీళ్ళిద్దరే వున్నారు ఆ సమయంలో.

చల్లారిపోయిన పదార్థాలు పక్కకి నెట్టి బల్లమీద పెట్టిన ఆవకాయ వడ్డించుకుని భోజనం చెయ్యసాగింది మాధవి. ఆరంభం మొదలు ఆఖరిదాకా ఆవకాయతోనే అన్నం తింటూ వున్న మాధురి పలకరింపుగా నవ్వి "మీరు తెలుగువాళ్ళా" అని అడిగింది. "అవునండీ మా స్వంతూరు బెజవాడ" అంది మాధవి.




"మాది రాజమండ్రి" అని చెప్పింది మాధురి.

అలా ప్రారంభం అయిన పరిచయం ప్రాణస్నేహంగా మారింది అనతికాలంలోనే. మరుసటి ఏడాది ఇద్దరూ ఒకేరూమ్‌లో జేరిపోయారు. ఇద్దరికి ఇద్దరూ మహా మేధావులు. అన్నింటా ప్రధములు వాళ్ళే

ఫైనల్ ఇయర్‌లో జీ.ఆర్.ఈ రాద్దామా అనుకుంది మాధవి. కానీ మాధురి అందుకు సుముఖంగా లేదు. కాబట్టి తనూ ఆ ప్రయత్నం మానేసింది. ఇద్దరూ కేట్ రాశారు. ఇద్దరికీ ఐ.ఐ.యమ్. బెంగుళూర్‌లో సీట్లు వచ్చాయి.

ఇద్దరూ అక్కడికి వెళ్ళారు. చదువు పూర్తి కాక మునుపే బోలెడన్ని ఆఫర్లు ఉద్యోగాల కోసం. ఇద్దరూ కూడబలుక్కుని ఒకేచోట ఉద్యోగాలు ఎంచుకున్నారు. చదువు పూర్తి చేసి ఉద్యోగాలలో చేరారు.

అయిదంకెల జీతం. డ్రైవరుతోకారు, హంగు, అట్టహాసం దర్జాగా జీవితం మొదలుపెట్టారు.

మాధవి తండ్రి మేజర్. తండ్రి వెంటే వుంటూ స్కూలింగ్ పూర్తిచేసింది మాధవి. ఆ తర్వాత మెడ్రాస్ వచ్చింది. మాధవికి ఒక అక్క వుంది. ఆవిడ ఆర్మీలో డాక్టరు. పెళ్ళయింది. భర్త కూడా ఆర్మీలో డాక్టరే.

మాధవికి ఉద్యోగం రాగానే పెళ్ళి చేయాలని ప్రయత్నం చేశారు తల్లిదండ్రులు. తగిన సంబంధం ఎక్కడా దొరకలేదు. అమ్మాయికంటే అధికుడిని తేవాలంటే ఆ వయసు అబ్బాయిలకి పెళ్ళిళ్ళు అయిపోయాయి. అమ్మాయితో సమానమైన వాడి కోసం చూశారు. ఏదీ కలిసిరాలేదు.

ఆ స్థాయికి వున్న మగపిల్లలు తమకంటే ఒక మెట్టు తక్కువగా వున్న అమ్మాయి అయితే బాగుండు అనే ఆలోచనల్లో వుండడంవల్ల అదీ సాధ్యపడలేదు.

ఒకటిరెండు సంబంధాలు వచ్చాయిగానీ అమ్మాయికీ ఆ అబ్బాయికీ అభిప్రాయాలు కుదరలేదు. అందుకని ఇరవై ఎనిమిదేళ్ళ మాధవికి తగిన సంబంధం దొరకలేదు.

ఏదో ఒకటి అని సరిపెట్టుకుని పెళ్ళిచేసుకోవడం మాధవికి ఇష్టంలేదు. "నా పన్లే నేను చేసుకోలేక తలప్రాణం తోకకి వస్తోంది. నాకు తోడు భర్త కూడా వుంటే ఇక నా గతి అధోగతే... ఆ మనిషి బట్టలు కూడా సర్ది, వండిపెట్టి ఇల్లు సర్దుకుని, ఓరి నాయనోయ్ నావల్లకాదు. తల్చుకుంటేనే వణుకు పుట్టుకొస్తోంది. పెళ్ళి కాకపోతే కొంపేం మునిగిపోదు" అంటుంది.

నాన్నగారు రిటైర్ అయ్యేదాకా ఎలాగో కాలక్షేపం చేస్తే ఆ తర్వాత వాళ్ళతో కలిసి వుండొచ్చు. అందుకని ప్రస్తుతానికి ఒక ఇంట్లో రూమ్ తీసుకుని పేయింగ్ గెస్ట్‌గా వుంటోంది.

పొద్దున్న కాఫీ టిఫెన్ వాళ్ళే ఇస్తారు. పగలు లంచ్ ఆఫీసులో ఇస్తారు. రాత్రి భోజనం మాత్రం బయటచేస్తుంది. ఓ పూట బర్గర్, మరోపూట మసాలాదోసె. ఒకరోజు పిజ్జా. ఇంకోరోజు పెసరట్టు. ఏది బడితే అది తినేస్తుంది. పుస్తకాలు చదువుతూ, మ్యూజిక్ వింటూ తీరిక సమయాల్లో కాలక్షేపం చేస్తుంది. "ఈ లైఫ్ బాగానే వుంది" అనుకుని ఆనందపడుతూ వుంటుంది.

★ ★ ★

మాధురి తండ్రి స్టేట్ గవర్నమెంట్‌లో జూనియర్ ఆఫీసర్‌గా పనిచేస్తున్నాడు. తల్లి గృహిణి. ఒక అన్నయ్య, ఒక తమ్ముడు.

అన్నయ్య సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. ఆస్ట్రేలియాలో వున్నాడు. పెళ్ళి అయ్యింది. తమ్ముడు ఇక్కడ ఇంజనీరింగ్ చేసి అమెరికాలో ఎమ్.ఎస్. చేస్తున్నాడు. ఇక్కడినుంచి వెళ్ళి అక్కడ చదువుతున్న అతని క్లాస్‌మేట్‌తో పెళ్ళి సెటిల్ అయింది. ఏవో కొన్ని అడ్డంకులు వున్నాయి. అవికాగానే పెళ్ళి జరుగుతుంది.

చిన్న కొడుకు పెళ్ళికి ముందే అతని అక్క

అయిన మాధురికి పెళ్ళి చెయ్యాలని ఎంత గానో ప్రయత్నించారు తల్లిదండ్రులు. ప్రయత్నిస్తున్నారు కూడానూ! ఏదీ కలిసిరావడం లేదు.

మాధురి కూడా పేయింగ్ గెస్ట్‌గానే వుంది కొన్నాళ్ళు. కానీ ఆ పద్ధతి నచ్చక చిన్న అపార్ట్‌మెంట్ తీసుకుని వుంటోంది. స్వయంగా వండుకుంటుంది. పగలు ఆఫీసులో తిన్నా సాయంత్రం తప్పనిసరిగా వంట చేసుకుని తింటుంది.

మాధవిలా పెళ్ళంటే భయంలేదు. పైగా తగిన వాడు దొరికితే లక్షణంగా పెళ్ళి చేసుకుని అటు ఉద్యోగం, ఇటు సంసారం, రెండూ సమర్ధించుకోగలననే ధైర్యం ఉంది.

ఇలా ఒంటరిగా బ్రతకడంలో అర్థం ఏముంది? భర్తా పిల్లలు అన్నీవుంటే ఆ అందం, సంతృప్తి ఈ బతుకులో వుంటాయా? అంటూ వుంటుంది ఎప్పుడూ.

తండ్రి చూసినన్నాళ్ళూ వూరుకున్నా ఆ తర్వాత తనూ వేట మొదలుపెట్టింది. అన్నయ్యా తమ్ముడూ అక్కడికి రమ్మంటారు గానీ మాధురికి అలా వెళ్ళడం ఇష్టంలేదు. ఇక్కడే వుండి తల్లిదండ్రులని ఓ కంట కనిపెట్టి వుండాలని ఆమె ఆలోచన.

అందుకే ఎక్కడ ఏ అవకాశం వచ్చినా వదలకుండా ప్రయత్నాలు చేస్తూనే వుంటుంది. పేపర్లో పడిన ఆ ప్రకటనకి సమాధానం రాసి పోస్ట్‌బాక్స్ నంబర్‌కి పోస్ట్ చేసింది. నాలుగురోజుల తర్వాత ఇంటికి వచ్చేసరికి కనిపించింది ఒక ఉత్తరం. చక్కని తెల్లటి కవర్‌పైన "ఫొటో ఇన్‌సైడ్ డూ నాట్ బెండ్" అని రాసి వుంది. ఓపెన్ చేసి చూసింది. తెల్లని మెత్తని కాయితం. దానిమీద ముత్యాల వంటి దస్తూరి. ఫొటో జతపరచి వుంది.

మీరెంతో సహృదయంతో రాసిన లెటర్ అందింది. కృతజ్ఞతలు. నా పొడవు ఆరడుగులు. మీ పొడవు అయిదూ రెండు అని తెలియచేశారు. ఈడూజోడుగా వుండదని నా అభిప్రాయం. అందుకే మీ ఫొటో తిప్పి పంపుతున్నాను. మన్నించగలరు. మీ జీవితంలో అంతా మంచి జరగాలని ఆశిస్తూ...!" అంటూ కింద సంతకం.

ఉసూరుమంటూ నీరుగారిపోయింది మాధురి. లోపలికి వెళ్ళి ఆ కవర్ బల్లమీద పడేసి కాఫీ కలుపుకుని వచ్చి కూర్చుంది. కాఫీ తాగేసరికి కాస్త మనసు కుదుటపడింది. గెలుపు-ఓటమి వీటి సంగమమే జీవితం అంటే అనుకుని మళ్ళీ ఆ కవరు తీసుకుంది.

ఆ ఉత్తరం మరోసారి చదివింది. ఎందుకో ఆ దస్తూరి, అతి మర్యాదగా వ్యవహరించిన తీరు ఆమెకెంతో నచ్చాయి. అది వరకు ఇలా ఎన్నో ఉత్తరాలు రాసినా ఎవరూ సమాధానం రాయలేదు. ఎవరైనా తాము ఉత్తరం రాస్తే సమాధానం కోసం ఎదురుచూస్తారనే చిన్న విషయాన్ని గుర్తించి ఎంతో సున్నితంగా తిరస్కరిస్తూ సమాధానం రాసిన ఆ వ్యక్తి సభ్యతను అభినందించకుండా వుండలేకపోయింది.

ఫొటోతీసి ఆల్బమ్‌లో పెడుతూ వుంటే పక్కనే కనిపించింది. మాధవి ఫొటో... మరుక్షణం మెరుపులాంటి ఆలోచన వచ్చింది. మాధవి అయిదడుగుల ఏడు అంగుళాలు పొడవు. వెంటనే మాధవి ఫొటో జతపరిచి మరో ఉత్తరం రాసి ఆ పోస్ట్‌బాక్స్ నంబర్‌కి పోస్ట్ చేసింది.

అప్పటికప్పుడే ఫోన్‌చేసి మాధవితో ఈ విషయం చెప్పింది. చెడామడా తిట్టిపోసింది మాధవి. "నీకేమైనా బుద్ధివుందా? అసలైనా నన్నడగకుండా ఎందుకు పంపించావ్? అంతా నీ ఇష్టమేనా? " అని చిరాకుపడింది.

"ఎందుకో పంపించాలనిపించింది. పంపించాను. స్నేహితురాలిగా నాకా మాత్రం అధికారం వుందని అనుకున్నాను. లేదని నువ్వు చెప్పావు కదా. ఇకముందు ఇలా చెయ్యనులే" అంది మాధురి కాస్త



సచిత్ర విచిత్రం

# శునకప్రేమ

ఇంగ్లాండులోని యార్క్‌షైర్ అనే ఊళ్లో నివశించే రాబర్ట్‌బ్రాడ్‌ఫోర్డ్‌కి తన పెంపుడు కుక్కంటే ప్రాణం. అతను ఆర్టిస్ట్ కూడా. దాంతో తనకిష్టమైన ఆ కుక్క పిల్ల తల ఆకారాన్ని ఆకులు, కొమ్మలతో రూపొందించాడు. ఈ మోడల్ ఎత్తు 15 అడుగులు. దాని పేరు కూడా ఆ కుక్క పిల్లపేరే ట్రెండీ.

యార్క్‌షైర్ జనం మునిసిపల్ పార్క్‌లోని దీన్ని సందర్శించడానికి వస్తున్నారు. లోకల్ టీవీల్లో అదొక న్యూస్ ఐటం కూడా అయింది.

నిష్టూరంగా.

"అది కాదే! నాకేమిటో ఆ మనిషి ఐడి యానే నచ్చలేదు. అందుకే నువ్వీపని చేశావని చిరాకువేసింది. అంతేకానీ నీకు అధికారం లేదని నేను అంటానా? ఆ మాట కొస్తే, తగినవాడిని నువ్వేచూసి పెళ్ళిముహూర్తం పెట్టించినా కాదనను" అంది మాధవి.

"ఆ అదృష్టం నాకు పట్టాలేకానీ అంతపనీ చేస్తాను" అంది మాధురి.

మర్నాటికి ఆ విషయం మర్చిపోయారు ఇద్దరూ. వారంరోజులు గడిచిపోయాయి.

"ఇంటికి పోదాం పద. ఈపూట స్పెషల్ ఐటమ్ చేస్తాను. కలిసి భోజనం చేద్దాం" అంది మాధురి.

"నిజంగా నీ ఓపికకి సాష్టాంగ నమస్కారం చెయ్యాలే. ఇప్పటివరకూ హూనం హూనం అయిపోయాం. బుర్ర వేడెక్కిపోయింది. నాకైతే కదిలే ఓపిక లేదు. నువ్వేమో స్పెషల్స్‌తో వంట చేస్తాను అంటున్నావ్" అంది మాధవి.

"వంట చెయ్యడం నాకు రిలాక్సేషన్" అంది మాధురి.

ఇద్దరూ కార్లో మాధురి ఇంటికి వచ్చారు. లెటర్ బాక్సులో ఉత్తరాలు కనిపించాయి. అవి అందుకుని లిఫ్ట్‌లోకి నడిచింది మాధురి. ఏవో షేర్ అప్లికేషన్లు, ఒక శుభలేఖ, టెలిఫోన్ బిల్, ఆఖరుగా ఆ తెల్లకవరు.

అదే దస్తూరి, ఫొటో ఉంది. భద్రం, మడవద్దు. అనే విజ్ఞప్తితో వుంది.

"మాధవీ ఇదుగో ఆ పోస్టుబాక్స్ దగ్గర నుండి సమాధానం వచ్చింది" అంటూ కారిడార్లోనే ఓపెన్ చేసింది. ఉత్తరానికి పిన్ చేసివున్న ఫొటో చూడగానే "అబ్బ ఎంత హేండ్‌సమ్‌గా వున్నాడో" అంది.

"ముందు తలుపు తియ్ మాధురీ" విసుక్కుంది మాధవి.

ఆ ఉత్తరాలన్నీ మాధవి చేతికిచ్చి తలుపు తీసింది. లోపలికి వెళ్ళి కాఫీ కలుపుకు వచ్చింది. కాఫీ కప్పు అందుకుని ఆ ఫొటో చూసింది మాధవి.

నిజంగా చాలా అందంగా వున్నాడతను.

రెండు పేజీలమీద తన వివరాలన్నీ రాశాడు.

చదువు, హాబీలు, కుటుంబ వివరాలు ఇవన్నీ మామూలే. ఆఖరు పేరామాత్రం భిన్నంగా వుంది.

"నాకు ప్రస్తుతం ఉద్యోగంలేదు. గతంలో రెండుమూడు చోట్ల పనిచేసినా నచ్చక ఆర్నెల్లు తిరక్కుండానే మానేశాను. చెయ్యలేక, చాతకాక కాదు. చేసేపని నచ్చక మానేశాను. సమాజంలో ఎన్నోమార్పులు వచ్చాయి. స్త్రీ పురుషులు అన్నిటా సమానం అని అందరం గ్రహించాం. కాబట్టి ఆర్థిక శాఖ నా కాబోయే భార్య నిర్వహిస్తే మిగిలిన పనులన్నీ (పిల్లలని కనడం తప్పించి) నేను సమర్థించగలననే ధైర్యం నమ్మకం నాకున్నాయి. అందుకే ఈ నిర్ణయం తీసుకున్నాను.

మీ ఫొటో, వివరాలు నాకు నచ్చాయి. నా ఫొటో, నా అభిప్రాయం మీకు నచ్చితే కింద ఇచ్చిన పేజర్ నంబర్‌కి తెలియచేయండి.

నచ్చకపోతే నా ఫొటో నాకు తిప్పి పంపండి. మీ ఫొటో మీకు పంపుతాను.

అభినందనలతో,

-మధుసూదన్"

ఇద్దరూ విడివిడిగా రెండేసి సార్లు చదివి కలిసి మరో రెండుసార్లు చదివారు.

"ఏమంటావ్?" అంది మాధురి.

"ఏముంది అనేందుకు? ఇదేదో తిరకాసు వ్యవహారం లాగానే వుంది. వింతమనిషీ, విచిత్రమైన ఆలోచనలు. పోనిద్దూ. నాకసలు పెళ్ళిమీద అంత ఇంట్రెస్టేలేదు" అనేసింది మాధవి.

"సర్లే పద. భోజనం చేద్దాం" అంటూ లేచింది మాధురి.

పొద్దున్న చేసి వుంచిన వంకాయకూర, మజ్జిగ పులుసు ఫ్రిజ్‌లోంచి తీసి వేడిచేసింది. రైస్‌కుక్కర్‌లోంచి అన్నం బయటికి తీసింది.

వంటకాలు అద్భుతంగా వుండడంతో ఆవురావురుమంటూ భోజనం చేసింది మాధవి. "అబ్బ పీకలదాకా తినేశాను. కదిలే ఓపికలేదు" అంది ఆవలిస్తూ.

"కదలమని ఎవరన్నారు? ఇక్కడే పడుకో" అంది మాధురి.

ఇద్దరూవంటిల్లు సర్దేసి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళారు. డబల్‌కాట్‌మీద పడుకున్నారు. ఏ.సి. ఆన్‌చేసి లైటుతీసి బెడ్‌లైట్ వేసింది మాధురి.

కాసేపు ఏదో ఆలోచించింది "రేపు ఆదివారం కదూ. మళ్ళీ మేట్రిమోనియల్ కాలమ్ చూడాలి" అంది హఠాత్తుగా.

"మాధురీ పెళ్ళంటే నీకంత ఇష్టమా? ఎందుకింత ఆరాటపడతావ్. పెళ్ళి కాకపోతే బతకలేమా? మనకేం తక్కువ? ఇంత లెవెల్లో ఉండి పల్లెటూరి పిల్లలా పెళ్ళికోసం తహతహలాడుతూవుంటే చూడ్డానికి ఎంత ఫన్నీగా వుందో తెలుసా? " అంది మాధవి విసుగ్గా.

"ఎవరి అభిప్రాయం వారిది. నువ్వు పెళ్ళొద్దు అంటూవుంటే నాకూ ఫన్నీగానే వుంది. నాకు పెళ్ళంటే చాలా ఇష్టం. మనకేం తక్కువలేదు. ఆ మాట అక్షరాలా నిజం. బోలెడంత డబ్బు, హోదా అన్నీ వున్నాయి. కానీ తెల్లవారి లేస్తే తినడం, పనిచెయ్యడం ఆపైన నిద్రపోవడం. ఇదేనా జీవితం అంటే. ఇంకేమీ వద్దా?

"నా మటుకు నాకు ఈ జీవితం ఖాళీగా అనిపిస్తుంది. ఎంతకాలం ఇలా బతుకుతాం. డబ్బు సంపాదించి కూడబెట్టి ఏం చేస్తాం? పోనీ సినిమాల్లో లాగా మన వెనక బోలెడు బాదరబందీలు, బాధ్యతలూ వున్నా బాగుండేది. చెల్లెళ్ళ పెళ్ళిళ్లూ, తమ్ముళ్ళ చదువులూ అన్నీ నిర్వహించి కొవ్వొత్తిలా కాలిపోతూ వెలుగునిచ్చాం అని మన త్యాగానికి మనమే మురిసిపోయే వాళ్ళం. అవీలేవు. మనమీద ఆధారపడిన వాళ్ళుగానీ మన సంపాదన ఆశించేవాళ్ళు గానీ ఎవరూలేరు. అమ్మానాన్నా వున్నారంటే వాళ్ళు ఎన్నాళ్ళుంటారు? అన్నదమ్ములు వాళ్ళ జీవితాలు వాళ్ళవి. ఆ బాంధవ్యాలు బాల్యంతోనే సరి. ఇక ఎవరికోసం?

"ఒంటరితనం భూతంలా వెంటబెట్టి బాధిస్తోంది. మంచిబట్టలు కట్టుకుని అందంగా తయారై అద్దంలో చూసుకుంటే ఎందుకొచ్చిన అందం? అడవిగాచిన వెన్నెల అయిపోతోంది అనిపిస్తుంది. ఈ అందాన్ని ఆరాధించే వాడికోసం అణువణువూ తాపత్రయపడుతుంది.

"కమ్మగా వండుకుంటానా? కానీ కడుపునిండా తినలేను. తోడుంటే కబుర్లు చెప్పుకుంటూ అన్నంతింటాం కదా అనిపిస్తుంది.

"పగలంతా పనిచేసి అలిసిపోయినా పక్కమీద చేరగానే నిద్రరాదు. శరీరమూ మనసూ ఏకమై ఎదురుతిరుగుతున్నాయి.

"పెళ్ళి పూలబాటకాదు. అందులోనూ సవాలక్ష సమస్యలున్నాయి. ఎన్నోసార్లు ఎన్నో విషయాలకి సర్దుకుపోవాలి. నిజమే. కానీ మనసైనవాడు దొరికితే అదో మధురమైన అనుభూతి. జీవితాంతం తోడుండే వ్యక్తి, నావాడు, నా స్వంతం అనే భావన జీవితాన్ని ఆనందమయం చేస్తుంది.

"వైవాహిక జీవితం, ఒక చిన్న బిడ్డ, ఆ బిడ్డ చిరునవ్వులు. మాతృత్వంలోని మహదానందం, ఆ బిడ్డ భవిష్యత్తు తీర్చిదిద్దాలనే తపన. ఓహ్ ఎంత బాగుంటుంది.

"జీవితానికో అర్థం ఏర్పడాలంటే పెళ్ళికావాలని నా దృఢనిశ్చయం. పెళ్ళికోసం నేనెంతకాలం అయినా శ్రమపడతాను. నాకు వ్యక్తి దొరికేవరకూ వెదుకులాడతాను. గమ్యం చేరేవరకూ కృషి చెయ్యడం మానివేయను.

"నా తాపత్రయం అర్థంచేసుకున్నవారు

నాకు సహకరిస్తారు. ఎవరైనా నవ్వుకుంటే అది వాళ్ళ ఖర్మ" అనేసింది మాధురి.

"నేను అర్థంచేసుకున్నాను. నీ కృషి ఫలించాలని మనస్ఫూర్తిగా ఆశిస్తున్నాను" అంది మాధవి ఆప్యాయంగా.

"థాంక్యూ" అంది మాధురి.

కాసేపు అటూఇటూ పొర్లి హఠాత్తుగా లేచి కూర్చుంది మాధవి. "నేను నా రూంకి పోతాను" అంది.

"అదేవిటి? హఠాత్తుగా ఏమైంది? " అడిగింది మాధురి.

"ఏంకాలేదు, నిద్రపట్టడంలేదు. మంచి నవల ఒకటి మొదలుపెట్టాను. రాత్రి సగం దాకా చదివి పడుకున్నాను. ఇప్పుడు అది చదవాలని ప్రాణం పీకుతోంది. నేను వెళ్తాను" అంటూ లేచి కళ్ళజోడు పెట్టుకుని హాండ్‌బాగ్ అందుకుంది.

"పద డ్రాప్ చేసి వస్తాను" అంటూ లేచింది మాధురి.

"వద్దులే... ఆటోలో వెళ్తాను" వారించింది.

"పొద్దుబోయింది. ఆటో వద్దు. కారు తీసి కెళ్ళు. రేపు ఆదివారమేగా. మధ్యాహ్నం అక్కడికి వస్తాను. ఇద్దరం కలిసి ఎటైనా వెళ్దాం" అంది మాధురి కారు తాళాలు అందిస్తూ.

"నువ్వు రావాలంటే మళ్ళీ ఆటోలో రావాలికదా! నేనే వస్తాను. ఇక్కణ్నించే వెళ్దాం" అంది మాధవి.

కింది దాకా వచ్చి గుడ్‌నైట్ చెప్పింది మాధురి.

కార్లో ఇంటికి వస్తూ టైంచూసింది. పది గంటల పదినిమిషాలు. మరో అయిదు నిముషాల్లో ఇంటికి చేరుకుంది.

గేటు తాళం వేసివుంది. హారన్ విని ఇంటాయన బయటికి వచ్చాడు. మాధవిని చూసి తాళాలు తెచ్చి గేటు తీశాడు. "లేట్ అయింది కదా! మీ ఫ్రెండ్ దగ్గరికి వెళ్లారేమో అనుకున్నాం" అన్నాడు సంజాయిషీగా.

"అక్కడికే వెళ్ళాను. పనుంది, అందుకే వచ్చేశాను. నిద్రపోతున్నారా? " అని అడిగింది మాధవి.

"లేదండీ... న్యూస్ చూస్తున్నాం. ఘోరమైన ట్రైన్ ఏక్సిడెంట్ అయింది. దాదాపు అరవైమంది పోయారుట" అన్నాడాయన.

"అరే ఎక్కడేమిటి? " అని అడిగి తెలుసుకుని కారు లోపలపెట్టి మేడమీదికి వచ్చింది మాధవి.

తాళం తీసి లోపలికి వెళ్ళింది. బట్టలు మార్చుకుని నైటీ వేసుకుని టి.వి. ఆన్‌చేసి మంచంమీద వాలిపోయింది. నిజానికి నవల చదవాలని చెప్పడం అంతా వట్టిదే. ఎందుకో అక్కడ వుండాలనిపించలేదు. వూపిరాడనట్లు అయింది. ఒంటరిగా వుండాలని ఇక్కడికి వచ్చేసింది.

తీరా వచ్చాక ఎందుకొచ్చానా అనిపించింది. చచ్చేంత విసుగువేసింది. కాసేపు అటూఇటూ దొర్లింది. మాధురి మాటలు చెవుల్లో గింగురుమంటున్నాయి. తనూ బాధపడుతూనే వుంది. కాకపోతే పెళ్ళొద్దని ఆత్మవంచన చేసుకుంటూ వుంది. అంతే, సాయంత్రం ఆ ఉత్తరం చదవడం, ఆ తర్వాత మాధురి తన మనసులోని మాట చెప్పడంతో ప్రశాంతంగా వున్న నీటిలో రాయి పడినట్లు మనసులో అలజడి చెలరేగింది.

పదేపదే ఫొటోలోని రూపం వెంటాడుతూ వుంటే తలపట్టుకుని కూర్చుంది. ఏదైనా శ్రద్ధగా ఒకసారి చూస్తే గుర్తుండిపోయే మెమొరీపవర్ వుంది. పేజర్ నెంబర్ కళ్ళముందు నిలుస్తోంది. చిర్రెత్తుకొచ్చి ఫోన్ అందుకుని మెసేజ్ ఇచ్చి పుస్తకం మొహానికి అడ్డం పెట్టుకుని పడుకుంది.

అయిదు నిముషాల తర్వాత ఖచ్చితంగా పదకొండు గంటలకి ఫోన్ మోగింది. ఒక్క

వుదుటున అందుకుంది.

"హల్లో బేబీ!" అటునించి వినిపించింది తండ్రి కంఠం.

"హల్లో!" అంది. "ఏమిటమ్మా అలా వున్నావేం? " అన్నాడాయన కంగారుగా.

"ఏం లేదు డాడీ!" అనేసింది. ఆ కబురూ ఈ కబురూ చెప్తూ ఓ పదినిమిషాలు మాట్లాడి భార్యకి ఇచ్చాడు. ఆవిడ ఓ ఇరవై నిమిషాలసేపు మాట్లాడింది.

"బేబీ! నీ ఫ్రెండ్ సుధాకర్ గుర్తున్నాడా అతనికి అక్కడికే ట్రాన్స్‌ఫర్ అయిందిట. నీ నెంబర్‌కోసం ఫోన్‌చేశాడు. ఇచ్చాం. రాత్రిళ్ళు ఖచ్చితంగా ఇంట్లోనే వుంటుంది. రేపు ఆదివారం కాబట్టి లేటైనా ఫర్వాలేదు, ఇవ్వాళే చెయ్యమన్నాం" అంటూ చెప్పింది మాటల్లో.

తనివితీరా మాట్లాడి గుడ్‌నైట్ చెప్పి ఫోన్ పెట్టేసింది. మళ్ళీ పుస్తకం అందుకుంది. పన్నెండుకి మరో పదినిమిషాలు వుండనగా మళ్ళీ ఫోన్ మోగింది.

రెండు రింగులు అయ్యాక అందుకుంది.

"హల్లో!"

"హల్లో ఈజిట్ 5625780? " గంభీరంగా వినిపించిందా కంఠం.

"యస్!"

"యామై స్పీకింగ్ టూ మిస్ మాధవి? "

"యస్" అంది తడబాటు అణచుకుంటూ.

"హల్లో మాధవి! దిసీజ్ మధుసూదన్"

"హల్లో"

"మీ మెసేజ్ అందగానే ఫ్రెండింటికి వచ్చాను. బయట బూత్‌లో ఇపుడు లోకల్ కాల్స్ ఏవీ చెయ్యరు కదా! ట్రై చేస్తే ఎంగేజ్ అయివుంది మీ ఫోన్. సరే ఆఖరు ప్రయత్నంగా ట్రైచేద్దాం. లేకపోతే రేపు మార్నింగ్ ఫోన్ చేద్దాం అనుకున్నాను. లేట్ అయిందా? నిద్రపోతున్నారా? డిస్టర్బ్ అవలేదు కదా!" నిపుణుడు అయిన వాద్యకారుడు వాయించిన వాయిద్యం మోతలా వుంది అతని కంఠం. ఎనౌన్సర్ వాయిస్‌లా ఎంతో అందమైన వాయిస్.

వింటూవున్న మాధవి అతని ప్రశ్నతో ఉలిక్కిపడి.

"లేదు! ఇపుడే మా పేరెంట్స్ ఫోన్ చేశారు!" అని సమాధానం చెప్పింది.

"ఓ! అలాగా! మీ పేరెంట్స్ ఎక్కడ వుంటారు? "

"చండీఘడ్‌లో!" చెప్పింది.

"నేనూ ఇక్కడ వంటరిగానే వుంటున్నాను. మా పేరెంట్స్ గుంటూరులో వుంటున్నారు"

"అవును... మీ లెటర్‌లో రాశారు" చెప్పింది.

"అవును కదా! మర్చిపోయాను" అన్నాడు.

కాసేపు ఇరుపక్కలా మౌనం.

"న్యూస్ చూశారా? " హఠాత్తుగా అడిగాడు.

"చూడలేదు... ఆలస్యంగా వచ్చాను. ఏదో ట్రైన్ ఏక్సిడెంట్‌ట కదూ! మా ఇంటి ఓనర్ చెప్పారు" అంది మాధవి.

"అవునండీ. ఘోరం ప్రస్తుతం అరవై మంది అంటున్నారుగానీ ఇంకా చాలా మంది చచ్చిపోయి వుంటారు" అంటూ మొదలుపెట్టి ఏమిటేమిటో కబుర్లు చెప్పాడు.

అలా ఓ పది నిమిషాలు మాట్లాడుకున్నారు ఇద్దరూ.

"ఇంతకీ నన్ను కాంటాక్ట్ చెయ్యమని మెసేజ్ ఇచ్చారు కదా! ఏదైనా చెప్పాలనుకుంటున్నారా? " హఠాత్తుగా అడిగాడు.

సడన్‌గా అతనా విషయం ప్రస్తావించడంతో కాస్త తడబడింది మాధవి.

"మీ లెటర్ ఇవ్వాళ సాయంత్రం అందింది. ఆ విషయం చెప్దామని" అనేసింది.

"ఓ... థాంక్యూ థాంక్యూ వెరీమచ్" అన్నాడు మర్యాదగా.

మళ్ళీ ఇద్దరూ మౌనంగా వుండిపో




యారు.

"మనిద్దరం ఎక్కడైనా కలుసుకుని మాట్లాడుకుందామా? " అడిగాడు.

హమ్మయ్య అనుకుంది మాధవి "అలాగే... తప్పకుండా కలుసుకుందాం" అంది.

"నేనెప్పుడైనా రెడీయే. మీరు వీలు చూసుకుని చెప్పండి" అన్నాడు.

"అలాగే! నెక్స్ట్‌వీక్ అంతా నేను బిజీ. ఆ తర్వాత వారంలో ఎప్పుడైనా మీట్ అవుదాం" అని చెప్పింది.

"అలాగే... నన్ను మళ్ళీ కాంటాక్ట్ చెయ్యమంటారా? " అడిగాడు.

"వద్దులెండి... మీ నెంబరుందిగా. నేనే చెప్తాను" అంది.

"ఓ. కె. దెన్. సీయూ గుడ్‌నైట్!" అన్నాడు.

"గుడ్‌నైట్" అంది మాధవి.

ఫోన్ డిస్కనెక్ట్ అయింది.

ఫోన్ పెట్టేసిన తర్వాత దుఃఖం వచ్చింది. ఏమిటి తను చేసిన పని ఏదో ఆ వెర్రిది ఉత్తరం రాసింది. ఈ మహానుభావుడు సమాధానం రాశాడు. మధ్యలో తన తెలివితేటలు ఏమయ్యాయి? తనంతటతనే ఇదంతా చేస్తుంటే మమ్మీ, డాడీ ఎంతబాధపడతారు? అక్కా, బావగారూ ఎగతాళి చెయ్యరూ. తను ఊ అంటే రంగంలోకి దూకి దేశం అంతా గాలించి తగిన వరుడిని ఎంపికచేయగల వాళ్ళు తనకు అండగా వుండగా ఇదేం పని.

తల్చుకుంటూ వుంటే నీరసం వచ్చింది. లేచి ఫ్రిజ్‌లోంచి కోకాకోలా కేన్ తెచ్చుకుని తాపీగా గుటకలు వేస్తూ తాగుతూవుంటే గొప్ప రిలీఫ్‌గా అనిపించింది.

అయినా ఇప్పుడేం మించిపోయింది. ఓ ఫోన్ చేసింది. అతనూ ఫోన్‌చేసి మాట్లాడాడు. అంతేగా. ఇక అంతటితో సరిపెడితే సరి. ఎలాగూ తనే ఫోన్ చెయ్యాలి. చెయ్యకుండా వూరుకుంటేసరి. కోక్ పూర్తిచేసి టిన్ పక్కన పడేసి దుప్పటి కప్పుకుని పడుకుంది.

తనూరుకుంటే అతనూరుకుంటాడా? తన నెంబర్ తెలిసిందికాబట్టి ఫోన్‌చేసి అల్లరి చేస్తే? వెంటబడి వేధిస్తే?

ఏంఫర్వాలేదు. అలా జరిగితే మర్యాదగా చెప్పి చూస్తుంది. అప్పటికీ లొంగకపోతే పోలీస్ కంప్లయింట్ ఇస్తే వాళ్ళే చూసుకుంటారు.

నిశ్చింతగా టి.వి. చూడసాగింది.

అనుకున్నంతా అయింది. అతను మళ్ళీ ఫోన్ చేశాడు. తన అభిప్రాయం చెప్తే మండిపడి పెద్దపెద్దగా అరవసాగాడు. లెక్క చెయ్యకుండా ఫోన్ పెట్టేసింది మాధవి.

వూరుకుంటాడా మళ్ళీ ఫోన్‌చేశాడు? మాధవి ఫోన్ తియ్యలేదు. నిర్విరామంగా రింగ్ అవుతోంది ఫోన్.

ఉలిక్కిపడి లేచింది మాధవి. నిజంగానే ఫోన్ మోగుతోంది. టి.వి.ఆన్ అయే వుంది. టైమ్ చూస్తే తెల్లవారుజాము మూడున్నర. ఇప్పుడెవరా ఫోన్‌చేశారు అనుకుంటూ ఫోన్ తీసింది.

"కంగ్రాట్యులేషన్స్ మేడమ్! మీకు మనవడు పుట్టాడు" అంది అవతలి కంఠం.

"నాకా! మనవడా? " నిద్రలోనుండి లేచిన మాధవి అయోమయంగా అడిగింది.

"ఔను మేడమ్! ఇపుడే రెండునలభైకి పుట్టాడు. అసలు మామూలుగా మా అంతట మేము చెప్పం. మీరు మరీ రిక్వెస్ట్ చేశారు కదా అని చెప్తున్నాను. డాక్టరుగారికి చెప్పకండి నేనిలా ఫోన్‌చేశానని. బేబీ బావున్నాడు. బరువు....

తెలివితెచ్చుకుంది మాధవి. ఆపూ స్టాపూ లేకుండా చెప్పుకుపోతున్న ఆ శాల్తీని వారించి "సారీ రాంగ్‌నెంబర్" అనేసి ఫోన్ పెట్టేసింది.

టి.వి. ఆపేసి మళ్ళీ పడుకుంది. కానీ నిద్ర దరిదాపులకు రాలేదు. ఏవో ఆలోచనలు. చూస్తుండగానే తెల్లవారింది.

కాఫీ తాగి పేపర్లు ముందేసుకుని

కూర్చుంది. దేనిమీదా మనసు నిలవదు. ఏదో అలజడి, చికాకు, సన్నగా తలనెప్పి.

ఎప్పుడూ పావుగంటలో సాల్వ్‌చేసే పజిల్ పదినిముషాలు గడిచినా నాలుగు అడ్డంలోనే వుండేసరికి చిర్రెత్తుకొచ్చింది మాధవికి. పక్కన పిడుగులు పడుతున్నా ఏకాగ్రత చెదరదు. అలాటిది?

పేపరు మూసేసి పక్కన పడేసి సమస్య గురించి సీరియస్‌గా ఆలోచించింది. లాభం లేదు. ఇలా అవస్థపడే బదులు అతన్ని కలుసుకుని మాట్లాడి తాడో పేడో నిర్ణయించుకుంటే సరిపోతుంది.

వెంటనే ఫోన్ అందుకుని మేసేజ్ ఇచ్చింది. పావుగంటలో ఫోన్ వచ్చింది.

"గుడ్‌మార్నింగ్ మేడమ్" అన్నాడు మధు.

"గుడ్‌మార్నింగ్, మీరు ఇవ్వాళ సాయంత్రం ఫ్రీగా వుంటారా? " సూటిగా అడిగింది.

"ఫ్రీగానే వుంటాను" చెప్పాడు.

"సరే మనం ఈవినింగ్ కలుసుకుందాం!"

"ఎక్కడ? ఎన్నింటికి? " అడిగాడు.

చెప్పింది. "ఆరున్నరకి నేను అక్కడికి వస్తాను" అని చెప్పింది.

"సరే" అన్నాడు. ఫోన్ పెట్టేసి ఆ హోటల్‌కి ఫోన్ చేసి టేబిల్ రిజర్వ్‌చేసింది. వినయంగా వివరాలు నోట్‌చేసుకుని "మా రెస్టారెంట్ సెవెన్‌కి ఓపెన్ అవుతుంది మేడమ్" అని చెప్పాడు అక్కడి రిసెప్షనిస్ట్.

ఫోన్ పెట్టి కాసేపు ఆలోచించింది. అతనికి ఆరున్నరకి రమ్మని చెప్పింది. రెస్టారెంట్ సెవెన్‌కి ఓపెన్ అవుతుంది. మళ్ళీ మేసేజ్ ఇచ్చి టైం మార్చుదామా అనుకుంది.

మళ్ళీ ఫోన్ చెయ్యాలంటే బద్ధకం అనిపించింది. సరిగ్గా చెప్పిన టైంకే వస్తాడని గారంటీ ఏమీలేదు. అంతగా వచ్చినా ఓ అరగంట అక్కడే వెయిట్ చేస్తాడు అనుకుంది.

స్నానంచేసి తయారై మాధురి దగ్గరకు వెళ్ళింది.

అప్పటికే పన్లన్నీ ముగించుకుని మాధవి కోసం వెయిట్ చేస్తోంది మాధురి.

"వచ్చావా? నీకోసమే చూస్తున్నాను. అక్కడెక్కడో కాశ్మీర్ హేండీక్రాఫ్ట్స్ ఎగ్జిబిషన్ కమ్ సేల్ వుందిట. వెళ్ళి చూద్దాం. మంచి కార్పెట్ తీసుకోవాలి, ఎన్నాళ్లనించో అనుకుంటున్నా కుదరడంలేదు. ఒంటిగంట దాకా అక్కడే గడిపి వస్తూ లంచ్‌చేసి వచ్చేద్దాం!" అంది గబగబా.

"అలాగే వెళ్దాంలే కాసేపు కూర్చో నీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి" అంటూ ఫ్రెండ్ పక్కన కూర్చుంది మాధవి.

"చెప్పు" వినడానికి సిద్ధం అయిపోయింది మాధురి.

"నిన్న రాత్రి అతనికి ఫోన్ చేశాను" చెప్పింది మాధవి.

"అతనికా? అతనంటే? "

"అతనే. మధుసూదన్! అదే పోస్ట్‌బాక్స్ నంబర్ అతనికి"

అదిరిపడింది మాధురి "నిజంగా? నిజంగానే చేశావా? ఎప్పుడు? నిన్న వెళ్ళడమే చాలా లేట్‌గా వెళ్ళావుకదా! ఫోనెప్పుడు చేశావ్? ఏం మాట్లాడావ్. అతను ఏమన్నాడు? ? "

సంభ్రమంగా ప్రశ్నల వర్షం కురిపించింది.

"ఓపికగా పూసగుచ్చినట్లు జరిగింది అంతా చెప్పింది మాధవి. ఓసారి మాట్లాడేస్తే విషయం అర్థమైపోతుంది కదా! అందుకే ఇవ్వాళే ఫిక్స్ చేశాను" అంది.

"మంచి పని చేశావ్. ఆలస్యం అమృతం విషం అన్నారు. ఇలాటి విషయాలలో వూరికే ఆలోచిస్తూ కూర్చోకుండా ఏదో ఒక నిర్ణయం తీసుకోడం చాలా మంచిది" అభినందించింది మాధురి.

"పద వెళ్దాం" అంటూ లేచిన ఫ్రెండ్‌ని

చెయ్యిలాగి కూర్చోబెట్టింది.

"వద్దు. ఇప్పుడు బయటినుంచి వచ్చేసరికి ఏ మూడో అవుతుంది. మళ్ళీ సాయంత్రం నువ్వు వెళ్ళాలి. అలసటగా చిరాగ్గా వుంటుంది నీకు. జీవితానికి సంబంధించి అతి ముఖ్యమైన నిర్ణయం తీసుకునేరోజు. హాయిగా ఇంట్లోనే వుండి రిలాక్స్ అవు. సాయంత్రానికి శరీరం మనసూ ఫ్రెష్‌గా వుంటాయి" అంది.

"నువ్వు కాసేపు ఏదైనా చదువుకుంటూ కాలక్షేపం చెయ్. క్షణంలో వంట చేసేస్తా" అంటూ లేచి వంటింట్లోకి వెళ్ళిపోయింది. వంట ముగించి వచ్చి స్నేహితురాలితో కబుర్లు చెప్పింది. భోజనాలు అవ్వగానే "పద నీ రూమ్‌కి వెళ్దాం" అంటూ బయలు దేరదీసింది.

అక్కడికి వెళ్ళగానే బీరువా తీసి అది కాదు ఇది, ఇది కాదు అది అని ఎంచి, చివ రికో డ్రెస్ తీసింది. ఇంటివారిదగ్గరనుండి ఇస్త్రీ పెట్టి తెప్పించి మరోసారి నీట్‌గా ఇస్త్రీ చేసి హేంగర్‌కి తగిలించింది. దానికి తగిన చెప్పులు, నగలు, వగైరాలన్నీ ఎంచి పక్కన పెట్టింది.

"నువ్వు ఫేస్ పేక్ వేసుకో" అని ఆర్డర్ వేసింది.

"ఏమిటే ఈ హడావిడి అంతా?" విసు క్కుంది మాధవి.

"హడావిడి ఏముంది? నిన్నేమైనా పట్టు చీర కట్టుకుని వంకీ వడ్డాణం పెట్టుకోమం టున్నానా? స్పెషల్ అకేషన్ కాబట్టి కాస్త శ్రద్ధతీసుకుని దర్జాగా అందంగా కనిపించేలా తయారవమని అంటున్నాను. అదీ తప్పేనా? ఆఫీసు తరపున ఏదైనా పార్టీలూ, ఫంక్షన్లూ అయితే ముందుగానే ప్లాన్ చేసు కుని తయారవుతున్నామా లేదా? అటువం టిది ఇప్పుడు ప్రత్యేకంగా తయారయితే వచ్చిన నష్టం ఏమిటటా?" అంటూ ఎదురు ప్రశ్నవేసింది.

మాధురి చెప్పిన దాంట్లో బలం వుండ డంతో ఇక వాదించలేదు మాధవి. లేచి వెళ్ళి డ్రెస్సింగ్ టేబుల్ దగ్గర కూర్చుని ఫేస్ పాక్ వేసుకుంది.

అయిదు గంటలదాకా కబుర్లు చెప్పుకుని కాఫీ తాగి వెళ్ళి షాంపూతో తల రుద్దుకుని స్నానం చేసి వచ్చింది. ఆరుగంటలకు తలుపు తాళంవేసి బయటికి వచ్చారు ఇద్దరూ! మాధురి డ్రైవింగ్ సీట్లో కూర్చుంది.

తన ఇంటికి చేరగానే దిగిపోయింది. మాధవి డ్రైవింగ్ సీట్‌లోకి జరిగింది.

"బెస్ట్ ఆఫ్ లక్! రాగానే నాకు ఫోన్ చెయ్యి. నీ ఫోన్‌కోసం వెయిట్‌చేస్తూ వుంటాను" అంటూ చెయ్యి అందించింది.

"ఫోనెందుకు? నేనే వస్తాను" అంది మాధవి.

"క్షేమంగా వెళ్ళి లాభంగా తిరిగిరా!" అంది మాధురి నవ్వుతూ.

కారు స్టార్ట్‌చేసి బై చెప్పేసి ముందుకు సాగింది మాధవి. ఎందుకో కాస్త నెర్వస్‌గా అనిపించింది. అయిదు నిముషాల్లో మామూలు స్థితికి వచ్చేసింది.

ఆదివారం సాయంత్రం కాబట్టి రోడ్లు ఖాళీగానే వున్నాయి. అయినా కంగారుపడ కుండా నెమ్మదిగా సరిగ్గా ఆరున్నరకి గమ్యం చేరింది. హోటల్ గేటులోకి కారు పోని స్తుంటే ఎడమవైపునుండి ఒక కావసాకి బైక్ వేగంగా వచ్చి కారుకంటే ముందు గేట్లోనించి హోటల్‌లోకి వెళ్ళింది. ఆ బైక్ మీది వ్యక్తిని చూడగానే గుర్తుపట్టింది మాధవి.

అతనే... పంక్చువల్ మనిషిలాగే వున్నాడు. ఫర్వాలేదు అనుకుంది. బైక్‌మీద వున్నాడుకాబట్టి తను చూడగలిగింది. అతను తనని చూశాడోలేదో... చిన్న సందేహం కలిగింది.

కారు పార్క్‌చేసి దిగేసరికి ఎదురుగా వున్నాడతను.

"గుడ్ ఈవెనింగ్!" అంటూ విష్ చేశాడు.

"గుడ్ ఈవెనింగ్" బదులు చెప్పింది



మాధవి.

ఎదురుగా వున్న మాధవిని పరిశీలనగా చూశాడు. తెల్లగా మల్లిరేకులా వున్న డ్రెస్. దాని మీద ఎర్రని ఎంబ్రాయిడరీ చేసి వుంది. వీపుమీద పరుచుకుని వుంది నల్లని జుట్టు. మెడలో సన్నని ముత్యాల హారం. చేతికో ముత్యాల



గాజు. మరోచేతికి వాచీ. నల్లని శాండిల్స్. ఫొటోలో వున్నట్లే అందంగా వుంది. కాకపోతే ఇలా ప్రత్యక్షంగా చూస్తూవుంటే మనిషిలోని హుందాతనం, తెలివితేటలు, అందాన్ని మించిపోయి స్పష్టంగా కనిపిస్తున్నాయి. చిరునవ్వు మెరిసింది అతని పెదవులమీద.

ఒక్కక్షణం సంకోచించి తలెత్తి చూసింది. ఫెయిర్ కాంప్లెక్షన్. మంచి పొడవు. దానికి తగిన లావు. క్రీం కలర్ షర్టు, డార్క్‌కలర్ పాంట్‌లో టక్‌చేశాడు. అద్దినట్లు వున్నాయి ఆ బట్టలు. కాళ్ళకు నిగనిగ మెరుస్తున్న షూ. చక్కటి ముఖ వర్ఛస్సు. నల్లటి క్రాఫ్. దానికి సరిజోడుగా నల్లటి మీసం. గాలిలో తేలివస్తున్న పెర్‌ఫ్యూమ్ పరిమళం. ఠీవిగా దర్జాగా వున్నాడు. మాధవి పెదవులు సంతోషంతో విచ్చుకున్నాయి.

"రెస్టారెంట్ సెవెన్‌కిగానీ ఓపెన్ చెయ్య రుట. మనం ఈలోగా ఎక్కడికైనా వెళ్ళొద్దామా?" అడిగింది.

టైం చూసుకున్నాడు. "ఎంత? ఇంక అర గంటేగా. ఇక్కడే కాలక్షేపం చేసేద్దాం. డిన్నర్ అయ్యాక ఎక్కడికైనా వెళ్దాం" అన్నాడు.

"ఓ. కె" అంది మాధవి.

ఆ హోటల్ ముందు, విశాలమైన లాన్ వుంది. లోపల రకరకాల పూలమొక్కలున్నాయి. మధ్యమధ్య ఫౌంటెన్లు అందంగా నీళ్ళు విరజిమ్ముతున్నాయి.

లాన్ పక్కగా నడవసాగారు ఇద్దరూ. "మీ గురించి ఏమైనా చెప్పండి" అన్నాడు మధు.

తన ఫ్యామిలీ గురించి చెప్పింది. తన గురించి చెప్పసాగింది "స్కూల్ డేస్‌లో, తర్వాత కాలేజి డేస్‌లో చదువులో నేను ఎప్పుడూ ఫస్ట్‌నే వుండేదాన్ని. చదువేకాదు, స్పోర్ట్స్‌లోనూ నేనే ఫస్ట్. ఎస్సే కాంపిటీషన్‌కి వెళ్ళినా, డిబేట్‌లో పాల్గొన్నా ఫస్ట్‌ప్రైజ్ నాదే. ఒక్కముక్కలో చెప్పాలంటే సెకండ్ ప్లేస్ ఎలా వుంటుందో నేను ఎరుగను. ఐయాం ఆల్వేస్ టాపర్" చెప్తూవుంటే ఆ మొహం గర్వంతో, సంతోషంతో వెలిగిపోయింది.

అది గమనించి చిన్నగా నవ్వాడు మధు.

"అంతేకాదు. నాకు సర్దుకుపోయే అలవాటు లేదు. నాకు కావలసినవి అందుకోవడం తప్పించి పోతేపోయిందిలే అని నేనే నాడూ రాజీపడలేదు. ఇంతవరకూ జీవితంలో నేనెవరికీ తలవంచలేదు. ఇంతవరకూ నాకా అవసరం రాలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే ఐయాం ది బెస్ట్. ఈ మాట నేననడం కాదు నాతో పరిచయం వున్న ప్రతివాళ్ళూ నా గురించి ఈ మాటే చెప్తారు.

"జీవితంలో ఏనాడూ ఏవిధంగానూ ఓటమి ఎరుగకపోవడం నాలోని ఆత్మాభిమానాన్ని మరింత పెంచి నన్నో విచిత్రమైన వ్యక్తిగా తయారుచేసింది. ఒక్కముక్కలో చెప్పాలంటే నేను అందరు ఆడపిల్లలలాటిదాన్ని కాదు. ఐయాం క్వైట్ డిఫరెంట్" అంటూ ఖచ్చితంగా చెప్పేసింది.

ఆమె చెప్పే ప్రతి మాటా అతిశ్రద్ధగా విన్నాడు మధు.

"నా గురించి చెప్పానుగా. ఇక మీరు చెప్పండి" అంది మర్యాదగా.

మీరు చెప్పిన దానికి పూర్తిగా వ్యతిరేకం నా ఎకడమిక్ రికార్డ్. నేను చాలా ఏవరేజ్ స్టూడెంట్‌ని. సెకండ్ క్లాసులో తప్ప ఫస్టు క్లాసు నాకేనాడూ రాలేదు. ఇక క్లాసు ఫస్ట్ గురించి నేనేనాడూ ఊహించలేదు కూడా.

"ఆటలమీద నాకు ఇంట్రస్ట్‌లేదు. ఏ పోటీల్లోనూ నేను పాల్గొనలేదు. ఒకవేళ పార్టిసిపేట్ చేసినా ప్రైజ్ వచ్చేది కాదని నాగట్టి నమ్మకం. ఇంటర్ అయ్యాక మా నాన్నగారి బలవంతంమీద ఇంజనీరింగ్ చదివాను. నాలుగేళ్ళ చదువు అయిదేళ్ళు చదివి గట్టెక్కించాను.

"చదువు విషయంలో ఏవరేజ్ అయినంత మాత్రాన నేనేదో అసమర్థుడను అని నేననుకోడంలేదు. నాకిష్టమైన పనిచేసే అవకాశం నాకు లభిస్తే అందులో నా ప్రతిభ నిరూపించుకోగలననే నమ్మకం, ఆత్మవిశ్వాసం నాకున్నాయి.

"జీవితంలోని గెలుపును ఎంత ఆనందంగా స్వీకరిస్తానో ఓటమినీ అంతే ఆనందంగా స్వీకరిస్తాను. ఎటువంటి సమస్య ఎదురైనా సులభంగా పరిష్కరించుకోగలననే ఆత్మస్థైర్యం నాకుంది.

జీవితాన్ని నా కృషితో మధురంగా మలుచుకుని అనుక్షణం ఆనందంగా జీవించాలనేదే నా జీవితాశయం" తన గురించి చెప్పాడు మధు.

శ్రద్ధగా విన్నది మాధవి. కాసేపు మౌనంగా వుండిపోయారు ఇద్దరూ.

"టైం ఏడు అయింది, లోపలికి

వెళ్దామా? " అడిగింది.

"పదండి వెళ్దాం!" అన్నాడు. ఇద్దరూ లిఫ్ట్‌లో పైఅంతస్థుమీద వున్న రెస్టారెంట్‌కి వెళ్ళారు. వినయంగా ఎదురొచ్చి వివరాలు అడిగి, ఇటురండి అంటూ తీసుకువెళ్ళి ఒక మూలగా ఇద్దరికోసం అమర్చిన టేబిల్ చూపించాడు. దానిమీదనున్న రిజర్వ్‌డ్ బోర్డ్ తీసేసి లోపలికి వెళ్ళిపోయాడు.

ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు. పైఅంతస్థులో వుండటంవలన అక్కడినించి సిటీ అంతా ఎంతో అందంగా కనిపిస్తోంది.

"ఎంత బాగుంది ఈ వ్యూ" అన్నాడు మధు.

"అవును. అందుకే నాకు ఈ హోటల్ అంటే చాలా ఇష్టం. వీలయినప్పుడల్లా ఇక్కడికి వస్తాను" అంది మాధవి.

స్టీవార్డ్ వచ్చాడు. మర్యాదగా ఒక చిన్న సైజు మెనూకార్డ్ మధుకి అందించి పెద్ద మెనూ కార్డ్ మాధవిముందు వుంచాడు.

తన చేతిలోని మెనూ కార్డ్ ఓపెన్ చేసి చూసి వెంటనే తిరిగి ఇచ్చేశాడు మధు "థాంక్యూ" అంటూ!

"ఫర్వాలేదు. అలవాటు వుంటే తీసుకోండి. ఐ డోంట్ మైండ్" అంది మాధవి.

"లేదండీ, ఐ డోంట్ డ్రింక్" అన్నాడు మధు.

వెంటనే తన ఎదురుగా వున్న మెనూ కార్డే తీసింది మాధవి.

"ఆరెంజ్ ఫ్రూట్‌పంచ్ టూ" అంటూ ఆర్డర్ ఇచ్చింది.

"ఎనీ శ్నాక్స్ మేడమ్!" అన్నాడతను.

"తర్వాత ఆర్డర్ ఇస్తాను. వియ్ వాంట్ టు హేవ్ ఎ లీజర్ టైం. వియ్ ఆర్ నాట్ ఇన్ హర్రీ" అంది మాధవి.

అర్థం చేసుకున్నట్లు నవ్వాడు. "ఓ. కే. మేడమ్!" అనేసి వెళ్ళిపోయాడు.

అయిదు నిముషాల తర్వాత రెండు గ్లాసులతో ఫ్రూట్‌పంచ్ తీసుకొచ్చి టేబిల్ మీద పెట్టాడు.

గ్లాసులు అందుకున్నారు ఇద్దరూ.

"నాకు పెళ్లి అంటే అంత ఇష్టంలేదు. ఒక విధంగా భయం కూడా!" చెప్పింది మాధవి.

"భయమా? " ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును. పెళ్ళి కాగానే జీవితంలో ఎన్నో మార్పులు వస్తాయి. మరో వ్యక్తితో సర్దుకుపోవాలి. అతని కుటుంబసభ్యులతో సర్దుకుపోవాలి. అందులోనూ నేను ఆడపిల్లని కాబట్టి నాకు మరింత బాధ్యత పెరుగుతుంది.

"నాకు పనులు రావు. ఇల్లు సర్దటం, వంట చెయ్యడం వగైరా పన్లు చెయ్యడం అంటే తగని ఎలర్జీ. నేనెప్పుడూ చెయ్యాలేదు. ఆ అవసరం ఇంతవరకూ రాలేదు. పనులకు మనుషులను పెట్టుకోవచ్చు, కానీ రెస్పాన్స్‌బిలిటీ మీద పడుతుందికదా!

"నాకు పౌరుషం చాలా ఎక్కువ. ఎవరైనా మాట అంటే పడలేను. ఆడదానికి ఓర్పు వుండాలనీ భర్తతో సర్దుకుపోవాలనీ చెప్తుంది మా అమ్మ. నా స్వభావానికి సరిపడని పని అది.

"అందుకే పెళ్లిని ప్రస్తుతానికి వాయిదా వేసి ఒంటరిగా జీవితం గడపాలని నిర్ణయించుకున్నాను. ఈ జీవితం నాకు బాగానే వుంది. పోతే నాకో ఫ్రెండ్ వుంది. పేరు మాధురి. తనకి పెళ్ళంటే చాలా ఇష్టం. సీరియస్‌గా ట్రై చేస్తోంది. మీ ప్రకటన చూసి తను ఫొటో పంపించింది. మీరు రిజెక్ట్ చేశారుట. నాతో చెప్పకుండా నా ఫొటో మీకు పంపించింది.

"మీరు రిప్లై ఇచ్చారు. ఒకసారి మిమ్మల్ని కలుసుకుని మాట్లాడాలని అనిపించింది. అందుకే నిన్న మీకు ఫోన్ చేశాను"

మాధవి చెప్పింది విన్నాడు మధు.

ఇద్దరూ ఫ్రూట్ పంచ్ తాగడం ముగించారు. బేరర్ వచ్చి ఆర్డర్ తీసుకున్నాడు.

సూప్, ఆలూ చాట్, పీనట్ మసాలా. ఆర్డర్ ఇచ్చింది మాధవి.

"నాకు చిన్నతనంనుండి చదువుపట్ల పెద్దగా శ్రద్ధలేదు" చెప్పడం మొదలుపె

ట్టాడు మధు.

"నాకు సంగీతం, ఆర్ట్ అంటే చాలా ఇష్టం. మాది కొంచెం సనాతనాచారాలు పాటించే కుటుంబం. అక్క చిన్న వయసు లోనే మా మేనత్తగారి ఊరు వెళ్ళిపోయింది చదువుకోసం. తర్వాత మా బావతోనే పెళ్ళ యింది. మా నాన్నమ్మ, తాతగారు మా ఇంట్లో వుండేవారు. నాన్నమ్మకి అంతంత మాత్రం ఆరోగ్యం. అమ్మ ఆ మూడురో జులూ విడిగా కూర్చుంటే నాన్నమ్మకి నేను వంటలో సాయం చేసేవాడిని. మా నాన్న గారు పెద్దకొడుకు. కాబట్టి మా ఇంటికి వచ్చీపోయే బంధువుల తాకిడీ ఎక్కువ.

"నాన్నగారు ఇవతలిపుల్లతీసి అవతల పెట్టేవారు కాదు. అమ్మ ఒక్కర్తీ అవస్థ పడుతూవుంటే నేను అస్తమానం సాయం చేస్తూ వుండేవాడిని. అందువల్ల ఇంటిపన్లు నాకు కొత్తకాదు. సుళుసూత్రంగా చేసెయ్యగ లను.

"నా ఇంజనీరింగ్ పూర్తయ్యాక ఉద్యోగాల కోసం వేట మొదలుపెట్టాను. ఒక ప్రైవేట్ కన్‌స్ట్రక్షన్ కంపెనీలో చేరాను. రెండునెలలు చేసేసరికి విసుగొచ్చి మానేసి మరోచోట చేరాను. అదీ అంతంత మాత్రంగానే వుంది. ఉద్యోగం అంటే ఉత్సాహంగా చెయ్యాలిగానీ ఆ పేరు తల్చుకుంటేనే నిద్రా నీరసం ముంచుకొస్తూ వుంటే నేనేం చెయ్యను? అదీ మానేశాను. ప్రస్తుతం నా ఫ్రెండ్‌తో కలిసి పనిచేస్తున్నాను. వాడు ఆర్కిటెక్ట్. స్వంతంగా బిజినెస్ పెట్టుకు న్నాడు. ప్లాన్లు వెయ్యడం వగైరా చేస్తూవుం టాను. రూమ్ తీసుకుని వుంటున్నాను.

"నా చదువు పూర్తికాగానే నాకు బోలెడన్ని సంబంధాలు వచ్చాయి. అమ్మాయిలు గ్రాడ్యుయేట్లు, పి.జి. చేసినవాళ్ళు, ఇంజనీ రింగ్ చేసినవాళ్ళు. ఇలా రకరకాల సంబం ధాలు వచ్చాయి. కట్నం బాగా ముట్టచెప్తా మని వాళ్ళే ఆఫర్ చేశారు. కట్నం ఇవ్వం కానీ అన్ని లాంఛనాలూ జరిపి పెళ్ళి గ్రాండ్‌గా చేస్తాం, అని మరొకరి ప్రపోజల్. పెళ్ళి క్లుప్తంగా చేస్తాం. కట్నం యాభైవేలు. మా అమ్మాయి పేరుమీద హైదరాబాద్‌లో స్థలం వుంది అని మరో బేరం. చదువుంది కదా అబ్బాయికి, ఏదో ఉద్యోగం వేయిస్తాం. మావాడు కూడా ఉన్నాడు. వాడి పలుకుబడితో ఉద్యోగం సంపాదిం చడం అంత కష్టం కాదు అని మరొకరి ఆలోచన.

"ఇట్లా ఎన్నో సంబంధాలు వచ్చాయి. నిర్ణయం నాకే వదిలారు అమ్మా నాన్నా! ఎందుకురా ఆలస్యం? బ్రహ్మచారి బెండ కాయా అంటూ సామెతలు చెప్పి నచ్చచె ప్పారు బంధువులు.

"నిజమే, మాకై మేము అడగకుండా అంత ఇస్తాం ఇంత ఇస్తాం అంటూ వచ్చిప డుతుంటే అందులో ఏదో ఒకటి ఎంచుకుని సరే అనొచ్చు కానీ నా మనసు అందుకు అంగీకరించలేదు.

"ఈ రోజుల్లో అమ్మాయిల ఆలోచనా సరళి ఎంతో మారింది. ఎన్నో కోరికలు మనసులో దాచుకుని వైవాహిక జీవితంలో ఎంతో ఆశతో ఎన్నో కలలతో అడుగుపెడు తున్నారు. భర్తకి మంచి సంపాదన వుండా లనీ, ఇంట్లో అన్ని వస్తువులూ వుండాలనీ, కారుండాలనీ ఎన్నో కోరికలు కోరుకుంటు న్నారు. తామూ చదువుకుని, ఉద్యోగాలు చేస్తూ, తండ్రిచేత అంతంత కట్నాలు ఇప్పించి పెళ్ళిచేసుకుంటున్న ఆడపిల్ల, భర్త ఇంట్లో ఆమాత్రం సుఖాలుండాలని ఆశప డితే అది అత్యాశ కాదు. అదా అమ్మాయి హక్కు.

"కానీ నేను నాకొచ్చే జీతంతో అవన్నీ అమర్చలేను. లక్ష కట్నం ఇవ్వగలిగే తండ్రి ఇంట్లోకంటే నా ఇంట్లో ఆవిడ జీవనస్థాయి దిగజారుతుందని ఖచ్చితంగా చెప్పగలను. సుఖంగా వున్న అమ్మాయిని పెళ్ళి పేరున ఇంత మోసం చెయ్యడం నాకిష్టంలేదు.

"అందుకే ఎంతో ఆలోచించి నేనీ

నిర్ణయం తీసుకున్నాను. నా భార్య ఉద్యోగం చేస్తే, ఆ సంపాదన సుఖంగా బతకడానికి సరిపోతే నేను ఇంట్లో వుండి ఇల్లు మేనేజ్ చేస్తాను"

"మరి ఉద్యోగం పురుషలక్షణం అంటారు కదా! మీకా నమ్మకం లేదా?" సూప్ తాగుతూ అడిగింది మాధవి.

"అది పాత నానుడి. ఉద్యోగం పురుషలక్షణం అనే రోజుల్లో ఇంటికి దీపం ఇల్లాలు, ఇంటిని చూసి ఇల్లాలిని చూడాలి అని కూడా అన్నారు. మరి పెద్ద చదువులు చదివి పెద్ద ఉద్యోగాలు చేస్తున్న ఆడవాళ్ళు ఇంటికోసం ఏమాత్రం సమయం వెచ్చించగలరు?" అన్నాడు మధు.

"నిజమే!" అంది మాధవి.

"ఇప్పుడు అన్ని రంగాలలోనూ మీదే పైచేయి. ఒకే క్వాలిఫికేషన్లు వున్న అబ్బాయి, అమ్మాయి, ఒకే ఉద్యోగానికి అప్లై చేస్తే ఆ ఉద్యోగం దొరికే అవకాశాలు అమ్మాయికే ఎక్కువ ఈ రోజుల్లో. వారు అంత వృద్ధిచెంది దేశాలని ఏలుతూ వుంటే మేమేనా అంత తీసిపోయింది? మేమూ ఇంటిపట్టున వుండి సలక్షణంగా సమర్థించగలం" అన్నాడు మధు.

"మీరంత ధైర్యంగా చెప్తూంటే కాదనడానికి మాకు ఎన్ని గుండెలు?" అంది మాధవి. ఇద్దరూ నవ్వుకున్నారు.

తర్వాత జనరల్ టాపిక్స్‌వైపు మళ్లించింది మాధవి. కబుర్లు చెప్పుకుంటూ డిన్నర్ ముగించారు. ఐస్‌క్రీం తినేసి వాచీ చూసుకుంది మాధవి. "అబ్బా అప్పుడే తొమ్మిదిన్నర అయింది" అంది.

"ఎనీథింగ్ ఎల్స్ మేడమ్?" అంటూ వచ్చాడు నల్లసూట్ మనిషి.

"నో, బిల్ ప్లీజ్" అంది మాధవి.

"ఎస్ మేడమ్" అంటూ వెళ్ళిపోయాడు.

పది నిముషాల తర్వాత తిరిగివచ్చాడు. "ఇక్కడి వంటకాలు ఎలా వున్నాయ్? మీరేమైనా సజెషన్స్ ఇస్తారా?" అని మర్యాదగా అడిగి తెలుసుకుని అప్పుడు బిల్ వున్న ఫోల్డర్‌ని మధు ఎదురుగా పెట్టి వెళ్ళిపోయాడు. గతుక్కుమంది మాధవి. ఈ హోటల్ చాలా కాస్ట్‌లీ. ఇక్కడికి రమ్మని పిలిచింది తను. ఫుడ్ ఆర్డర్ చేసింది తను. ఇప్పుడు బిల్ అతని ఎదురుగా వుంది. ఏంచెయ్యాలి? ఏంచేస్తే బాగుంటుంది అని ఆలోచించసాగింది.

మధు మాత్రం కాస్తంతైనా ఆలోచించలేదు. సున్నితంగా ఆ బిల్ ఫోల్డర్‌ని మాధవి వైపుకి జరిపాడు. గుండెనిండా ఊపిరి పీల్చుకుంది మాధవి. బాగ్‌లోంచి క్రెడిట్ కార్డ్ తీసి ఫోల్డర్‌లో పెట్టేసింది.

అతనొచ్చి తీసుకువెళ్ళాడు. అయిదునిముషాల్లో తీసుకొచ్చి బల్లమీద పెట్టాడు కార్డు. బిల్ తీసుకుని వందరూపాయల నోటు అందులో పెట్టింది మాధవి. ఆ టిప్ అందుకుని ఆనందపడిపోయాడు అతను. వినయంగా సలామ్ కొట్టాడు.

"వెళ్దామా?" అంది మాధవి. "పదండి" అంటూ లేచాడు మధు. ఇద్దరూ లిఫ్ట్‌లో కిందికి వచ్చారు. "భోజనం చాలా హెవీ అయింది. కాసేపు నడుద్దామా?" అడిగాడు మధు.

అలాగే అంది మాధవి. ఇద్దరూ నెమ్మదిగా నడవసాగారు. వెన్నెల పిండారబోసినట్లుగావుంది. చిన్నగా గాలివేస్తోంది. వాతావరణం చాలా ఆహ్లాదంగా వుంది.

మౌనంగా నడవసాగారు. "మీకు నా డిజిగ్నేషన్, నాకొచ్చే జీతం ఎంతో తెలుసా?" అని అడిగింది హఠాత్తుగా.

"ఏదీ మీరు చెప్పలేదుగా! అక్కడా ఇక్కడా అడిగి తెలుసుకుందామనుకున్నా మీ కంపెనీల వంటివాటి వ్యవహారాలు అన్నీ చాలా గుంభనంగా వుంటాయి" అన్నాడు.

చిన్నగా నవ్వింది మాధవి. తన పదవి గురించి, తన శాలరీ గురించి చెప్పింది.

ఒక్కక్షణం తడబడిపోయి తర్వాత ఊపిరి

పిల్చుకున్నాడు మధు.

"దానికి తగిన బాధ్యతలు కూడా వుంటా యనుకోండి" అంటూ తన సాధకబాధకాలు చెప్పుకొచ్చింది.

"ఇదోరకం లైఫ్. ఛాలెంజింగ్ జాబ్" అంది. ఒక్కక్షణం ఆగి మళ్ళీ మొదలుపెట్టింది. "ఇది నా విజయపథంలో తొలి మెట్టు మాత్రమే. మరో రెండుమూడేళ్ళు ఇక్కడ పనిచేసి కంపెనీ మారతాను. మరింత జీతానికి మరోచోటికి వెళ్తాను. నా హోదా ఇంకా పెరుగుతుంది. సంఘంలో నా పలుకుబడి, మర్యాద మరింత అధికం అవుతాయి. అంతేకాదు నా బాధ్యతలు కూడా పెరుగుతాయి. అలా క్రమక్రమంగా ఎంతో ఎత్తుకు ఎదిగిపోతాను.

"మీరు ఎంచుకున్నమార్గంలో ఇంటిప ట్టున మీ జీవితంలో ఎంతకాలం గడిచినా డబ్బుతోబాటు సౌకర్యాలు పెరగడం తప్పించి చెప్పుకోదగ్గ మార్పులుండవ్. వున్న చోటే వుంటూ మీ జీవిత భాగస్వామి ఎత్తుకి ఎదిగిపోతుంటే ఆ మార్పును జీర్ణిం చుకోవాలంటే చాలా మనోనిబ్బరం వుండాలి. ఇది నా అభిప్రాయం మాత్రమే. మీరు ఏకీభవిస్తారా? " హఠాత్తుగా ప్రశ్నిం చింది.

"మీరు చెప్పింది అక్షరాలా నిజం!" వెంటనే అంగీకరించి...

"మా చిన్నతనంలో అప్పటికి టి.వి.లు ఇంత విరివిగా వుండేవికాదు. మా ఇంట్లో అప్పుడు టి.వి. లేదు. మా పక్కింట్లో ఒక ప్రొఫెసర్‌గారు వుండేవారు. ఏమైనా మంచి ప్రోగ్రాంలు వుంటే వాళ్ళింటికి వెళ్ళి చూసే వాళ్ళం. అలాగే ఆవేళ కూడా వెళ్ళాం. డిసెంబర్ 31 అర్ధరాత్రి ప్రోగ్రాంలు చూడ్డా నికని చాలామందిమి జేరాం. ఇల్లంతా కిట కిటలాడిపోయింది. పన్నెండు గంటలు కాగానే ఒక్కక్షణం లైట్లు ఆర్పి తిరిగి వెలిగిం చాడాయన.

అందరికీ పేరుపేరునా న్యూఇయర్ శుభా కాంక్షలు అందజేశాడు, ఆయన భార్యకి తప్పించి. పాశ్చాత్యులు న్యూఇయర్‌లో మొట్టమొదట భార్యని కావలించుకుని న్యూఇయర్ విషెస్ చెప్తారని ఇంగ్లీషు నవలల్లో చదివానేమో ఆయన చర్య నాకు ఆశ్చర్యం కలిగించింది.

ఆపుకోలేక అందరూ వెళ్ళేదాకా వుండి ఆయన్నే అడిగేశాను. చిన్నగా నవ్వేడు ఆయన. "నువ్వు కూడా అందరికీ హేపీ న్యూఇయర్ చెప్పావుకదా! మరి నీకు నువ్వు చెప్పుకోలేదేం? " అని అడిగాడు. నాకర్థంకాక తెల్లమొహం వేశాను. "విష్‌మీ హేపీ న్యూఇ యర్ అని చెప్పుకోలేదేం? " మళ్ళీ అడిగాడు.

"నాకు నవ్వొచ్చింది. అదేమిటి మామ య్యగారూ! నాకు నేను విషెస్ చెప్పుకోవడం ఏమిటి? " అన్నాను.

"ఇదీ అంతే మరి! మీ అత్తయ్యకి నేను విషెస్ చెప్పడం ఎందుకూ? అదీ నేనూ వేరైతేగా? అది నాలోని సగభాగం. అలా విడిగా వుంది అంతే" అన్నాడు నవ్వేస్తూ.

"వచ్చీరాని వయసులో ఆమాట విని నోటమాట రాలేదు నాకు. భార్యపట్ల ఆయ నకు గల అభిమానానికి ముగ్ధుడినైపో యాను. ఆమాట నా మనసులో నాటుకు పోయింది. నేనూ నా భార్యని అలాగే భావించాలి అనుకున్నాను.

"ఇద్దరం వేరుకాదు, ఒక్కటే అనుకున్న ప్పుడు ఇక సన్మానమైనా అవమానమైనా సులభంగా కలిసి పంచుకుంటూ సుఖజీ వనం సాగించవచ్చు" అన్నాడు మధు.

గుండె ఝల్లుమంది మాధవికి. అంతవ రకూ లేనిది ఏదో తడబాటు కలిగింది.

"చాలా ఆలస్యం అయింది ఇక వెళ్దాం" అంది మెల్లిగా.

"పదండి" అన్నాడు మధు. ఇద్దరూ హోటల్ దగ్గరికి వచ్చేశారు.

కారు దగ్గరకు వెళ్ళి లాక్ తీసింది. "ఒంటరిగా వెళ్ళగలరా? లేకపోతే నేను సాయం రానా? " ఆదరంగా అడిగాడు.

# రచయితలకు మనవి



* 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
* **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
* **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
* ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
* సాధారణంగా నవలలు మాకు అందిన *4* వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచటం, లేనిపక్షంలో తిప్పిపంపటం జరుగుతుంది.
* **ప్రతి నవలకు అందజేసే రు: *3000/–* పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

.................. ఏప్రిల్ **చతుర** నవల సహజీవనం ..................

సమీక్షకుని పేరు : ..................................................

చిరునామా ..................................................

..................................................

..................................................

నవ్వేసింది మాధవి. "ఫర్వాలేదు వెళ్ళగలను"

కార్లో ఎక్కబోతూ చేతులు జోడించింది. "థాంక్స్ ఫర్ ద కంపెనీ. మీతో టైమ్ బాగా గడిచింది" అని చెప్పింది.

తనూ నమస్కారం చేశాడు. "నాకూ అంతే, మర్చిపోలేని రీతిలో గడిచింది ఈవెనింగ్" అన్నాడు.

"నాకు కొంచెం వ్యవధి కావాలి. నేను మళ్ళీ మీకు ఫోన్ చేస్తాను" అంది.

"అలాగే. టేక్ యువర్ ఓన్‌టైమ్" అన్నాడు.

కార్లో ఎక్కి స్టార్ట్‌చేసి 'గుడ్ నైట్' చెప్పింది.

"గుడ్‌నైట్" అన్నాడు మధు. కారు కనుమరుగు అయ్యాక తన బైక్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు.

హోటల్‌నించి తిన్నగా మాధురి దగ్గరకు వెళ్ళింది మాధవి. బాల్కనీలో కూర్చుని ఒళ్లంతా కళ్లు చేసుకుని ఎదురు చూస్తున్న మాధురి కారు కనిపించగానే లేచి లిఫ్ట్ దగ్గరకి పరిగెట్టింది.

లిఫ్ట్ ఆగగానే ఆదరంగా స్నేహితురాలి చెయ్యి అందుకుంది. "నీకోసం గంటనుంచి వెయిట్ చేస్తున్నాను. ఇంత లేట్ అయిందేం? కారు ట్రబుల్ ఇచ్చిందా? "

"లేదు.. ఏదో కబుర్లలోపడి పొద్దు తెలియలేదు" చెప్పింది మాధవి.

"అయితే ఇకనేం? పాజిటివ్ రిజల్ట్ అన్నమాట" అంది మాధురి మహా హుషారుగా.

"ఇంకా ఏమీ నిర్ణయించుకోలేదు" చెప్పింది మాధవి.

సాండల్స్ విప్పి సోఫాకి జార్లబడి కూర్చుంది. పక్కనే కూర్చుంది మాధురి. "ఇప్పుడు చెప్పు, ఎలా ఉన్నాడతను? "

"ఫొటోలో ఉన్నట్లే ఉన్నాడు. హీజ్ హాండ్‌సమ్"

"అమ్మయ్య! మనిషి నచ్చాడు కాబట్టి సగం ఓకే అన్నమాట. ఇక మిగిలిన వివరాలన్నీ చెప్పు" అంది మాధురి హుషారుగా.

తమ మధ్య జరిగిన సంభాషణ అంతా వివరంగా చెప్పింది మాధవి. "చక్కగా మాట్లాడతాడు. అతన్తో మాట్లాడుతుంటే సమయం తెలియదు" అంది చివరగా.

"పోన్లే, ఇన్నాళ్టికి నీ అన్వేషణ ఫలించింది. నీకు నచ్చిన వాడు దొరికాడు" ఆనందించింది మాధురి.

"నచ్చాడు నిజమే. కానీ ఎందుకో నిర్ణయం తీసుకోలేకపోతున్నాను. సరే అనడానికి మనసొప్పడంలేదు. కాదనడానికీ మనసంగీకరించడం లేదు. అయోమయంగా ఉంది" చెంపన చెయ్యి చేర్చుకుని కూర్చుంది మాధవి.

"నీ బాధ నాకు అర్థం అయ్యింది. జీవితానికి సంబంధించిన విషయం కాబట్టి ముందూ వెనకలు ఆలోచిస్తున్నావు. ఓ పని చెయ్యి. నీ శ్రేయోభిలాషుల సలహా తీసుకో" సలహా ఇచ్చింది మాధురి.

"నాకున్న శ్రేయోభిలాషులు అమ్మా నాన్నా, అక్కా బావా, నువ్వూ. వాళ్లు ఎదురుగా లేరు కదా! నిన్ను సలహా అడిగితే ఏంచెప్తావ్? " కుతూహలంగా అడిగింది.

"వేరే ఆలోచన లేకుండా ఒప్పుకోమంటాను" ఠకీమని సమాధానం చెప్పేసింది.

తల చేత్తో పట్టుకుని కూర్చుంది మాధవి. "నన్ను కొంచెం ప్రశాంతంగా ఆలోచించుకోనీ. నీ సలహా తప్పకుండా మనసులో ఉంచుకుంటాను. మరో విషయం మర్చిపోతున్నావు. అతనింకా తన అభిప్రాయాన్ని తెలియజెయ్యలేదు. కాబట్టి ఆలోచించుకునే వ్యవధి ఉంది." అంది.

"అదీ నిజమేలే. ఇవ్వాళేగా కలుసుకుని మాట్లాడుకుంది. నిదానంగా ఆలోచించి నిర్ణయం తీసుకో" మాధురి ఏకీభవించింది.

"ఇక నేను వెళ్తాను" అంటూ లేచింది మాధవి. కారు తీసుకుని వెళ్లమని చెప్పింది



మాధురి.



కార్లో ఇంటికి వస్తూ జరిగిందంతా మరోసారి మననం చేసుకుంది. ఇరవైనాలు గ్గంటల్లో ఎన్ని సంఘటనలు జరిగిపో యాయి. మాధురి తన ఫొటో పంపడం, అతను రిప్లై ఇవ్వడం, ఇద్దరూ కలుసుకో వడం... తల్చుకుంటే తమాషాగా ఉంది. కల్యాణం వచ్చినా కక్కు వచ్చినా ఆగదు అంటూ అమ్మ చెప్పే సామెత గుర్తు వచ్చింది. సరే అనేస్తే కొద్ది రోజుల్లో పెళ్ళి పోతుంది కూడా. పోనీ సరే అంటేనో? తను సరే అన్నా అతను కాదంటే? హటా త్తుగా నీరసం ముంచుకొచ్చింది.

తనే ఫోన్ చేస్తానని చెప్పింది అతనితో. ఫోన్ చేసి ఏంచెప్పడం? నాకు అంగీకారమే అనాలా? అప్పుడతను సారీ నాకు అంగీ కారం కాదు అని అనేస్తే. అలా అని ఫోన్ చెయ్యకపోతే తన వైపునుండి నో అని, అభి ప్రాయ పడతాడేమో అతను.

తెలివితక్కువ పనిచేసింది. అతన్నే ఫోను చెయ్యమని చెప్పి వుండాల్సింది.

ఆలోచిస్తూ ఇల్లు చేరింది. బట్టలు మార్చుకుని పడుకుంది. నిద్ర దరిదాపులకు వస్తేనా? అతని రూపం కళ్లముందునించి కదలడంలేదు. అతని స్వరం చెవుల్లో గిలి గింతలు పెడుతూ వుంది. పుస్తకం చదవా లనీ, టి.వి. చూస్తూ మనసు మళ్లించాలనీ వృథా ప్రయత్నంచేసి తలపట్టుకుని కూర్చుంది.

అలా ఎంతసేపు కూర్చుందో ఫోన్ మోతతో ఇహలోకంలోకి వచ్చింది. గభాల్న అందుకుంది.

"సారీ! డిస్టర్బ్ చేశానా?" వినిపించింది మధు కంఠం. చెప్పలేనంత ఆనందం కలి గింది మాధవికి.

"లేదు. ఇంకా నిద్రపోలేదు" సమాధానం చెప్పింది.

"ఇంటికి రాగానే మీకు ఫోన్ చేశాను. రెస్పాన్స్ లేదు. ఫ్రెండ్ దగ్గరికి వెళ్ళారేమో అని లేటుగా చేస్తున్నాను, సేఫ్‌గా జేరారా?" చొప్పదండు ప్రశ్న వేశాడు.

"ఆc సేఫ్‌గానే జేరాను" చెప్పింది.

"మాధవిగారూ. నేను ఒక నిర్ణయానికి వచ్చేశాను. నావైపునుండి ఓ.కే. ఇక మీరు డిసైడ్ చెయ్యాలి" అన్నాడు మెల్లిగా. గుండె ఝల్లుమంది మాధవికి.

ఏంచెప్పాలో అర్థంకాక తడబడిపో యింది. అది కనిపెట్టాడు మధు.

"కంగారేంలేదు. తీరిగ్గా చెప్పండి. నేను మళ్లీ రేపు ఫోన్ చేస్తాను. అంగీకారం అయితే సరే. లేకపోయినా మనం ఫ్రెండ్స్‌గా మిగిలిపోతాం. గుడ్‌నైట్" అనేసి ఫోన్ పెట్టేశాడు.

చేష్టలుడిగినదానిలా ఫోన్ దగ్గర కూర్చుం డిపోయింది మాధవి. కాసేపటికి ఇహలో కంలోకి వచ్చింది. ఒక్కక్షణం ఆలోచించి తండ్రికి ఫోన్ చేసింది.

బెడ్‌రూమ్‌లో సోఫాలో కూర్చుని విస్కీ తాగుతూ టి.వి. చూస్తున్నాడు తండ్రి భానుప్రతాప్. మంచంమీద పడుకుని పుస్తకం చదువుకుంటోంది తల్లి భవాని.

ఫోన్ మోగగానే చెయ్యి జాచి అందు కుంది. 'ఎవరూ? బేబీ?' అంది కూతురి

కంఠం విని.

"ఇంకా నిద్ర పోలేదా మమ్మీ? " అడిగింది మాధవి.

"లేదురా! ఇప్పుడే పార్టీనుంచి వచ్చాం" చెప్పిందావిడ.

"మమ్మీ! డాడీ వున్నారా? " అడిగింది.

"వున్నారమ్మా ఎందుకూ? "

"డాడీని రెండోఫోన్ తీసుకోమను. మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి" చెప్పింది.

"బేబీ ఏదో ఇంపార్టెంట్ విషయం మాట్లాడాలిట. హాల్లో ఫోన్ తీసుకోండి" అంటూ భర్తకి చెప్పింది.

నాలుగు అంగల్లో హాల్లోకి వెళ్ళి ఫోన్ తీశాడు భానుప్రతాప్ "బేబీ ఏమిటమ్మా? " అన్నాడు.

"డాడీ! మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి" అంటూ మాధురి అప్లికేషన్ పంపడంతో మొదలుపెట్టి అయిదు నిముషాల కిందట మధు ఫోన్ చేసిన విషయం వరకూ వివరంగా చెప్పింది.

అంతా విని నిట్టూర్చాడు భానుప్రతాప్. "మరి నువ్వేం నిర్ణయించుకున్నావు? " అడిగాడు.

"ఏమి నిర్ణయించుకోలేదు డాడీ. మీతో చెప్పాలనుకున్నాను" చెప్పింది మాధవి.

"సరేనమ్మా బాగా లేట్ అయిందిగా. పడుకో. రేపు మాట్లాడుకుందాం" అనేసి ఫోన్ పెట్టేశాడు. హాల్లోనే సోఫాలో కూర్చున్నాడు.

భవాని కూడా అక్కడికే వచ్చి భర్త పక్కనే కూర్చుంది.

"అంతా విన్నారుగా" భయంగా ప్రశ్నించింది.

"విన్నాను"

"ఇందులో ఏదో మోసం వుంది. అతనేదో కుట్రపన్ని ఇదంతా తలపెట్టాడేమో. తలకి మించిన అప్పులు, తీరని బాధ్యతలూ వున్నాయి కాబోలు. సంపాదించే భార్య కోసం వేట మొదలుపెట్టాడు. భార్య సంపాదించి పెడితే ఆ డబ్బుతో తన అవసరాలు గడుపుకుంటాడు కాబోలు. అసలైనా దీని తెలివితేటలు ఏమయ్యాయి? అతనేదో చెప్తే మాత్రం ఇదెలా నమ్మేసింది? " కళ్ళ నీళ్ల పర్యంతం అయింది ఆవిడకి.

"ఇప్పుడేమైందని ఇంత కంగారు? బేబి తెలివితక్కువది కాదు. అది స్వయంగా మాట్లాడిందికదా" అనునయించాడాయన.

"ఒక్కపూట మాట్లాడితే మనిషి గురించి ఏం తెలుస్తుంది? "

"నీ మొహంలా వుంది. మామూలుగా పెళ్ళిచూపుల్లో మాత్రం ఎంతసేపు మాట్లాడుకుంటారు? ఆమాటకొస్తే మనిద్దరం ఏం మాట్లాడుకున్నాం? నీ పేరేమిటి అని అడిగాను నేను. అంతేగా? " అన్నాడాయన.

"అవుననుకోండి. ఆ రోజులు వేరు. ఇప్పుడు పరిస్థితి వేరుగా వుంది"

"అదే నేను చెప్పేదీను. రోజులు మారిపోయాయి. పిల్లలకు పెద్దవాళ్లు సలహాలు చెప్పే రోజులు కావు ఇవి. వాళ్ళంతవాళ్లు అయ్యాక వాళ్ళేం చేసినా సరే అనడం మన కర్తవ్యం. అయినా ఇప్పుడేం చేసిందని? దాని పెళ్ళికోసం ఎన్ని ప్రయత్నాలు చేశాం? ఏదీ కలిసి రాలేదు. కొన్ని మనకు నచ్చకా, కొన్ని వాళ్ళకు నచ్చకా ఆగిపోయాయి. బేబీ అసలు పెళ్ళే వద్దనేసిందికదా! ఏదో మనసు మార్చుకుని ఇంతమాత్రం ఇంట్రస్ట్ తీసుకుంటూ వుందంటే అది శుభసూచకమే. దానికి నచ్చిన సంబంధం చేస్తే దాని జీవితం కుదుటపడుతుంది. మన బాధ్యతా తీరిపోతుంది.

పూర్తి నిర్ణయం తీసుకుని ఫోన్ చెయ్యకుండా మనని సలహా అడిగిందికదా. మనమూ మంచీ చెడూ ఆలోచిద్దాం. వచ్చే వారం ఎలాగూ సెలవులో వెళ్ళాలనుకుంటున్నాంకదా! వాళ్ళ వాళ్ళను కలుసుకుని చూద్దాం. నువ్వు అనవసరంగా ఆలోచించి ఆరోగ్యం పాడుచేసుకోకు" అంటూ నచ్చచె

ప్పాడాయన.

ఆ రాత్రి కలతనిద్రే అయింది ఇద్దరికీ.

మర్నాడు పొద్దున కూతురికి ఫోన్ చేశాడు భానుప్రతాప్.

"ఆ అబ్బాయి తండ్రి వివరాలేమైనా తెలుసా? " అని అడిగాడు.

"గుంటూర్లో లెక్చరర్‌గా పనిచేస్తున్నారట డాడీ" అని చెప్పింది.

"ఆయన అడ్రస్, ఫోన్ నెంబరు ఏమైనా వున్నాయా? " మళ్ళీ అడిగాడు.

"నా దగ్గర లేవు డాడీ. అతను పంపించిన బయోడేటా మాధురి దగ్గర వుండిపోయింది" వినయంగా చెప్పింది.

"మరో పావుగంటాగి ఫోన్ చేస్తాను. ఈలోగా కనుక్కుని వుంచు" అన్నాడు.

మాధురికి ఫోన్‌చేసి వివరాలు నోట్ చేసుకుని తనే తండ్రికి ఫోన్ చేసింది. ఆయన నోట్ చేసుకున్నాడు. "సరేనమ్మా. నేను ఆయనతో మాట్లాడతాను. ఎలాగూ నెక్స్ట్ వీక్ సెలవులో వస్తున్నానుకదా! వీలైతే వాళ్ళింటికెళ్తాం నేనూ, మమ్మీ. మనం డిసైడ్ చేసుకునేముందు అన్నీ తెలుసుకోవడం మంచిదని నా ఐడియా" అన్నాడు.

"మీ ఇష్టం డాడీ. నావైపునుండి ఓ.కె. బట్ ఫైనల్ డెసిషన్ విల్ బీ యువర్స్" అంది మాధవి.

ఆయనకు చాలా సంతోషం అనిపించింది. భార్యని పిల్చి వివరాలన్నీ చెప్పాడు. "మరింకేం ఆయనకి ఫోన్ చెయ్యండి. అప్పుడే ఏడున్నర అవుతోంది. ఆలస్యం చేస్తే మళ్ళీ ఆయన కాలేజీకి వెళ్తాడేమో!" అంటూ తొందర పెట్టింది.

వెంటనే ఫోన్ చేశాడు. లైన్ దొరికింది.

"ఇది గుంటూరులో రాజశేఖరంగారి ఇల్లేనా? " అని అడిగాడు.

"అవునండీ, నేను రాజశేఖరాన్నే మాట్లాడుతున్నాను. మీరెవరు? "

"నమస్కారమండీ! నా పేరు భానుప్రతాప్. నేను ఆర్మీలో మేజర్‌గా వుంటున్నాను. చండీగఢ్‌నించి మాట్లాడుతున్నాను"

"అలాగా నమస్కారం" ఆశ్చర్యపోయాడు రాజశేఖరం.

"మా రెండో అమ్మాయి మాధవి హైదరాబాద్‌లో పనిచేస్తోంది. ఇంకా పెళ్లి కాలేదు. మీ అబ్బాయి మేట్రిమోనియల్‌లో యాడ్ ఇస్తే మా అమ్మాయి సమాధానం రాసిందిట"

"ఏమిటీ మా అబ్బాయి మేట్రిమోనియల్‌లో యాడ్ ఇచ్చాడా? " మరింత ఆశ్చర్యంగా అడిగాడు రాజశేఖరం.

"అరే! మీకు తెలియదా? " ఈసారి ఆశ్చర్యపోవడం భానుప్రతాప్ వంతు అయింది.

"అబ్బే! నాకు తెలియదండీ. పదిహేనురోజుల క్రిందట వచ్చినప్పుడే నేను పెళ్లిప్రసక్తి తీసుకొస్తే నాకు పెళ్లే వద్దని భీష్మ ప్రతిజ్ఞ చేసి వూరెళ్ళిపోయాడు. తర్వాత కబురూ కాకరకాయా లేవు. ఇంతకీ ఎప్పుడిచ్చాడు యాడ్? " అడిగాడు.

బుర్ర గోక్కున్నాడు భానుప్రతాప్. "ఆ వివరాలు నాకూ తెలియవండీ. మరి ఎప్పుడిచ్చాడో? ఇంతకీ నేను చెప్పొచ్చేది ఏమిటీ అంటే మా అమ్మాయీ అతనూ కలుసుకుని మాట్లాడుకున్నారుట" చెప్పాడు.

"శుభం. ఇదెప్పుడుట? " మళ్ళీ ఆయన్నే అడిగాడు రాజశేఖరం.

"నిన్న సాయంత్రం" ప్రతీసారీ వివరాలు తెలియవంటే బాగుండదేమో అని అసలు విషయం చెప్పేశాడు భానుప్రతాప్.

"ఆహా అలాగా!" అన్నాడు రాజశేఖరం.

"అంతేకాదు. తన అంగీకారం అమ్మాయికి తెలియజేశాడుట. అమ్మాయి నాతో చెప్పింది" చెప్పాడాయన.

"అదృష్టవంతులు. మీ కూతురు బుద్ధిమంతురాలు" అన్నాడు మనస్ఫూర్తిగా.

"భలేవారే! మీ కొడుకు బుద్ధిమంతుడు కాడా? " నవ్వుతూ అడిగాడాయన.




"కాదని చెప్పలేను. అవుననీ అనలేను" అనేశాడు రాజశేఖరం కూడా నవ్వేస్తూ.

"ఈ విషయం మీతో వివరంగా మాట్లాడ దామని ఫోన్ చేశాను. తీరా చూస్తే మీకు అసలు విషయమే తెలియదంటున్నారు"

"నిజంగానే నాకేం తెలియదు. క్షమిం చాలి" అన్నాడు రాజశేఖరం.

"భలేవారే. ఇందులో క్షమించడానికే ముంది? నాకూ మా అమ్మాయి రాత్రి ఫోన్‌చేసి చెప్పింది కాబట్టి తెలిసింది. సర్లెండి నేను మళ్ళీ ఫోన్ చేస్తాను" అన్నాడు భానుప్రతాప్.

"అలాగేనండీ" అన్నాడు ఈయన.

ఫోన్ పెట్టేసి భార్యవంక చూశాడు భాను ప్రతాప్. "అదీ విషయం. ఆయనకి కొడుకు యాడ్ ఇచ్చిన విషయమే తెలియదుట"

"ఇదేం విచిత్రం? తండ్రితో మాటమాత్ర మైనా చెప్పకుండా యాడ్ ఇచ్చాడా?" ఆశ్చ ర్యపోయింది ఆవిడ.

"పైగా పదిహేనురోజుల క్రితం పెళ్ళి చేసుకోనని చెప్పివెళ్ళాడుట" చెప్పాడాయన.

"ఇదేదో గందరగోళం వ్యవహారంలా వుందండీ! బేబీకి ఫోన్‌చేసి వద్దని చెప్పండి. సుమిత్ర ఎవరిదో ఫోటో పంపించిందికదా! కుర్రాడు బావున్నాడు. ఎయిర్‌ఫోర్సులో ఉద్యోగం. అదే ఖాయం చేసేద్దాం. రేపు వెళ్ళినప్పుడు బేబీని ఎలాగైనా నచ్చచెప్పి ఒప్పిద్దాం" అంది గబగబ.

"కానీలే. నిదానంగా ఆలోచిద్దాం" అన్నాడు ఆయన.

★ ★ ★

ఫోన్ పెట్టేసి "భారతీ" అంటూ వంటిం ట్లోకి వెళ్ళాడు రాజశేఖరం.

ఆవిడ వంటపనిలో చాలా బిజీగా వుంది. "భారతీ నీ కొడుకు పెళ్ళికూతురు కావాలని పత్రికలో ఏడ్ ఇచ్చాడుట. నీకేమైనా తెలుసా?" అనుమానంగా అడిగాడు.

"ఏవిటీ ఏవిచ్చాడుట నా కొడుకు?" ఆ కుక్కర్ మోతలో సరిగ్గా వినిపించలేదు భారతికి.

"పెళ్ళికూతురు కావాలని పేపర్లో ప్రకటన ఇచ్చాడుట" కుక్కరు విజిల్ ఆగాక మళ్ళీ చెప్పాడు ఆయన.

నోరావలించింది భారతి. "పేపర్లో ఇచ్చాడా? ఎందుకు? వీడికేం ఖర్మ?"

"ఇది మరీ బాగుంది. పేపర్లో ప్రకటనలు ఇచ్చేవారంతా ఖర్మగాలి ఇస్తారా; నీ చాదస్తం కాకపోతే" అన్నాడాయన.

"అది కాదండీ. వాడికోసం బోలెడు సంబంధాలు వస్తుంటే పేపర్లో ప్రకటన ఎందుకు? పెళ్ళిచూపులు చూద్రా అని చిలక్కి చెప్పినట్లు చెప్తే వినిపించుకోడు. పోనీ మేనరికం చేసుకోరా అంటే అదీ వినడు. కిందటిసారి పదేపదే చెప్పాననేగా అలిగి ప్రతిజ్ఞచేసి పోయాడు? ఇప్పుడీ పేపరు గోలేవిటి? అసలైనా మీకెవరు చెప్పారు? ఏ గిట్టనివాళ్ళో కల్పించి చెప్పలే దుకదా" సందేహం వెలిబుచ్చింది.

"అదేంకాదు" అంటూ భానుప్రతాప్ ఫోన్ గురించి చెప్పాడు.

"ఓరి వీడి అసాధ్యం బంగారంగానూ! ఇంతదాకా వచ్చినా మనతో మాటమాత్రం చెప్పలేదు. ఉండండి వాడిపని చెప్తాను. మీరు వెంటనే వెళ్ళి 'మదర్ సీరియస్ కమ్ ఇమ్మీడియట్లీ' అని టెలిగ్రాం ఇవ్వండి" అంది కోపంగా.

"ఇప్పటికి పాతికసార్లు ఇచ్చాం ఆ టెలిగ్రాం. ఇక నిజంగా సీరియస్ అయినా నమ్మడు వాడు. ఫోన్‌చేసి మాట్లాడతా నుండు" అంటూ వెళ్ళి ఫోన్ చేశాడు.

"మీ పక్కింట్లో వుండే మధుసూదన్‌ని కొంచెం పిలుస్తారా? నేను వాళ్ళ నాన్నని. మళ్ళీ ఓ అయిదు నిముషాలు ఆగి చేస్తాను" అని చెప్పాడు.

ఆ కబురు అందుకుని కంగారుగా ఫోన్ దగ్గరికి వచ్చాడు మధు. నాన్నగారు మహా జాగర్త మనిషి. ఫుల్‌టైంలో ఫోన్ చెయ్యరు సాధారణంగా. ఏమైనా అర్జెంటా!



అంతలోనే ఫోన్ మోగింది. అందుకున్నాడు మధు. "నాన్నగారూ నేనేనండీ చెప్పండి ఎందుకిప్పుడు ఫోన్ చేశారు? " కంగారుగా అడిగాడు.

"ఆ! ఏంలేదురా. నీ పెళ్ళటకదా! కళ్యాణ మండపం అదీ మాట్లాడావా? ఇంతకీ ముహూర్తం ఎప్పుడట? " దాచుకున్నా దాగని కోపం తెలిసి పోతూనేవుంది ఆయన కంఠంలో.

"ఏవిటి నాన్నగారూ? నా పెళ్ళా? ఎవరు చెప్పారు? " అయోమయంగా అడిగాడు మధు.

"భానుప్రతాప్‌గారు ఫోన్ చేశారు. వాళ్ళ అమ్మాయిని పెళ్ళి చేసుకుందామనుకుంటున్నావుటకదా నువ్వు? "

"భానుప్రతాపా? ఆయనెవడు? ఆ పేరే విన్లేదు నేను. ఆయన కూతుర్ని పెళ్ళిచేసుకోవడం ఏమిటి? అసలేమైంది? వివరంగా చెప్పండి? " చిరాకువేసింది మధుకి.

ఆ సమాధానం విని కాస్త శాంతించాడు ఆయన. "భానుప్రతాప్ అనే పెద్దమనిషి నాకు ఫోన్ చేశాడు. ఆయనకి వాళ్ళమ్మాయి ఫోన్ చేసిందిట. ఆ అమ్మాయికి నువ్వు ఫోన్ చేసి చెప్పావుటకదా" వీలైనంత వివరంగా చెప్పాడు రాజశేఖరం.

హఠాత్తుగా గుర్తొచ్చింది మధుకి. భానుప్రతాప్ అంటే మాధవి ఫాదరా? చిరాకు మాయమైపోయి దానిస్థానాన సంతోషం కలిగింది.

"ఎక్కడనించి ఫోన్ చేశారు? ఏంమాట్లాడారు? మాధవి ఆయన్తో ఏం చెప్పిందిట" గబగబ అడిగేశాడు.

దాంతో ఈయనకి చిర్రెత్తుకొచ్చింది. "ఇది మరీ బాగుందిరా. అసలు విషయం ఏమిటో కనుక్కుందామని నేను ఫోన్ చేస్తే నన్ను ఎదురు ప్రశ్నలేస్తావేం? అయితే అదంతా నిజమే అన్నమాట"

"మీకు ఇవ్వాళో రేపో ఫోన్‌చేసి చెప్దామనుకుంటున్నాను నాన్నగారూ! ఇప్పుడు కాదు రాత్రికి హాఫ్‌టైంలో ఫోన్‌చేసి తీరిగ్గా మాట్లాడతా!" అన్నాడు మధు.

"అది కాదురా అసలు విషయం చెప్పకుండా దాటేస్తావేం? " ఉరిమాడాయన.

"రాత్రికి ఫోన్ చేస్తాగా నాన్నగారూ!" అనేసి ఫోన్ పెట్టేశాడు మధు.

రివ్వున రూమ్‌లోకి వచ్చేశాడు. మాధవి వాళ్ళ ఫాధర్‌కి చేసింది. ఆయన తన తండ్రితో మాట్లాడారు. అంటే మాధవి ఓ. కే. చేసిందన్నమాట. భలే సరదా వేసింది అతనికి. వెంటనే పక్కనే వున్న బూత్‌కి వెళ్ళి ఫోన్ చేశాడు.

మాధవి రిసీవ్ చేసుకుంది.

"గుడ్‌మాణింగ్! నేనే మధుని" అన్నాడు.

గుండెఝుల్లుమంది మాధవికి. కోపం కూడా వచ్చింది. ఏవిటీ మనిషి. ప్రతీసారీ ఫోన్ చెయ్యడం, అతను ఫోన్ చేసినప్పుడల్లా నా గుండె ఝుల్లు ఝుల్లుమనడం.

అందుకే "హల్లో" అని వూరుకుంది.

"మీరు మీ ఫాదర్‌కి ఫోన్ చేశారుట. ఆయన మా నాన్నగారికి ఫోన్ చేశారుట. నాన్నగారు నాకు ఫోన్ చేశారు ఇప్పుడే. ఇంతకీ మీ ఫాదర్‌తో మీరేం చెప్పారో తెలుసుకోవచ్చా? " అన్నాడు ఆత్రంగా.

"అంత క్యూరియాసిటీ గలవారు మీ నాన్నగార్ని అడగకపోయారా? " అడిగింది మాధవి.

"ఆ ఛాన్స్ ఇస్తేనా! చీవాట్లేశారు. అసలు విషయం ఏమిటంటే నేనీ యాడ్ ఇచ్చిన సంగతి వాళ్లకు చెప్పలేదు. సెటిల్ అయ్యాక చెప్దామని ఊరుకున్నాను. అందుకని కోపం వచ్చి అక్షింతలు వేశారు" చెప్పాడు.

"అదన్నమాట అసలు విషయం. మరి మీరేంచేశారు? "

"ఏంచేస్తాను? అక్షింతలు వేయించుకున్నాను" బుద్ధిగా చెప్పాడు.

"మరి స్వతంత్రించి యాడ్ ఇచ్చినందుకే ఆగ్రహించిన మీ నాన్నగారు మీరు స్వతం

త్రించి నిర్ణయం తీసుకుంటే ఊరుకుంటారా? "

"అబ్బే! అలాంటిదేంలేదండీ. నాన్నగారిది ప్రథమకోపం. ముందిలాగే మండిపడతారు. వివరంగా చెప్తే నానాయనే, నాబాబే అని సంతోషిస్తారు" వివరించాడు.

నవ్వేసింది మాధవి.

"ఇంతకీ మీరు మీ ఫాదర్‌తో ఏంచెప్పారో చెప్పలేదు" అడిగాడు.

"ప్రత్యేకించి చెప్పడానికి ఏమీలేదండీ. జరిగినది అంతా చెప్పాను. ఫైనల్ డెసిషన్ డాడీకి వదిలేశాను" చెప్పింది.

గతుక్కుమన్నాడు మధు. "సామాన్యంగా మీ మాటకి మీ డాడీ విలువ ఇస్తారా? " అడిగాడు.

మళ్లీ నవ్వేసింది మాధవి. 'ఏమో అనుకున్నాను. గడుసుఘటం' అనుకుంది.

"ఇప్పటివరకూ నామాట ఎప్పుడూ కాదనలేదు. ఇకమీదట ఎలా జరుగుతుందో నేనెలా చెప్పగలను? " బింకంగా సమాధానం చెప్పింది.

నవ్వును ఆపుకుని గంభీరత తెచ్చిపెట్టుకున్నాడు మధు.

"నిజమేలెండి. ఎంతయినా పెద్దవాళ్ల మాట కాదనలేం కదా! సరే కానివ్వండి ఆ దేముడు ఎలా రాసిపెట్టివుంటే అలా జరుగుతుంది" అన్నాడు వేదాంత ధోరణిలో.

ఫకాల్న నవ్వేసింది మాధవి. "అవును మరి. మేరేజెస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్ అన్నారుకదా! మరి శలవా నా ఆఫీసుకు టైం అవుతోంది" అంది.

"ఓ. కె. బై" అనేశాడు మధు.

★ ★ ★

"ఏవిటటా? ఏవన్నాడు? " భర్త ఫోన్ పెట్టగానే వెంటపడింది భారతి.

"ఏవంటాడు? ఏడ్ ఇచ్చినమాట నిజమేనట. ఆయన ఫోన్ చేశాడని తెలిసి చాలా సరదా పడిపోయాడు. ఆయనేవన్నాడు? ఆయన్తో మాధవి ఏమందిట అంటూ నన్నే ఎదురుప్రశ్నలు వేశాడు. అన్నట్లు ఆ అమ్మాయి పేరు మాధవిట" చెప్పాడు రాజశేఖరం.

"అసలు విషయం వదిలేసి ఏవిటో చెప్తారేం? అసలు ఏడ్ ఎందుకిచ్చాడు? " చిరాగ్గా అడిగింది.

"అదంతా వాడు నాకు చెప్పాడా? రాత్రికి తీరిగ్గా మాట్లాడతాడుట" ఆయనకీ చిరాకు వేసింది.

"అందుకే నాకు ఫోనివ్వమన్నాను. నేనైతే ఖచ్చితంగా అడిగేదాన్ని"

"అందుకే నీకు ఫోనివ్వనిది. నువ్వు పగటిపూట ఫుల్ టైంలో ఖచ్చితంగా అడగడం మొదలుపెడితే, నేను ఆస్తులు అమ్ముకుని ఫోన్ బిల్ కట్టాల్సిందే. రాత్రికి ఫోన్ చేస్తాడుటకదా! అప్పుడు నువ్వే మాట్లాడు" అన్నాడాయన.

పగలంతా ఆ విషయమే మాట్లాడుకున్నారు. ఎనిమిదిన్నర అయ్యేసరికి ఫోన్ దగ్గర కూర్చున్నారు. తొమ్మిదయ్యింది. పదయింది. పదకొండు దాటినా ఫోన్ రాలేదు. ఏమయిపోయాడు వీడు? పోనీ మనం ఫోన్ చేద్దామంటే పొద్దుబోయింది. అని సణుక్కుని సర్లే రేపు పొద్దున్నే ఫోన్ చేద్దాం అనుకుని వెళ్ళి పడుకున్నారో లేదో గేటు చప్పుడు అయింది.

"అమ్మా! నాన్నగారూ!" అంటూ వినిపించింది.

"అబ్బాయొచ్చాడు" అంటూ చివాల్న లేచారు ఇద్దరూ. తాళంచెవి తీసుకువెళ్ళి గేటుతాళం తీసింది భారతి.

"చెప్పాచెయ్యకుండా వచ్చావేమిట్రా? నీ ఫోన్ కోసం చూసి ఇప్పుడే పడుకున్నాం" అడిగింది.

"రేపు బెజవాడలో ఏదో పనుంది. మిమ్మల్నీ చూసినట్లు అవుతుంది అని అప్పటికప్పుడు అనుకుని బయలుదేరాను" చెప్పాడు మధు.

"ఏరా! ఎలా వున్నావ్? " పలకరించాడు

తండ్రి

"బాగానే వున్నా డాడీ? మీరెలా వున్నారు? " ఆదరంగా అడిగాడు కొడుకు.

"ఏముందిరా! రొటీన్! అంతే" అన్నాడా యన.

చిటికెలో కాఫీ కలుపుకొచ్చింది భారతి. "కాఫీ తాగి స్నానం చెయ్ ఈలోగా వంట చేసేస్తాను" అంటూ లోపలికి వెళ్ళబో తున్నదల్లా ఆగిపోయి "ఏవండీ మీరోసారి ఇలారండి. నూనె అయిపోయింది. పెద్ద టిన్‌లోంచి తియ్యాలి" అని చెప్పి వెళ్ళిపో యింది.

వెంటనే లేచి వెళ్ళాడాయన. ఆ కోడ్‌భాష అర్థం అయిన మధు చిన్నగా నవ్వుకు న్నాడు. ఆవిడ మొదట్నించీ అంతే. నలు గుర్లో కూర్చున్న భర్తతో ఏదైనా పర్సనల్‌గా మాట్లాడాలంటే పంచదార డబ్బా మూత రావడంలేదనో, బీరువా తాళం బిగిసిపోయి బీరువా తెరుచుకోవడం లేదనో వంకపెట్టి ఆయన్ని లోపలికి పిలుస్తుంది.

భర్త లోపలికి రాగానే "ఇదుగో ఇప్పుడే ఏమీ మాట్లాడకండి. ప్రయాణం చేసివ చ్చాడు బిడ్డ. భోజనం చేశాక తీరిగ్గా మాట్లా డదాం" అంది గుసగుసగా.

"ఇది మరీ బాగుంది. ఇప్పటిదాకా కడిగే స్తాను, చెరిగేస్తాను, ఝాడిస్తాను అన్నది నువ్వా నేనా? " అడిగాడాయన గుసగుసగా.

"చాల్లెండి మీ సరసాలూ మీరూను. వెళ్ళి అబ్బాయి దగ్గర కూర్చోండి. ఒక్కడే వున్నాడు"

"ఓసి నీ అఘాయిత్యం బంగారంగానూ. నువ్వే కదోయ్ పిల్చింది" అనేసి నిష్క్రమిం చాడు రాజశేఖరం.

స్నానంచేసి రాగానే కొడుక్కి వడ్డించింది భారతి. "నిన్ననే చేశానురా సున్ని" అంటూ సున్నివేసి చారెడు నెయ్యివేసి దగ్గర కూర్చుని కొసరి కొసరి తినిపించింది.

భోజనం అయ్యాక ముగ్గురూ హాల్లో చేరారు.

"ఇప్పుడు చెప్పు!" అన్నాడు రాజశేఖరం సూటిగా రంగంలోకి దిగిపోతూ.

వీలైనంత వివరంగా చెప్పాడు మధు. అంతా విని నిరాకరించారు ఇద్దరూ.

"ఏవిటీ? అంత పెద్ద ఉద్యోగం చేస్తున్న అమ్మాయిని పెళ్లి చేసుకుంటావా? పైగా నువ్వు ఉద్యోగం మానేసి ఇల్లు చక్కదిద్దు కుంటావా? వంటిమీద తెలివివుండే మాట్లా డుతున్నావా? నువ్వేం చెప్తున్నావో, నీ ఆలోచన ఏమిటో నీకైనా అర్థం అవు తుందా? " అడిగాడు రాజశేఖరం.

"బాగా ఆలోచించే ఈ నిర్ణయం తీసుకు న్నాను నాన్నగారు. అయినా ఇదేం అల్లా టప్పా వ్యవహారం కాదుకదా! జీవితానికి సంబంధించిన విషయం. ఎంత జాగర్తగా ఆలోచించాలి" సమాధానం చెప్పాడు.

"మరి అన్నీ తెలిసి తెలిసీ ఈ తెలివితక్కు వతనం ఏమిట్రా? ఇంట్లో పడుండి ఆడ దాని సంపాదన తినే ఖర్మ నీకేమిటి? " మండిపడింది భారతి.

"అదంతా మన ఆలోచనని బట్టివుం దమ్మా. నిన్నెవరైనా మగాడి సంపాదన మీద ఆధారపడే ఖర్మ నీకేమిటి అని అడిగా రనుకో. ఏం చేస్తావు? ఇదీ అంతే. భార్యా భర్తల్లో ఒకరు సంపాదిస్తూవుంటే రెండో వాళ్ళు ఇంట్లో వుంటే తప్పేమిటి? " శాంతంగా చెప్పాడు.

"అంతేలేరా! నిన్ను ఎంత గారాబంగా పెంచాను? నీమీద ఎన్ని ఆశలు పెట్టుకు న్నాను. ఏనాడైనా నీకు కాస్తంతైనా తక్కువ చేశానా? ఇంతా చేస్తే ఇవ్వాళ నువ్వెంత అంటే నువ్వెంత అని మాట్లాడుతున్నావు. నువ్వు భార్య సంపాదన తినడం, నేను మీ నాన్న సంపాదన తినడం ఒకటేనా? అయినా అంతా నీ ఇష్టమేనా? మేము ఏమైపోవాలి? ఏదో నీకు పెళ్ళి చేస్తే కోడలు వస్తుంది. నాకు తోడుగా వుంటుంది. అని ఆశపడుతూ వుంటే" ఇహ తర్వాత ఆవిడ కంఠం బరువెక్కింది.




కొంగుతో కళ్లు తుడుచుకుంది.

చివాల్న లేచివెళ్ళి తల్లిపక్కన కూర్చు న్నాడు మధు. భుజం చుట్టూ చెయ్యివే శాడు. "అమ్మా ఏమిటమ్మా ఈ పిచ్చి? నేనేదో నిన్ను వదిలి దూరం పారిపోతు న్నట్లు ఏమిటీ ధోరణి. ఆవేశంలో ఏవేవో ఊహించుకుంటున్నావు. కాస్త స్థిమితంగా ఆలోచించి చూడు. కొడుకు పెళ్ళి కాగానే కోడలు వచ్చి అత్తకి తోడుగా వుండే అల వాటు మారిపోయి ఎన్నాళ్లయింది? ఎప్పుడో పల్లెటూర్లలో ఉమ్మడి కుటుంబాల కాలంనాటి అలవాటు అది. నా మాట వది లెయ్. నువ్వు నాయనమ్మ దగ్గర వున్నావా పెళ్ళయ్యాక? నాన్నగారితో ఆయన ఉద్యోగం చేసే చోటికి వచ్చేయలేదూ? అక్కకి పెళ్లయింది. అది మరి వాళ్ళ అత్త గారి దగ్గరవుండి సేవలు చేస్తోందా?"

మధు ఆదరంగా అడిగాడు. వితండవా దంలా అనిపించినా అందులో నిజం వుండడం వల్ల మౌనంగా వుండిపోయింది భారతి.

రాజశేఖరం కలగజేసుకున్నాడు. "పోనీ నువ్వు చెప్పింది నిజమే అనుకోరా! నువ్వూ నీ భార్యా మా దగ్గర వుండకపోయినా వేరే ఊళ్ళో నీ ఉద్యోగరీత్యా వున్నా అదో రకం. మా అబ్బాయి సంపాదిస్తున్నాడు. అవసరం అయితే వాడి ఇంటికి వెళ్ళి నాలుగురోజులు వుండచ్చు అని ధైర్యంగా వుంటుంది. ఇప్పుడు నువ్వే నీ భార్య సంపాదన మీద ఆధారపడి వుంటే ఇక మేం ఏ మొహం పెట్టుకుని వస్తాం?" అని అడిగాడు.

ఫక్కున నవ్వేశాడు మధు. "భలేవారు నాన్నా మీరు! బంధుత్వాలూ, రాకపోకలు సంపాదన మీద ఆధారపడి వుంటాయా ఎక్కడైనా? మరి అలా అనుకుంటే అమ్మకి ఏం సంపాదన వుంది? తాతయ్య, అమ్మమ్మ, మామయ్యలూ మనింటికి రావ డంలేదా? వుండడంలేదా? వాళ్ళని మనం నెత్తిన పెట్టుకుని ఆదరిస్తున్నాం గానీ అమ్మకు సంపాదన లేదని అగౌరవపరుస్తు న్నామా?"

రాజశేఖరానికి చిర్రెత్తుకొచ్చింది. "ఎవరితో ఎవర్ని పోలుస్తున్నావురా నువ్వు? అమ్మ ఆడది. దానికి సంపాదన ఎందుకు? దాని భర్త సంపాదనే దానిదీనూ. మరి నీ విష యంలో అలా కాదే"

"అవును. అమ్మకి సంపాదన లేదు. ఆవిడ ఉద్యోగం చెయ్యలేదు. ఆవిడకి ఆ అవసరం రాలేదు. మీరు సంసారానికి సరి పడా ఆర్జిస్తున్నారు. ఆవిడ ఇల్లు చూసుకుం టోంది. నా విషయంలో నాకాబోయే భార్య ఎక్కీతొక్కీగా సంపాదిస్తుంటే నేను ఇల్లు చూసుకుంటే ఏవిటంత ఘోరాపరాధం?" నిలదీసి అడిగాడు.

"అపరాధం కాదు. కానీ విడ్డూరం. అంద రిదీ ఒకదారి ఉలిపికట్టిది మరోదారి అన్నట్లూ ఏదో ఉడుకురక్తంతో ఇటువంటి తలతిక్క నిర్ణయాలు తీసుకుని తర్వాత నెత్తికి తెచ్చుకుని జీవితాంతం బాధపడతా వేమో అని భయం అంతే" అన్నాడు తండ్రి.

"నాన్నా పదేపదే గతంతో మిమ్మల్ని కించపరుస్తున్నామని అనుకోకుండా వుంటే ఒక్కమాట చెప్తాను. ఈ తరంవారి ఆలోచ నలు వెనకటితరంవారికి వింతగా అనిపిం చడం కొత్తేమీకాదు. తరతరాలుగా వస్తున్న ఆచారమే ఇది. మీకు మీ మేనరికం స్థిరం చేస్తే చదువుకోని పిల్ల నాకు వద్దని, పి.యు.సి. పాసైన అమ్మని పెళ్ళి చేసుకు న్నారని బామ్మ పదేపదే చెప్తూ ఉండేది.

"ఆడదానికి చదువెందుకురా వీడి చాదస్తం కాకపోతే. వీడి మొండిపట్టుదల వల్ల నా కూతురికీ అల్లుడికీ శత్రువులం అయిపోయాం. లక్షణంగా నా మనవరాల్నే చేసుకుని వుంటే! అంటూ మొన్న మొన్నటి దాకా వాపోయేది" అన్నాడు మధు.

రాజశేఖరం మొహం కందగడ్డలా మారి పోయింది. అది గమనించి తల్లిదగ్గర నుండి లేచివచ్చి తండ్రి కాళ్ళదగ్గర కూర్చు



న్నాడు మధు.

"నాన్నగారూ! మీరు నాకు దైవంతో సమానం. కనడంతోనే బాధ్యత తీరిపోయిం దనుకోకుండా అనుక్షణం మాకోసం మీరెంత శ్రమపడ్డారో నాకు తెలుసు. ఆర్థి కంగా అంత గట్టిగా లేకపోయినా మాకు ఏ లోపం లేకుండా పెంచడానికి మీరెంత సర్దు కుపోయారో కూడా నాకుతెలుసు.

"ఈ పెళ్ళిద్వారా మీకు అన్యాయం చేస్తు న్నానని గానీ, మీకు తలవంపులు తెచ్చేపని చేస్తున్నానని గానీ భావించకండి. నా జీవితం ముందుముందు అస్తవ్యస్తం అయి పోతుందేమో అనే భయం వుంటే మనసు లోంచి ఆ భయం తుడిచేయండి. నా జీవి తాన్ని నాకు నచ్చిన తీరులో మలుచుకోవా లనే ఆశతో ఈ నిర్ణయం తీసుకున్నాను. నా మనసు అర్థం చేసుకోండి. నన్ను ఆశీర్వదిం చండి" అంటూ లేచివెళ్ళి మాధవి ఫొటో, మిగిలిన వివరాలూ తెచ్చి అందించాడు.

"ఇదుగోండి నాన్నగారూ! మాధవి ఫొటో, బయోడేటా. ఆ అమ్మాయి నాకెంతో నచ్చింది. ఆవిడ ఇంకా తన అంగీకారం తెలి యచేయలేదు. కానీ చాలా మటుకూ సుము ఖంగా వున్నట్లే.

"నేను చెప్పదలుచుకున్నది చెప్పేశాను. మీరు నిదానంగా ఆలోచించి చూడండి.

"బాగా పొద్దుపోయింది. రేపు పొద్దున్నే వెళ్ళాలి నేను. ఇక పడుకుంటాను" అని చెప్పి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

చేతిలోని ఫొటో వంక చూశాడు రాజశే ఖరం. అమ్మాయి నిస్సందేహంగా అందమై నదే. మధుకి ఈడూజోడూగా వుంటుంది. ఫొటో భార్యకి అందించి బయోడేటా చదివే సరికి ప్రసన్నత ఎగిరిపోయింది. భార్యకు చదివి వినిపించాడు. నిరాకరించింది ఆవిడ.

"ఇంత తెలివిగల పిల్ల. ఇంత సంపాదిం చుకుంటూన్న పిల్ల మనవాడిని గడ్డిపోచ కింద కొట్టిపారేయదూ. ఓ పని చేద్దాం. అబ్బాయ్ జాతకాల పట్టింపు వుందిరా అని చెప్పి అమ్మాయి జాతకం తెప్పిద్దాం. కుదర్లే దని చెప్దాం" అంది.

"వెనకటికి నీలాంటిది ఎవరో కొబ్బరికా యలకోసం దొంగ చెట్టెక్కితే దిగకుండా ఆప డానికి చెట్టుకి మడిబట్ట కట్టిందిట. వెర్రి మొర్రి ఆలోచనలూ నువ్వూనూ. ఇన్నివిధాల చెప్పినా వినిపించుకోని వాడు జాతకాల మాటకి ఒప్పుకుంటాడా? సరే కానీయ్ ఏం చేస్తాం? వాడు చెప్పినట్లు ఎవరి బతుకులు వాళ్ళ ఇష్టప్రకారం మలుచుకోవడం ఒక విధంగా మంచిదే. కోరి చేసుకుంటున్నాడు కాబట్టి వాడే ఎడ్జెస్ట్ అవుతాడు.

ఇక మనమాట అంటావా? ఆ భగవం తుడి దయవల్ల మనకే ఆర్థికమైన ఇబ్బం దులూ లేవు. స్వంత ఇల్లుంది. ఉద్యోగం చేసినన్నాళ్ళూ జీతం, ఆ తర్వాత పెన్షనూ వస్తాయి. నా అనంతరం నీక్కూడా ఫ్యామిలీ పెన్షన్ వస్తుంది. ఇక కనిపెట్టి ఉండడం అంటావా? ఈ రోజుల్లో ఎవరు ఎవరిని కనిపెట్టి వుంటున్నారు? ఎవరికి వారే యమునా తీరే" అన్నాడు రాజశేఖరం.

"అంతేలెండి. ఇక వేదాంతం చెప్పుకోడం ఒక్కటే మనకు మిగిలింది" అంది భారతి బరువుగా.

తెల్లవారింది ఎనిమిదింటికే ప్రయాణం అయ్యాడు మధు. టిఫెన్ చేసిపెట్టింది భారతి. బస్టాండుదాకా వస్తా పద అంటూ బయలుదేరాడు రాజశేఖరం. ఇద్దరూ స్కూటరు మీద బస్టాండుకు వెళ్ళారు. టికెట్ కొనుక్కున్నాడు. మరో అయిదు నిముషాల్లో బస్ బయలుదేరుతుంది.

"మధూ! ఏజ్ బార్ అయిపోయిందనో, మంచి ఉద్యోగం రాలేదనో విరక్తితో నువ్వు ఈ నిర్ణయం తీసుకున్నావేమో! అలాంటిది ఏమైనా వుంటే నాతో చెప్పు. ఇప్పుడిక్కడ ట్యుటోరియల్స్ బోలెడు వస్తున్నాయి. ఎమ్ సెట్‌కి ట్యూషన్లు చెప్పినా బోలెడంత డబ్బు వస్తుంది. ఎవరితోనైనా చెప్పి ఉద్యోగం

ఇప్పిస్తాను" అన్నాడు రాజశేఖరం.

"అలాంటిది ఏమీలేదు నాన్నా. ఈ మార్గం నచ్చి ఇలా చెయ్యాలని నిర్ణయించు కున్నాను" అన్నాడు మధు.

బస్ వెళ్ళిపోయింది.



భానుప్రతాప్, భవానీ విజయవాడ చేరుకున్నారు. విజయవాడలో వాళ్లకి స్వంత ఇల్లుంది. అది అద్దెకి ఇచ్చారు. ఆ పక్క ఇంట్లోనే వుండే అన్నయ్య ఈ ఇంటి మంచీచెడ్డా చూస్తూ వుంటాడు. తమ్ముడినీ, మరదల్నీ ఆప్యాయంగా ఆహ్వానించాడు ఆయన. ఆరోజు ప్రయాణం బడలిక తీర్చు కుని మర్నాడు కనకదుర్గమ్మని దర్శించుకుని ఓ తెలుగు సినిమా చూసి ఆ రాత్రి తొమ్మి దింటికి రాజశేఖరానికి ఫోన్ చేశాడు.

"నేనండీ భానుప్రతాప్‌ని" అన్నాడు.

"నమస్కారం బావున్నారా?" అని పలక రించాడు రాజశేఖరం.

"బాగానే వున్నాం. ఏన్యువల్ లీవ్‌లో విజయవాడ వచ్చాం. అసలు మా స్వంత ఊరు ఇదే. మా అన్నయ్యా వాళ్ళు ఇక్కడే ఉంటారు. నిన్ననే వచ్చాం. కాస్త బడలిక తీర్చుకుని తెలుగు సినిమా చూశాం. ఎంత యినా ప్రవాసాంధ్రులం కదండీ. మనవైపు రాగానే పెసరట్లమీదికీ తెలుగు సినిమాలమీ దికీ మనసు పోతుంది" అన్నాడు.

"ఆ మాట నిజమేలెండి. మా కజిన్ బ్రదర్ ఢిల్లీలో వుంటాడు. రాగానే మిరప కాయ బజ్జీలు, ఉల్లి మినపట్టూ తినేసి తృప్తి చెందుతాడు" అన్నాడు రాజశేఖరం.

"అన్నట్టూ అడగడం మర్చిపోయాను. అబ్బాయి మీతో మాట్లాడాడా?" అసలు విషయం అడిగేశాడు.

"కిందటి వారం వచ్చివెళ్ళాడు" అంతమ టుకే చెప్పి వూరుకున్నాడు.

ఆయన ముక్తసరి వ్యవహారానికి చిరాగ్గా వున్నా మొహమాటం వదుల్చుకుని, "మేం మీ ఇంటికి వద్దామనుకుంటున్నాం. ఒకసారి మిమ్మల్ని పరిచయం చేసుకున్నట్లూ వుంటుంది. నాలుగూ మాట్లాడుకున్నట్లూ వుంటుంది" అన్నాడు భానుప్రతాప్.

"అయ్యో దానికేం భాగ్యం! తప్పకుండా రండి" అన్నాడు రాజశేఖరం.

"మీకు ఎప్పుడు వీలో చెప్తే వస్తాం, ఆది వారం అయితే శలవు కదా మీకు. ఆది వారం రమ్మంటారా?" అడిగాడు.

"ప్రస్తుతం మాకు శలవులు నడుస్తు న్నాయి. మీరెప్పుడు వచ్చినా ఇబ్బంది లేదు" అన్నాడు.

"సరే అయితే రేపు వస్తాం" అని చెప్పాడు భానుప్రతాప్.

భోజనాలు చేశాక "అన్నయ్యా రేపు మేం గుంటూరు వెళ్ళొస్తాం. అక్కడ ఏదో సంబంధం వుందిట" అన్నాడు.

నిజానికి అన్నగార్ని కూడా వెంట తీసుకు వెళ్ళాలని ఎంతగానో వుంది ఆయనకి. మామూలు పరిస్థితుల్లో అయితే అలాగే తీసుకెళ్ళేవాడే. కానీ ఇప్పుడు అక్కడి పరి స్థితి ఎలా వుందో? అందుకే ధైర్యం చాల లేదు.

అన్నగారు మాత్రం అదేం పట్టించుకో లేదు. "అలాగే వెళ్ళిరండి. మేం దాని పెళ్ళి గురించే ఆలోచిస్తున్నాం. ఇప్పటికే చాలా

ఆలస్యం అయింది. ఇంతకీ ఎవరిద్వారా వచ్చిందీ సంబంధం? అబ్బాయి ఏంచేస్తున్నాడు? " అంటూ ప్రశ్నలు వేశాడు.

"ఆ వివరాలన్నీ తెలియవు. అక్కడి ఫ్రెండ్స్ ఎవరో అడ్రస్ ఇచ్చారు. అందుకే నిన్ను రమ్మనటంలేదు" అంటూ అబద్ధం ఆడేశాడు.

మర్నాడు కాఫీ, ఫలహారాలు అయ్యాక టాక్సీ మాట్లాడుకుని గుంటూరు ప్రయాణం అయ్యారు దంపతులు. దార్లో పళ్ళూ స్వీట్లూ కొనుక్కున్నారు. ఉదయం పదకొండు గంటలకి అరండల్ పేట ఆరోలైను ఆరో అడ్డరోడ్డులో వున్న రాజశేఖరం గారింటిముందు ఆగారు.

ఇల్లు పొందికగా అందంగా వుంది. లేత పసుపు సున్నంమీద కాఫీపొడి రంగులతో డిజైన్ ఎంతో బాగా నప్పింది. గేటుకి ఒక వైపు ఇంటిపేరు, మరోవైపు యజమాని పేరూ పాలరాతి పలకలమీద రాసి వున్నాయి. గేటుదగ్గరనుండి ఇంటిదాకా పదిహేను గజాలమేర సిమెంటు దారి వుంది. ముందు ఖాళీ స్థలంలో మందారాలు, బోగన్‌విల్లాలూ వున్నాయి. వరండా గ్రిల్ మీదికి పాకి వుంది సన్నజాజి.

ఎంత బావుందో బొమ్మరిల్లులా అని ముచ్చటపడింది భవాని.

కారు ఆగిన శబ్దం విని బయటికి వచ్చాడు రాజశేఖరం. గ్రిల్ తలుపుతీసి గేటుదగ్గరికి వచ్చాడు. తెల్లని పైజమా లాల్చీలో హుందాగా వున్న రాజశేఖరాన్ని భానుప్రతాప్, లేత గోధుమరంగు సఫారీ సూట్‌లో దర్జాగా వున్న భానుప్రతాప్‌ని రాజశేఖరం ఎగాదిగా చూసుకున్నారు.

"రండి! రండి" అంటూ ఆహ్వానించాడు రాజశేఖరం. "నా పేరు భానుప్రతాప్" అంటూ కరచాలనం చేశాడాయన.

అందరూ లోపలికి వెళ్ళారు. చిరునవ్వుతో ఎదురొచ్చింది భారతి. "నా భార్య" అంటూ పరిచయం చేశాడు రాజశేఖరం. తాము తెచ్చిన యాపిల్స్ ఆవిడ చేతికి ఇచ్చింది భవాని. "ఎందుకండీ? "అంటూ మొహమాటంగా అందుకుంది భారతి.

కూలర్ ఆన్‌చేసింది భారతి "కూర్చోండి" అతిథులను ఆశీనులని చేశారు. "ఎండన పడి వచ్చారు, భారతీ చల్లగా ఏదైనా తీసుకురా ముందు" అన్నాడు రాజశేఖరం.

"అవునండీ. బాగా ఎండగానే వుంది. మీ పుణ్యమా అని చల్లటి బీర్ ఇచ్చారంటే" భార్య సైగ చేసేలోగానే తనకి కావల్సింది అడిగేసి ఫెళ్ళున నవ్వాడు భానుప్రతాప్.

గతుక్కుమంది భారతి. రాజశేఖరం మొహం మాడిపోయింది. తలవంచుకుని లోపలికి వెళ్ళిపోయింది భారతి. ఒక్కక్షణం ఆగి తనూ లోపలికి వెళ్ళాడు రాజశేఖరం.

అతిథులు మిగిలిపోయారు.

"నేననుకుంటూనే వున్నా! ఇలాంటిదేదో చేసి తగలెడతారని. మరీ అయోమయం ఎక్కువ అయిపోతోంది మీకు. ఎక్కడెలా మాట్లాడాలో ఆమాత్రం తెలియకపోతే ఎట్లా? ఆడపిల్లని అడగడానికి వచ్చిన వాళ్ళం వచ్చీరాగానే బీరు తే అని వెంటబడితే వాళ్ళేమనుకుంటారు? " మెత్తగా మందలించింది భవాని.

నాలిక్కరుచుకున్నాడు ఆయన. అలవాటు ప్రకారం నోరుజారేడు. అందుకే "ఆ సింగినాదం! ఈ రోజుల్లో సివిల్ పీపుల్ కూడా లక్షణంగా డ్రింక్స్ తీసుకుంటున్నారు. అయినా నేను విస్కీ అడిగానా? బ్రాందీ అడిగానా? ఆఫ్ట్రాల్ బీర్ అడిగాను. బీర్ జెంటిల్‌మెన్స్ డ్రింక్" అన్నాడు గంభీరంగా.

"చాల్లే వూరుకోండి. చేసింది చాలక సమర్ధించుకోడం కూడానూ" విసుక్కుంది భవాని.

"ఏం చెయ్యమంటావ్? అసలే గుంటూరు. అందులో చైత్రం చివర్రోజులు. ఎండ మండిపోతోంది. నాలిక పీక్కుపోతోంది" వాపోయాడాయన.

"సర్లెండి. అయిపోయిందేదో అయిపో





యింది. ఇకనైనా కాస్త ఒళ్ళు దగ్గరుంచుకుని మాట్లాడండి" అనేసిందావిడ.

వంటగదిలో గట్టుకి ఆనుకుని నిలబడింది భారతి. ఆవిడ పక్కనే రాజశేఖరం.

"ఏవిటీయన ఉద్దేశ్యం? బీరు తెమ్మంటాడు. నేనేమైనా బార్లో బీర్లు అందించే వెధవలా కనిపిస్తున్నానా? " చిరాకుపడ్డాడు.

"ఆడవాళ్ళు ఎదురుగా వున్నారని మర్యాదైనా వుండక్కర్లా. ఎంత మిలట్రీ వాడైతే మటుకు బొత్తిగా కొత్తవాళ్ళం. మనింటికి రాగానే బీరు తెమ్మంటాడా? ఇంకాసేపు ఆగితే నన్ను డ్యాన్స్ చెయ్యమంటాడేమో ఖర్మ" విసుక్కుంది.

"ఇలాంటి తాగుబోతుతో సంబంధం కలుపుకుంటే ఇక ఆ అందం చూడాల్సిందే. ఇదంతా నీ కొడుకు చేసిన నిర్వాకం" మండిపడ్డాడు ఆయన.

"వాడి నిర్వాకం ఏదో వాడు చేశాడు. ఇప్పుడు మనం తెలివిగా వ్యవహరించాలి. ముందు గదిలోకి వెళ్ళగానే మూర్ఛవచ్చినట్లు బిగుసుకుపోతాను నేను. మీరు కంగారు నటించి నా చేతిలో తాళాలగుత్తి పెట్టండి. నా భార్యకు ఆరోగ్యం బాగాలేదు మీరు వెళ్ళిరండి అని వాళ్ళను సాగనంపండి.

ఆ తర్వాత మదర్ సీరియస్ స్టార్ట్ ఇమ్మిడియట్లీ అని అబ్బాయిని పిలిపించి నువ్వీ సంబంధం చేసుకుంటే బావిలో దూకుతా అని బెదిరిస్తాను, దాంతో ఈ గండం గట్టెక్కుతుంది" ఉపాయం చెప్పింది భారతి.

"అంత డ్రామా వద్దులే బెడిసికొడితే అనవసరంగా అల్లరిపాలవుతాం. ప్రస్తుతానికి వాళ్ళకి కూల్‌డ్రింకు ఇవ్వు. ఓ పావుగంట మాట్లాడి పంపిద్దాం" అన్నాడాయన.

"సరే మీ ఇష్టం" అందావిడ అసంతృప్తిగా.

మొహాన ప్రసన్నత తెచ్చిపెట్టుకుని ముందుగదిలోకి వచ్చాడు రాజశేఖరం.

"సారీ రాజశేఖరంగారూ, ఏదో అలవాటుగా అడిగేశాను. మాకక్కడ పార్టీలూ అవీ వుంటాయికదా" అంటూ క్షమాపణలు చెప్పాడు భానుప్రతాప్.

"అవున్లెండి, నేనర్థం చేసుకోగలను" అన్నాడు రాజశేఖరం.

అంతలో కిసాన్ స్క్వాష్ తీసుకొచ్చింది భారతి. ఆవిడ మొహంలో ఇంకా చిరాకు తొంగిచూస్తూనే వుంది. అది గమనించి సోఫాలోంచి లేచి నిలబడి చేతులు జోడించి వినయంగా ఆవిడకి సారీ చెప్పాడు భానుప్రతాప్.

చెట్టంత మగవాడు సారీ చెప్పేసరికి తడబడింది భారతి. "అయ్యో ఫర్వాలేదండీ. దాన్లో ఏముంది" అనేసింది.

గోడమీద లామినేట్ చేసిన ఫొటో చూసి, "మీ అమ్మాయీ అల్లుడూనా? " అని ప్రశ్నిస్తూ సంభాషణ మార్చింది భవాని.

"అవునండీ. ఇదుగో మా అబ్బాయి" అంటూ మరో ఫొటో చూపించింది భారతి. కుతూహలంగా చూశారు దంపతులిద్దరూ. మధు చాలా అందంగా వున్నాడా ఫొటోలో.

"అబ్బాయి చదువూ అదీ ఇక్కడేనా? " అడిగాడు భానుప్రతాప్.

"ఇంటర్‌దాకా ఇక్కడే చదివాడు. తర్వాత బెంగుళూర్‌లో ఇంజనీరింగ్ చేశాడు" చెప్పాడు రాజశేఖరం.

"మీ స్వంతూరు ఇదేనా? " మరోప్రశ్న.

"స్వంత ఊరు పొన్నూరు దగ్గర వాండ్రపాడు. కానీ నా అయిదేళ్ళ వయసులో ఇక్కడికి వచ్చేశాను. చదువూ ఉద్యోగం అన్నీ ఇక్కడే" చెప్పాడు రాజశేఖరం.

"అదృష్టవంతులు. దర్జాగా ఆంధ్రాలో వున్నారు. నేను బెజవాడ లయోలా కాలేజీలో డిగ్రీచేసి ఆర్మీలో చేరిపోయాను. అప్పట్నుంచీ ప్రవాసాంధ్రుడిగానే వుండిపోయాను" దిగులుగా చెప్పాడు భానుప్రతాప్.

"ఆమాటకు వస్తే ప్రవాసాంధ్రులకే ఆంధ్రదేశాభిమానం ఎక్కువ. ఇక్కడ వున్న మాకంటే మీరేనయం. పండుగలూ,




పబ్బాలూ ఇక్కడవారికంటే ఢిల్లీ, బాంబేలలో ఉన్నవాళ్ళే దర్జాగా జరుపుకుంటున్నారు" ఒదార్చాడు రాజశేఖరం.

"అదీ నిజమేలెండి. రోజులు బాగా మారి పోయాయి. మా రోజుల్లో..." అంటూ మొదలుపెట్టి బెజవాడలో తన బాల్యం, తాడంకివారి వీధి అప్పట్లో ఎలా వుండేది? దుర్గా కళామందిర్ సినిమాహాల్లో ఎలా ఎన్.టి.ఆర్. సినిమా చూసిందీ. మనోరమ హోటలు పెట్టిన కొత్తలో అక్కడి టిఫెన్ల రుచి, చిన్నప్పటి కృష్ణా పుష్కరాల వివ రాలూ అవీ ఏకరువుపెట్టాడు.

అప్పటి సరదాలే వేరు కదండీ అంటూ అందుకుని ఓవర్ బ్రిడ్జీ కట్టకముందు ట్రాఫి క్‌లోని ఇబ్బందులూ, నాజ్ సెంటర్లో దొరికే జీడిపప్పు పాకం రుచీ, శంకర్‌నివాస ఇడ్లీ, కొబ్బరి పచ్చడీ ప్రాముఖ్యం, ఏ.ఐ.సీ.సీ. సభలకోసం చేసిన ఏర్పాట్లు, లాల్‌బహ దూర్ శాస్త్రిగారి బహిరంగసభ వగైరా పాత కబుర్లన్నీ నెమరువేసుకున్నాడు రాజశేఖరం.

"మీరు లక్ష చెప్పండి. గుంటూరు, బెజవా డల్ని మించిన ఊళ్ళు మరెక్కడా లేవను కోండి" అన్నారు ఏకగ్రీవంగా.

మగవాళ్ళ కబుర్లకి విసిగిపోయిన ఆడ వాళ్ళు చల్లగా లోపలికి జారుకున్నారు. ఇల్లంతా చూపించింది భారతి. "చాలా బావుంది మీ ఇల్లు. నాకిలా స్వంత ఇంట్లో వుండాలని ఎంతో సరదా. గవర్నమెంటు వారిచ్చిన ఇంట్లో ఎన్ని సౌకర్యాలు వున్నా ఈ తృప్తి వుండదు కదండీ. స్వంత ఇల్లు కట్టుకున్నాంగానీ ఒక్కరోజైనా దాంట్లో వుండలేదు. అద్దెకున్నవారికి ఇంటిమీద శ్రద్ధ ఎందుకుంటుంది? గోడల్నిండా మేకులు కొట్టి నానా ఆగం చేశారు. ఇప్పుడు అడి విలా తయారైంది ఆ ఇల్లు" అంది భవాని.

"ఫర్వాలేదులెండి. మీరు రిటైరు అయి వస్తే క్షణంలో రిపేరు చేయించుకోవచ్చు" అంది భారతి.

అంతలోనే చీరలవాడు వచ్చాడు. గద్వా ల్‌నుండి నేరుగా తెస్తాడు. ప్రతి నెలా వస్తాడు. ఇప్పుడు కాదులే మళ్ళీరా అని పంపేయబోయిన భారతి భవాని కుతూ హలం కనబరచడంతో మూట దింపిం చింది.

ఆ చీరెలు చూసి మురిసిపోయింది భవాని. "ఎంత బాగున్నాయో, అక్కడ ఇలాంటి రకాలు దొరకవు. షాపుల్లోకి వెళ్ళినా నేత ఇంత బాగుండదు. ఎలా అయినా ఇట్లా నేరుగా తీసుకొచ్చేవాళ్ళదగ్గరి చీరెల నాణ్యంవేరు. మాకు అక్కడ ఈ సదుపాయం లేదు" అంది దీనంగా.

వాకిట్లోకి వచ్చే మూటల వాడిదగ్గర చీరెలు కొనే అదృష్టానికి దూరం అయిపో యిన సాటి ఇల్లాలిని చూస్తే కడుపు చెరువు అయిపోయింది భారతికి!

అందుకే తాను పూనుకుని సెలక్షన్‌లో సహాయంచేసి చీరల అతనితో బేరం ఆడి పోట్లాడినంత పనిచేసి ధర తగ్గించింది. రెండు చీరలు కొనుక్కుంది భవాని.

"నేను ఎప్పట్నించో కొంటున్నాను. నాణ్య తకి ఢోకాలేదు" అంటూ తాను అదివరకు కొన్నచీరలు అన్నీ చూపించింది. ఈ వ్యవ హారం అంతా ముగించేసరికి ఒంటిగంట దాటింది.

టైం చూసుకుని కంగారుగా లేచాడు భానుప్రతాప్. ఇక వెళ్తాం అన్నాడు. "అదే మిటి. భోజనాలవేళ అయింది. భోజనం చేసివెళ్ళండి" అన్నాడు పావుగంటలో సాగ నంపాలనుకున్న రాజశేఖరం.

"అవును. ఎంత. క్షణంలో వంటయిపో తుంది" అంటూ భర్తను బలపరిచింది మూర్ఛ నటించాలనుకున్న భవాని.

అరగంటలో వడ్డించేసింది. వంకాయ కూర, బంగాళదుంప వేపుడు, మామిడికాయ పప్పు, గోంగూర పచ్చడి, మునక్కాడ చారు, అప్పడాలు, గుమ్మడి వడియాలు.

ముద్దముద్దకీ భారతి పాకనైపుణ్యతను ప్రశంశిస్తూ తృప్తిగా భోజనం చేశారు భాను



ప్రతాప్, భవాని.

"నేనేం చేశానని అంత పొగుడుతున్నారు. అన్నీ మాకోసం చేసుకున్నవే. ఇంత అన్నం వండి బంగాళాదుంపలు వేయించాను అంతే. బజ్జీలు వేద్దామనుకుని కూడా ఆలస్యం అయిపోతుందని ఆగిపోయాను" అంది భారతి లోలోన సంతోషిస్తూనే.

మరి కాసేపు కబుర్లు చెప్పుకుని మూడ య్యాక బయలుదేరారు. ఆప్యాయంగా వీడ్కోలు ఇచ్చారు భారతి, రాజశేఖరం.

"అన్నీ బాగానే వున్నాయి. మనుషులు చాలా మంచివాళ్ళు పాపం" అంది భారతి గేటువేసి ఇంట్లోకి వస్తూ.

"చూశారా, ఆ మంచీ మర్యాదా! చక్కని సాంప్రదాయం అయిన కుటుంబం. ఆ అబ్బాయి గనుక ఏ ఎమ్.బీ.ఏ.నో చదువు కుని పెద్ద ఉద్యోగం చేస్తూ వుంటే వాళ్ళ కాళ్ళమీద పడైనా ఒప్పించేదాన్ని" అంది భవాని కారు బయలుదేరాక.

బెజవాడ జేరారు. "ఏవిట్రా వెళ్ళినపని ఏమైంది కాయాపండా?" అని అడిగాడు భానుప్రతాప్ అన్నగారు.

"అంతా బాగానే వుంది. కానీ అబ్బాయిని చూడాలికదా" అన్నాడు భానుప్రతాప్.

ఆ రాత్రి గోదావర్లో బయలుదేరి తెల్లారేస రికి హైదరాబాద్ చేరుకున్నారు దంప తులు. స్టేషన్‌కి వచ్చి రిసీవ్ చేసుకుంది మాధవి.

కుశలప్రశ్నలూ, పలకరింపులూ అయ్యాక కార్లోనే తాము గుంటూరు వెళ్ళొచ్చిన సంగతి చెప్పారు. రూమ్‌కి చేరి కాఫీ తాగాక మళ్ళీ ఆ టాపిక్ వచ్చింది.

ఫోన్‌లో నువ్వీ విషయం చెప్పాక నేనూ మమ్మీ చాలాసేపు ఆలోచించాం. వాళ్ళు డబ్బాశపడి నీ సంపాదన చూసి పెళ్ళి చేసు కుంటున్నారేమో అనుకున్నాం. కానీ నిన్న వాళ్ళ ఇంటికి వెళ్ళి వాళ్ళని చూశాక ఆ సందేహం తీరిపోయింది.

ఆర్థికంగా వారికేలోటూలేదు. గుంటూర్లో స్వంత ఇల్లు వుంది. ఈ ఊర్లో ఒక ప్లాటు కూడా వుందిట. ఆయన గవర్నమెంట్ కాలే జీలో లెక్చరరు. రిటైర్‌మెంట్ ఇంకా నాలుగే ళ్ళుంది. ఆడపిల్ల పెళ్ళి అయిపోయింది. ఆ అమ్మాయి స్టేట్స్‌లో వుందిట. దంపతులి ద్దరూ అందంగా ఆరోగ్యంగా వున్నారు. కుటుంబపరంగా చూస్తే ఏలోటూలేదు. మంచి సంప్రదాయమైన కుటుంబం. ఇక అబ్బాయి ఎట్లా వున్నాడో మాకు తెలియదు కదా!" అన్నాడాయన కూతుర్ని దగ్గర కూర్చోబెట్టుకుని.

భవాని అందుకుంది. "అబ్బాయి కూడా బాగానే వున్నాడు. ఫోటో చూశాంగా. దుర్వ్యసనాలు ఏమీ లేవుట. ఆవిడ మాటల్లో చెప్పింది. కొడుకు మాట ఎత్తితే చాలు ఆవిడ మొహం చింకి చేటంత అవు తోంది. అతనంటే ఆ తల్లిదండ్రులకి తగని ఇష్టం అని స్పష్టంగా తెలిసిపోతోంది. కానీ వున్నమాట చెప్పేస్తున్నాను బేబీ. ఆ ఇంటినీ, వాళ్ళనీ, వాళ్ళ పద్ధతులనీ చూస్తుంటే నీకూ వాళ్ళకీ పొత్తుకుదరదేమో అనిపించింది.

"ఏదో మామూలు చదువు చదువుకుని పనీపాటా తెలిసిన అమ్మాయి అయితే ఆ ఇంట్లో ఇట్టే ఇమిడిపోతుంది. వాళ్ళూ సుఖ పడతారు. అటు ఆ అమ్మాయీ సుఖపడు తుంది. ఈ పెళ్ళి జరిగితే నువ్వూ వాళ్ళూ కూడా ఇబ్బంది పడతారేమో అనిపిస్తోంది" ఖచ్చితంగా వున్నమాట చెప్పేసింది.

"తన తల్లిదండ్రుల సుఖం గురించి ఆలో చించవలసిన బాధ్యత ఆ అబ్బాయిదిగానీ మనది కాదు కదమ్మా! మీకేమైనా అభ్యం తరం వుంటే చెప్పండి. అతను నచ్చకపోతే, మీ అల్లుడిగా అతను తగడనుకుంటే చెప్పండి" అంది మాధవి.

ఇద్దరూ మొహమొహాలు చూసుకున్నారు. "అలాగే, అతన్ని చూస్తాం!" అన్నారు. "ఈ పూటే రమ్మంటాను" అని చెప్పింది మాధవి.

ఆఫీస్‌కి వెళ్ళగానే ఫోన్‌చేసి మెసేజ్





ఇచ్చింది. అతని ఫోన్ రాగానే విషయం అంతా వివరించి తన అడ్రెస్ ఇచ్చింది. "వీలైతే ఈ పూటే వెళ్ళి కలుసుకోండి" అని చెప్పింది. అలాగే ఓ గంటలో వెళ్తానని చెప్పాడు మధు.

చెప్పినట్లుగానే గంట తర్వాత మాధవి చెప్పిన గుర్తుల ప్రకారం వెళ్ళాడు. పనిపిల్ల సాయంతో గదిని యధాశక్తి సర్ది స్నానా లవీ ముగించి ఇతనికోసం ఎదురుచూస్తు న్నారు భవాని, భానుప్రతాప్.

ఆదరంగా ఆహ్వానించారు. వినయంగా నమస్కరించాడు మధు. తను తెచ్చిన స్వీట్‌పాకెట్ వారికి అందించాడు.

"మీరు అచ్చంగా మీ అమ్మగారి పోలికే" అంది భవాని.

"అవును, పర్సనాల్టీ మాత్రం వాళ్ళ నాన్న గారిది" అన్నాడు భానుప్రతాప్.

"నిన్న మీరు మా ఇంటికి వెళ్ళారుట కదూ! నాన్నగారు చెప్పారు. రాత్రి ఫోన్ చేశారు. చాలా సరదాగా కాలక్షేపం అయింది అన్నారు" అన్నాడు మధు.

"అవును... కొత్తగా పరిచయం అయినా పాత స్నేహితుల్లా కలిసిపోయాం" అన్నాడా యన. కూర్చోండి అని మంచం మీదే కూర్చోబెట్టాడు. ఫ్రిజ్ తీసి చల్లటి బీర్ తీసి ఆఫర్‌చేశాడు.

చేతులు జోడించాడు మధు. "వద్దండీ. నాకు అలవాటు లేదు" అనేశాడు. నీరుగారి పోయాడు భానుప్రతాప్.

"మీ నాన్నగారు పెద్దవారు ఆయనకి అల వాటు లేదంటే అర్థం వుంది. యంగ్ జెంటి ల్‌మేన్ మీరు కూడా అలవాటు లేదనేస్తే ఎలా? " అన్నాడు నీరసంగా.

గయ్‌మంటూ లేచింది ఆవిడ. "అతను బుద్ధిగా వుంటే అదేదో లోపం అయినట్లు బాధపడిపోతున్నారు. అందరూ మీలాగే వుంటారా? తెల్లవారింది మొదలు ఇదే పని అదేదో గొప్ప అయినట్లు కాలరెగరేసుకోడం కాకుండా బుద్ధిమంతులని చూసి జాలిప డటం ఒకటి" అని అరిచేసింది.

ఆయనకి చిన్నతనంగా అనిపించింది. "మా ఆవిడ ఎప్పుడూ ఇంతే. నామీద ఒంటి కాలుమీద లేస్తుంది" అంటూ తన బాధ వెళ్ళబోసుకున్నాడు.

కొత్తవ్యక్తి ఎదురుగా ఆయనలా అనడం భవానికి నచ్చలేదు. "నానోరే కనిపిస్తుంది. మీరు చేసేవి కనపడవు" అని దెబ్బలాటకి దిగింది.

ఇద్దరూ ఆ విషయంమీద కాసేపు నువ్వంటే నువ్వని వాదించుకున్నారు. తర్వాత తమ తప్పు తెలుసుకొని నోళ్ళు మూసుకున్నారు.

"మా ఆవిడా నేనూ వూరికే ఇలా దెబ్బ లాడుకుంటూవుంటాం" అన్నాడు భానుప్ర తాప్.

"మా ఇంట్లోనూ ఇదే గొడవ. మా అమ్మా నాన్నగారూ ఇంట్లో మాట్లాడుకునేది తక్కువ, పోట్లాడుకునేది ఎక్కువ" అన్నాడు మధు నవ్వేస్తూ.

ఆ తర్వాత ముగ్గురూ కలిసి బోలెడు కబుర్లు చెప్పుకున్నారు. ఒంటిగంటకి ముగ్గురూ ఆటోలో హోటల్‌కి వెళ్ళారు. భోజనాలు అయ్యాక మళ్ళీ కలిసే రూమ్‌కి వచ్చారు. వాళ్ళని అక్కడ వదిలి తన రూమ్‌కి వెళ్ళిపోయాడు మధు.

భానుప్రతాప్, భవానీ నడుం వాల్చారు.

"అబ్బాయి ఎలా వున్నాడు? " అడిగాడా యన.

"అబ్బాయికేం లక్షణంగా వున్నాడు" వెంటనే చెప్పేసింది భవాని.

"ఆమాట అక్షరాలా నిజం. వెతికి చూసినా ఏమీ వంకపెట్టలేం. మర్యాదకి మర్యాద, అందానికి అందం. మంచివాడు, బుద్ధిమంతుడు, తెలివిగలవాడు" ఏకీభవిం చాడు.

"అవును... ఉద్యోగం చెయ్యడం ఇష్టంలే దన్నాడు అంటే నంగి నంగిగా వుంటాడేమో అనుకున్నా. తీరా చూస్తే మెరికలావున్నాడు



కుర్రాడు. ఏవండీ నాకు తెలియక అడుగుతాను లక్షణంగా చదువుండి, అంతోఇంతో ఆస్తి వుండి దర్జాగా ఏదో ఉద్యోగం చేసుకోక ఇదేం పనండీ!" అడిగింది.

"జిహ్వాకో రుచి పుర్రెకోబుద్ధి అని వూరికే అన్నారా? అందులోనూ ఈ కాలం పిల్లల విషయం చెప్పాలా? అన్నీ విపరీత ధోరణులే. తెలివితేటలు ఎక్కువైపోయి వచ్చిన చిక్కు ఇదంతా. ఇంతకీ బేబీ మన అభిప్రాయం ఏమిటని అడిగితే ఏం చెప్దాం? " అన్నాడాయన.

"వున్నమాటే చెప్తా. కుర్రాడికేలోపమూ లేదు అందాం, ఇక ఆపైన దాని ఇష్టం"

"దాని ఇష్టం సరే... నీ ఇష్టం అందనుకో నువ్వేం చేస్తావ్? " అడిగాడు.

"నేనైతే ఖచ్చితంగా వద్దంటాను. ఏదో కొత్త మోజులో ఇలాటి సిద్ధాంతాలు అన్నీ బాగానే వుంటాయి. దిగిన తర్వాతగానీ లోతు తెలియదు. భార్యని ఎవరైనా పొగిడితే మగవారికి పౌరుషం పొడుచుకువస్తుంది. అలాటిది అనుక్షణం భార్య ఆధిక్యతను అంగీకరిస్తూ, కాలం గడపటం మగవాడివల్ల అవుతుందా? పుట్టుకతో వచ్చిన అహం అడ్డుపడదూ? "

"పెద్ద అల్లుడితో పడుతూనే వున్నాం కదా! తన తల్లీదండ్రీదగ్గరకు తను వెళ్ళచ్చు ఫోన్‌లో మాట్లాడచ్చు కానీ భార్య మాత్రం అమ్మానాన్నల్ని తల్చుకోకూడదు. ఆ కొరివితో సుమిత్ర వేగడంలేదూ. అలాగే రేపు బేబీ కూడా సర్దుకుపోతుంది. ఎంత చదివినా ఏంచేసినా ఆడదాని బతుకు ఇంతే" నిట్టూర్చింది భవాని.

"అలా ఎందుకనుకుంటావ్. ఆశావాదం అన్నివేళలా మంచిది. వీళ్ళిద్దరూ ఒకర్నొకరు అర్థంచేసుకుని ఆనందంగా జీవిస్తారేమో" అన్నాడు భానుప్రతాప్.

"అంతకంటే నేను కోరుకునేది మాత్రం ఏముంటుంది? పిల్లల సుఖసంతోషాలకంటే మనకేం కావాలి? " అంది ఆవిడ.

అంతలోనే ఫోన్ మోగింది "అదుగో బేబీయే. ఏంచెప్పను" అడిగాడు భానుప్రతాప్.

"ఇంకా ఆలోచన ఎందుకు. అనుకున్నదే చెప్పండి" చెప్పింది.

ఫోన్ తీశాడు.

"హల్లో డాడీ నేను" అంది మాధవి.

"ఇంతకు ముందే వచ్చాం బేబీ. లంచ్ కలిసే తీసుకున్నాం. అతను మమ్మల్ని ఇక్కడ దిగబెట్టి వెళ్ళాడు"

"ఐసీ... బాగా కాలక్షేపం అయిందా? " మరో ప్రశ్న.

"ఆహా!"

"మధు ఎలా వున్నాడు డాడీ!" దాచుకోవాలన్నా దాగని కుతూహలం తెలిసిపోతోంది.

"అతనికేం బేబీ. లక్షణంగా వున్నాడు. కాకపోతే ఈ పెళ్ళి అయితే నువ్వు ఎడ్జస్ట్ అవగలవా అని మా సందేహం"

"ఆ విషయం నాకొదిలేయండి డాడీ. రెస్ట్ తీసుకోండి. సాయంత్రం కలుద్దాం" అనేసి ఫోన్ డిస్కనెక్ట్ చేసింది మాధవి. ఛెయిర్‌లో వెనక్కివాలి కూర్చుంది. ఓ అయిదు నిముషాలు సీరియస్‌గా ఆలోచించింది.

తర్వాత సెక్రటరీకి ఫోన్ చేసింది.

"నేను ఇల్లు మారతాను. ఆ విషయం చూడు. మంచి లొకాల్టీలో మంచి ఇల్లు కావాలి" అని చెప్పింది.

"మరోవిషయం నేను మారుతి ఎస్టీమ్ బుక్ చెయ్యాలనుకుంటున్నాను" అని చెప్పింది.

"ఓకే మేడమ్" అన్నాడు సెక్రటరీ వినయంగా.

మాధురికి ఫోన్ చేసింది మాధవి. "ఆ చెప్పండి అమ్మగారూ ఏమిటి విశేషాలు? " అడిగింది మాధురి.

"డాడీ, మమ్మీ మధుని కలుసుకున్నారు. పొద్దున పదకొండింటినించి ఒంటిగంట దాకా కలిసే వున్నారుట. కలిసే లంచ్ చేశారుట. వాళ్ళకి మధు నచ్చాడు" చెప్పింది




మాధవి.

"మిత్రద్రోహీ మీ మమ్మీ, డాడీలకు చూపించావుగానీ నాకు అతడిని పరిచయం చేశావా? " నిష్ఠూరం ఆడింది మాధురి.

"ఆ మాటంటే నేనూరుకోను. ముందుగా ఫొటో చూసి నీకు నచ్చాకే నా ఫొటో పంపించావు. ముందు చూసింది నువ్వు. సెలక్ట్ చేసింది నువ్వు" దెబ్బలాటకి దిగింది మాధవి.

"ఫొటో చూస్తే సరిపోయిందా? మనిషిని చూడొద్దా? "

"దానికేం భాగ్యం అలాగే చూడు. నైట్ డిన్నర్‌కి బయటికి వెళ్దామా? నువ్వు సరే నంటే అతనికి ఫోన్ చేస్తాను"

"ఇవ్వాళా? వద్దులే ఇక్కడే చాలా లేట్ అయ్యేలా వుంది. రేపు వెళ్దాం" అంది మాధురి.

"ఆలస్యం అయితే ఆలస్యంగానే వెళ్దాం. ఆ మాత్రం దానికి ప్రోగ్రామ్ పోస్ట్‌పోన్ చెయ్యడం ఎందుకే? "

"ఏం రేపటిదాకా ఆగాలంటే బాధగా వుందా నీకు!" ఆటపట్టించింది.

"చాల్లే నోరుమూసుకో, వెధవ మాటలూ నువ్వునూ" కసిరింది మాధవి.

"ఉన్నమాట అంటే ఉలుకెందుకే. ఇవ్వాళే వెళ్దాం. ఎక్కడికి తీసుకువెళ్తావ్? " అడిగింది మాధురి.

ఒక్కనిముషం ఆలోచించి సమాధానం చెప్పింది మాధవి. "సరే, నేను ఎయిట్‌థర్టీకి నీ దగ్గరికి వస్తాను. మీ మమ్మీ, డాడీని చూసినట్టూ వుంటుంది. అక్కడినించి వెళ్దాం. ఒకవేళ నాకు లేట్ అయితే నువ్వు వెళ్ళిపో. నేను డైరెక్ట్‌గా హోటల్‌కే వస్తాను" అంది మాధురి.

మధుకి పేజర్‌లో మెసేజ్ ఇచ్చింది. పావుగంటలో ఫోన్ చేశాడు మధు.

"జీ హుజూర్... బందా హాజిర్‌హై!" అన్నాడు వినయంగా.

"ఊ ఏమిటి విశేషాలు? " అడిగింది కాస్త గంభీరత నటిస్తూ.

"మీ పేరెంట్స్‌తో చాలా సరదాగా గడిచిపోయింది. వాళ్ళు చాలా మంచివాళ్ళు. వాళ్ళను చూస్తుంటే మా అమ్మా, నాన్నా జ్ఞాపకం వచ్చారు" చెప్పాడు.

"వాళ్ళకీ మీరు చాలా నచ్చారుట" చెప్పింది.

బోలెడంత ఆనందపడిపోయాడు మధు. "అయితే వాళ్ళు ఓ.కే. అనేశారన్నమాట"

"అని నేను చెప్పానా? మీరు నచ్చారుట అన్నాను. అంతే. ఇంతకీ ఫోన్ ఎందుకు చేశానంటే నా క్లోజ్‌ఫ్రెండ్ వుందని చెప్పాను గుర్తుందా? "

"భలేవారే గుర్తులేకపోవడం ఏమిటీ? ఆవిడ కారణంగానేగా మనం కలుసుకున్నాం"

"అవును అదే. మిమ్మల్ని చూడాలని ఒకటే గొడవచేస్తోంది. సాయంత్రం మీరు ఫ్రీయేనా? "

"ఆహా నేనెప్పుడైనా ఫ్రీయే"

"అయితే ఎనిమిదిన్నరకు కలుసుకుందాం" అని వెన్యూ కూడా తెలియజేసింది.

"ఓ... తప్పకుండా వస్తాను. ఇంతకీ మీ నిర్ణయం ఏమిటి? ఏం డిసైడ్ చేసుకున్నారు" వినయంగా అడిగాడు.

"ఇంకా ఏమీ డిసైడ్ చెయ్యలేదండీ. నాక్కొంచెం టైం కావాలి" సమాధానం చెప్పింది, నవ్వాపుకుంటూ.

"దానికేం భాగ్యం? మీ ఇష్టం వచ్చినంత టైం తీసుకోండి" అన్నాడు బుద్ధిగా.

"సరే ఈవెనింగ్ కలుసుకుందాం!" అంది.

సాయంత్రం ఇంటికి వచ్చి తల్లితండ్రులతో తనివి తీరా కబుర్లు చెప్పింది. నేను బయటికి డిన్నర్‌కి వెళ్తున్నాను. మీరు హోటల్‌కి వెళ్తారా అని అడిగింది. వద్దు హోటల్‌నుండి కారేజీ తెప్పించుకుంటాం అన్నారు వాళ్ళు.

స్నానం చేసి తీరిగ్గా తయారై ఎనిమిది దాటిన పది నిముషాలకే శాండిల్స్ వేసు

కుని బయలుదేరింది. "మధు వస్తే ఇప్పటి దాకా వెయిట్ చేసి వెళ్ళానని చెప్పండి" అని చెప్పింది.

మాధవి అటు వెళ్ళగానే వచ్చింది మాధురి. విషయం తెలుసుకుని ఆశ్చర్యపో యింది. "అదేమిటి ఎనిమిదిన్నరదాకా వెయిట్ చెయ్యమన్నాగా!" అని అంతలోనే నవ్వేసింది. "అవును మరి అవతలి మనిషి అయస్కాంతంలా ఆకర్షిస్తూవుంటే అదేం చేస్తుంది పాపం" అంది.

ఈ వ్యవహారం అంతటికీ కారణం అయిన మాధురిమీద ఏమూలో కినుకవున్న భవాని ఆ మాటే మాధురిని అడిగేసింది. ఆవిడని మాట్లాడనిచ్చి అప్పుడు నోరు విప్పింది మాధురి.

"మీ భయం ఆధారంలేనిది ఆంటీ. మాధవి తెలివితక్కువదేం కాదు. ఒకవి ధంగా చెప్పాలంటే మాధవి నిర్ణయం ఇంకెంతో మందికి మార్గదర్శకం అవు తుంది. వాళ్ళ దాంపత్యం అందరికీ ఆదర్శ ప్రాయం అవుతుంది. చిన్నదాన్నైనా మీకో మాట ఖచ్చితంగా చెప్పదల్చుకున్నాను.

"పెళ్ళే వద్దని భీష్మించుకుని కూర్చున్న మాధవిని నేనే బలవంతపెట్టి ఒప్పించాను. ఇప్పుడు అది మనస్ఫూర్తిగా అతడిని ఇష్టప డుతోంది. ఇంతదాకా వచ్చాక ఇప్పుడు మీరు ఏమైనా అంటే దాని మనసుకి కష్టం కలిగిందంటే మొదటికే మోసం వస్తుంది. కాబట్టి మీ సందేహాలన్నీ పక్కనపెట్టి ఉత్సా హంగా ముందడుగు వెయ్యండి. హుషా రుగా పెళ్ళి ప్రయత్నాలు చెయ్యండి" అని చెప్పేసింది.

మొహమొహాలు చూసుకుని తలపంకిం చారు భానుప్రతాప్, భవాని.

"నిజమేనమ్మా నువ్వు చెప్పింది. ఏదో పెద్దవాళ్ళం. మా దృష్టికి ఆలోచించాం. బేబీ సుఖం కంటే మేము కోరుకునేది ఏముంది? " అన్నారు.





"అప్పుడే తొమ్మిదవుతోంది. మాధవి నీకోసం వెయిట్ చేస్తూ వుంటుంది" అంది భవాని.

"ఏం వెయిట్ చెయ్యదు. పైపెచ్చు నేనెంత లేట్‌గా వెళ్తే అంత ఆనందిస్తుంది. స్నేహితురాలి ఆనందంకోసం మరో అర గంట ఆగివెళ్తాను" అనేసింది మాధురి.

హోటల్‌లో టేబిల్ ముందు కూర్చుని వున్నారు మధు, మాధవి. సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

"నేను ఇల్లు మారదామనుకుంటున్నాను. ఇప్పుడు ఒక్క గదిలో వుంటున్నాను కదా. ఇరుగ్గా వుంది. పెద్ద ఇంట్లోకి మారదామని ప్లాన్" చెప్పింది.

"పెద్ద ఇల్లు ఎందుకు? పెళ్ళిగానీ చేసు కుంటున్నారా? " కుతూహలంగా అడిగాడు.

"ఇంకా ఏమీ నిర్ణయించుకోలేదు. ఎవ రైనా మంచివాడు దొరికితే పెళ్ళిచేసుకునే ఆలోచనలో వున్నాను" బింకంగా సమా ధానం చెప్పింది.

"ఓ, ఐసీ! ఆల్ ది బెస్ట్" అభినందించాడు.

"థాంక్స్! ఇంటిగురించి చెప్తున్నానుకదూ! మంచి లోకాలిటీలో త్రీ బెడ్‌రూమ్ ఫ్లాట్ వుందిట. వీలు చూసుకుని వెళ్ళి చూద్దామ నుకుంటున్నాను"

"ఫ్లాటా? " నీరసంగా అడిగాడు మధు.

"ఏం... ఫ్లాటు అంటే మీకిష్టంలేదా! నా మటుకు ఫ్లాటు అయితే అన్నివిధాలా బాగుంటుందనిపిస్తుంది. సేఫ్టీ, సెక్యూరిటీ. అవసరం అయితే పదిమంది చుట్టూ వుంటారు" తన ఐడియా చెప్పింది.

"అది నిజమే అనుకోండి. మీరిప్పుడు వున్న లైఫ్‌కి అవన్నీ కావాల్సిందే. కానీ పెళ్ళి చేసుకుంటానంటున్నారు. పెళ్ళయ్యాక సేఫ్టీ, సెక్యూరిటీ ఎందుకండీ? పెళ్ళయ్యాక కావ ల్సింది ప్రైవెసీ" అన్నాడు మధు.

సూటిగా చూసింది మాధవి.

"ఫ్లాట్స్‌లో కండీషను ఎలా వుంటుందం టేనండీ మీరు మీ ఆయన్ని ఏమైనా అడి గితే పక్కింటాయన సమాధానం చెప్తాడు.

మీ ఆయన మిమ్మల్ని పిల్చాడనుకోండి ఎదురింటావిడ ఓయ్ వస్తున్నా అంటుంది. ఇండిపెండెంట్ ఇళ్ళల్లో ఆ బాధ వుండదు. మాట్లాడుకోటం కాదు డ్యూయెట్లు పాడు కున్నా అడిగేవాడుండడు" చెప్పుకుపోతున్న మధు మాధవివంక చూసి ఆపేశాడు.

"అఫ్‌కోర్స్, ఇది నా అభిప్రాయం. ఆ తర్వాత మీ ఇష్టం. మీకాబోయే శ్రీవారి ఇష్టం" అన్నాడు బుద్ధిగా.

ఫకాల్న నవ్వేసింది మాధవి.

సరిగ్గా అప్పుడే రెస్టారెంట్‌లో అడుగుపె ట్టిన మాధురి ఆ దృశ్యం చూసి ఆనందప డిపోయింది. దగ్గరగా వెళ్ళి 'హలో గుడ్ఈవినింగ్' విష్ చేసింది.

వినయంగా లేచి నిలబడ్డాడు మధు. "ఐయాం మధు" అన్నాడు.

"మాధురి" అంటూ షేక్‌హేండ్ ఇచ్చింది.

"ఇంతాలస్యంగా వచ్చావేం? నీకోసం చూసిచూసి లేట్ అవుతుంటే నేను వచ్చే శాను" అంది మాధవి.

"అవునుట. మీ మమ్మీ చెప్పారు. నువ్విటు బయలుదేరావు. నేనటు వెళ్ళాను. వెళ్ళాను కదా అని మమ్మీ డాడీతో కాసేపు కబుర్లు చెప్పివచ్చాను" చెప్పింది మాధురి.

"అదే అనుకుంటున్నాను. ఇంకా రాలేదే మిటా అని. రెండుసార్లు ఆఫీసుకి ఫోన్‌చే శాను కూడాను" అనేసింది మాధవి.

"కొయ్... కొయ్ ఈ మాటలకేంగానీ ఇక్కడికి వచ్చాక ఒక్కసారైనా నన్ను తల్చు కున్నావా, నిజం చెప్పు" అల్లరిగా ప్రశ్నిం చింది మాధురి.

"భలేవారే... ఈ గంటసేపట్లో కనీసం వందసార్లు మిమ్మల్ని తల్చుకున్నారు మీ ఫ్రెండ్" నమ్మబలికాడు మధు.

"బాగానే వుంది. ఎలక్కి పిల్లి సాక్ష్యం" నవ్వేసింది మాధురి.

"మేము నిజమే చెప్తున్నాం. మీరు నమ్మ కపోతే ఏంచేస్తాం?" నిస్పృహాయత నటిం చాడు మధు.

"పోన్లెండి నమ్మేస్తున్నాను. అన్నట్లు చెప్పడం మర్చిపోయాను. మధు పేరెంట్స్ మిమ్మల్ని చాలా పొగిడేస్తున్నారు" చెప్పింది.

"నిజంగానా! వెరీనైస్ ఆఫ్ దెమ్" ఆనంద పడిపోయాడు.

మెనూకార్డ్ చూస్తూ వాళ్ళకేం కావాలో అడుగుదామని 'మధూ' అని పిలిచింది మాధవి. మాట్లాడుకుంటున్న ఇద్దరూ 'ఏమిటి?' అంటూ ఏకకంఠంతో సమా ధానం ఇచ్చేసరికి తెల్లబోయింది. "ఓ ఇదో కన్ఫ్యూజన్. ఇద్దరూ మధులే" అంది నవ్వేస్తూ.

"ఇద్దరేమిటి నా మొహం ముగ్గురం మధూలమే" అంది మాధురి.

ఆమధ్య ఒక జోక్ చదివాను. రావ్ అండ్ రావ్ కంపెనీకి ఫోన్ చేసి రావుగా రున్నారా? అని అడిగాడుట ఒకతను. లేరు. రావుగారికోసం వెళ్లారు అని సమా ధానం చెప్పాడుట. మీరెవరు మాట్లాడుతు న్నారు అంటే నేను రావుని మాట్లాడుతు న్నాను అన్నాడుట" అన్నాడు మధు. శ్రోతలు నవ్వేశారు.

తర్వాత కూడా నవ్వుతో సరదాగా గడిచి పోయింది టైం. పదిన్నరకి బయటికి వచ్చారు.

"సో మధు అండ్ మధూ. మీ జంట చూడముచ్చటగా వున్నారు. ఐయాం వెరీ హేపీ!" అంది మాధురి.

"థాంక్స్ మధు. మీరు అప్పుడే అంతా నిర్ణయం అయిపోయినట్లు ఆనందపడుతు న్నారు. కానీ మేము ఇంకా ఏమీ డిసైడ్ చేసుకోలేదు. వుయ్‌వాంట్ సమ్ మోర్ టైమ్" క్రీగంట మాధవి వంక చూస్తూ సమాధానం చెప్పాడు మధు.

"ఇది మరీ బావుంది. మీ నిర్ణయంతో నాకేం సంబంధం? నా అభిప్రాయం నేను చెప్పేశాను" అంది మాధురి.

"పదండి మీ ఇద్దర్నీ డ్రాప్ చేస్తాను" అంది.

"నాకు బైక్ వుంది కదా! మీరు వెళ్ళండి" అన్నాడు మధు.

"అవునుకదూ. అయితే ఓ పని చెయ్యండి. మధు ఇల్లు నాకంటే మీకు దగ్గ రకదా! మీరు దాన్ని డ్రాప్ చెయ్యండి. నేను వెళ్ళిపోతాను"

"సరే నీఇష్టం" అనేసింది మాధవి. గుడ్ నైట్ చెప్పి వెళ్ళిపోయింది మాధురి.

"మనం కూడా వెళ్దామా? " వినయంగా అడిగాడు.

"పదండి"

బైక్ తీసుకొచ్చి మాధవి పక్కన నిలబె ట్టాడు. "నాకు బైక్ మీద కూర్చోవడం కొత్త" అంది మాధవి ముందుజాగ్రత్తగా.

"మరేం ఫర్వాలేదు మెల్లిగా డ్రైవ్ చేస్తాను. మీరు దుపట్టా జాగర్తగా చూసు కోండి. మరీ భయంవేస్తే నన్ను పట్టుకో వచ్చు. నేను తప్పుగా భావించను" బుద్ధిగా చెప్పాడు.

అలానే అంటూ దుపట్టా రెండు కొసలూ ముడివేసి బైక్‌మీద కూర్చుంది. అతని భుజంమీద చెయ్యివేసింది "ఇక పదండి" అని చెప్పింది.

పావుగంటకి చేరవలసినదల్లా మరో పది కిలోమీటర్లు అదనంగా అటూఇటూ తిప్పి నలభై నిముషాలతర్వాత ఇంటిదగ్గర దింపాడు.

బైక్‌మీంచి దిగి నడుము సర్దుకుంది మాధవి.

"కార్లో వస్తే పది నిముషాల్లో వచ్చేస్తాం కదా. ఇంతసేపు పట్టిందేమండీ బైక్ మీద? " అడిగింది.

"ఏమోనండీ మరి? అప్పటికీ మీకు ఆలస్యం అయిపోతోందని షార్ట్‌కట్‌లోనే తీసుకొచ్చాను" బుద్ధిగా చెప్పాడు.

"నిజమా పాపం. ఎందుకండీ అంత శ్రమపడ్డారు? మామూలు రూట్‌లోనే తీసుకురావలసింది. త్వరగా వచ్చేవాళ్ళం. రైలు స్టేషన్లో దొరికిన ప్రయాణికుడిని తిప్పే ఆటోవాడిలాగా నన్ను ఊరంతా తిప్పింది చాలక షార్ట్‌కట్‌లో వచ్చారట. షార్ట్ కట్టు..."

"అది కాదండీ బైక్‌మీద కూర్చోడం కొత్త అన్నారుకదా. కాసేపు తిప్పితే అలవాటు అవుతుందని ఇలా చేశాను"

"అలాగా. పాపం పరోపకారి పాపన్నలాంటివారు మీరు. ఎనీవే థాంక్స్ ఫర్ ద లిఫ్ట్. ఇక దయచేస్తారా? "

బరువుగా నిట్టూర్చాడు మధు. "దయచె య్యక తప్పుతుందా? వెళ్ళొస్తాను. పునర్ద ర్శనం ఎప్పుడో శలవిస్తారా? "

"నేను ఫోన్ చేస్తాను. వెళ్ళిరండి గుడ్ నైట్" అని చెప్పి లోపలికి పారిపోయింది.

భానుప్రతాప్, భవానీ మేలుకునే వున్నారు. "ఇంకా పడుకోలేదా డాడీ? "

"లేదమ్మా. నీకోసమే వెయిట్ చేస్తున్నాం" అన్నాడాయన. డ్రెస్ మార్చు కుని వచ్చి కూర్చుంది. "చెప్పండి డాడీ" అంది.

"అదేనమ్మా ఎలాగూ శలవులో వచ్చాను. అన్నీ కుదిరితే నీ పెళ్ళి చేసేద్దామని నా ఆలోచన. మరి నీకిప్పుడు శలవు దొరుకు తుందా? " అడిగాడు.

"శలవుకి పెద్ద ప్రాబ్లం వుండదులెండి. అయినా ఇప్పుడు పెళ్ళా? "

"ఇంకెందుకు బేబీ ఆలస్యం? శుభస్య శీఘ్రం అన్నారు. అయినా అకారణంగా వాయిదావెయ్యడం మాత్రం ఎందుకు? " అంది భవాని.

"సరే మమ్మీ మీ ఇష్టం. పెళ్ళి వీలైనంత సింపుల్‌గానే చెయ్యండి"

"ఆ మాట మేం ఎలా చెప్తాం బేబీ. వాళ్ళకీ ఒక్కడే కొడుకు. అచ్చటా ముచ్చటా వుండవా? పెళ్ళి విషయంలో నిర్ణయం వారిదే. వారి ఇష్టప్రకారం చెయ్యడం మన సాంప్రదాయం" అందావిడ.




"సరే మమ్మీ ఆ సాంప్రదాయాలూ, సింగి నాదాలూ మీరు చూసుకోండి. అంతా డిసైడ్ చేసి ప్రోగ్రాం ఏమిటో నాకు చెప్తే దానిప్రకారం నేను ప్లాన్ చేసుకుంటాను" అనేసింది మాధవి.

ఇక ఆ తర్వాత దంపతులు ఇద్దరూ సుదీర్ఘాలోచనలో మునిగిపోయారు. తాము అబ్బాయిని చూశారుగానీ వాళ్ళు అమ్మాయిని చూడలేదు. ఇప్పుడు రమ్మంటే బాగుంటుందా? అలా అని అసలు ఆ ప్రసక్తే ఎత్తకుండా వుంటే వాళ్ళు మనసు కష్టపెట్టుకుంటారేమో? సంబంధం కలుపుకోవాలనుకున్నప్పుడు సామరస్యంగా మెలగాలి. ఎలా? ఏం చెయ్యాలి? అందులోనూ ఉద్యోగరీత్యా దూరాన వుండిపోవడాన పద్ధతులన్నీ ఏనాడో మర్చిపోయారు. కాసేపు తర్జనభర్జన పడి విజయవాడలో వున్న అన్నగారికి ఫోన్ చేశాడు భానుప్రతాప్.

విషయం అంతా వివరించాడు. ముందు ఆయన చివాట్లేశాడు. అంత ఉద్యోగం చేసే పిల్లకి నిరుద్యోగి సంబంధం ఏమిటని వాపోయాడు. దానివల్ల వచ్చే కష్టనష్టాలు ఏకరువుపెట్టాడు. తను చెప్పదల్చుకున్నది ఓర్పుగా చెప్పాడు భానుప్రతాప్.

"సరేలే ఈ విషయంలో ఇంతకంటే నువ్వుమాత్రం ఏం చేస్తావు? అన్నిటికీ ఆ భగవంతుడే వున్నాడు. ఇంతకీ ఇప్పుడు ఏమిటి నీ సమస్య?" అని అడిగి తెలుసుకున్నాడు.

"ఒక పని చెయ్యి. రేపు పొద్దున్న ఫోన్ చేసి వారితో మాట్లాడు. వారిని హైదరాబాదు రమ్మను. అమ్మాయిని చూసినట్లూ వుంటుంది. మిగిలిన విషయాలూ మాట్లాడుకోవచ్చు అని చెప్పు. వాళ్ళు వస్తానంటే అక్కడే బస అదీ ఏర్పాటు చెయ్యి. మనకి తెలిసిన వాళ్ళు, బంధువులు బోలెడుమంది వున్నారు. ఎక్కడో ఒక దగ్గర ఏర్పాట్లు చేసి తాంబూలాలు పుచ్చుకొని ముహూర్తం పెట్టుకోవచ్చు.

"వారు హైదరాబాదు రాము అంటే గుంటూరు వెళ్ళి మాట్లాడదాం. ఇటు గుంటూరైనా అటు హైదరాబాదు అయినా నేనూ వస్తాను. వాళ్ళతో మాట్లాడి నాకు ఫోన్ చెయ్యి. నువ్వేం దిగులుపడకు. అన్నీ సవ్యంగా జరుగుతాయి. మీ వదినకి శుభకార్యాలు నిర్వహించడం నల్లేరుమీద బండి నడక" అని చెప్పాడు.

అన్నగారు ఆమాత్రం హామీ ఇచ్చాక కొండంత ధైర్యం వచ్చింది భానుప్రతాప్‌కి. నిశ్చింతగా నిద్రపోయాడు.

పొద్దున్న రాజశేఖరం గారికి ఫోన్ చేసి విషయం అంతా చెప్పాడు. మా ఆవిడతో సంప్రదించి మీకు మళ్ళీ ఫోన్ చేస్తాను అన్నాడు ఆయన. అంతా విని బరువుగా నిట్టూర్చింది భారతి.

"ముందుగా వారొచ్చి రమ్మనడం మనం అబ్బాయితో వెళ్ళి పెళ్ళిచూపులు చూడడం అంటే అదోతీరు. తీరా ఇప్పుడు అంతా నిశ్చయం అయ్యాక మనం చూసినా ఒకటే చూడకపోయినా ఒకటే. మనం వెళ్ళినా ఆవిడకి తీరిక వుంటుందో వుండదో. ఎందుకొచ్చిన గొడవ ఇదంతా వాళ్ళనే ఇక్కడికి రమ్మనండి" అనేసింది.

అమాట అట్లా చెప్పకుండా, 'నాకు తీరిక లేదు. మీరే ఇక్కడికి రండి' అని చెప్పాడు భానుప్రతాప్‌తో.

ఆ తర్వాత భార్యాభర్తలు ఇద్దరూ సమాలోచన మొదలుపెట్టారు. వాళ్ళు వచ్చేటైముకి ఎవర్ని పిలవాలి? రాజశేఖరం వైపు ఆయనే పెద్ద. భారతికి అన్నయ్య వున్నాడు. ఆయన్ని పిలవాలి.

"వద్దులెండి. మేనరికం చేసుకోలేదని మనసు కష్టపెట్టుకున్నాడు అన్నయ్య. అంతగా అయితే మీ బాబాయికి కబురుపెట్టండి" అంది.

"ఆయన సరే పాతకాలంవాడు. పైపెచ్చు చాదస్తం బాగా ఎక్కువైంది. ఆయనకిలా టివి నచ్చవు. వాళ్ళ ఎదురుగుండా ఏమైనా

అంటే బాగుండదు"

"అదీ నిజమే. పోనీ ఓ పని చెయ్యండి. మీ తమ్ముళ్ళిద్దరికీ రమ్మని చెప్పండి" అంది భారతి.

"పన్లోపనిగా మీ అన్నయ్యకీ చెప్తాను. ఇష్టమైతే వస్తాడు కష్టం అయితే మానే స్తాడు" అన్నాడు రాజశేఖరం. ఆ తర్వాత చేయవలసిన ఏర్పాట్ల గురించి మాట్లాడుకు న్నారు.

మంచిరోజు చూసి ఇంటి పురోహితుడిని వెంటబెట్టుకుని బయలుదేరారు ఆడపెళ్ళి వారు. భానుప్రతాప్, భవానీ, అన్నగారు, వదినగారు కావలసినవన్నీ తీసుకుని తెలి యపరచిన ప్రకారం మధ్యాహ్నం నాలుగు గంటలకి గుంటూరు చేరారు.

వీరి రాకకోసం ఎదురుచూస్తూ సిద్ధంగా వున్నారు మగపెళ్లివారు రాజశేఖరం, భారతి, ఆయన తమ్ముళ్ళు హరి, రాము వారివైపు పురోహితుడు. వంటమనిషిని పెట్టి కాఫీ, ఫలహారాలు సిద్ధం చేయించింది భారతి.

పెళ్ళివారు రాగానే ఆదరంగా ఆహ్వానిం చారు. కాఫీ, ఫలహారాలు అందించారు. ఆ మర్యాదలు చూసి ఆనందించారు ఆడపెళ్ళి వారు.

"మా తమ్ముడు శలవుపెట్టి వచ్చాడు. ఇదెలాగూ పెళ్ళిళ్ళ సీజను. వెంటనే పెళ్ళి చేసేస్తే అన్నివిధాలా బాగుంటుందేమో అనుకుంటున్నాం" అన్నాడు అన్నయ్య.

"పెళ్ళి వెంటనే జరిగితే మాకూ అనుకూ లంగానే వుంటుంది. మా అమ్మాయి ప్రెగ్నెంట్. డెలివరీ అక్కడే చేయిస్తారుట. మా ఆవిడకి త్వరలో అమెరికా ప్రయాణం వుంది. ఈలోగా అబ్బాయి పెళ్లి చేసే ఆలో చనలో వున్నాం" అన్నాడు అబ్బాయితండ్రి.

"మరికనేం. వైద్యుడూ పాలే కోరాడు రోగీ పాలే కోరాడు" అన్నాడు అన్నయ్య.

"మంచి ముహూర్తం చూడమందామా? " అన్నారు అబ్బాయి బాబాయిలు.

"అలాగే. ఈలోగా ఒక్కమాట ఇచ్చిపుచ్చు కోవడాల గురించి మాట్లాడుకుంటే" అన్నాడు అమ్మాయి పెత్తండ్రి.

ఇబ్బందిగా కదిలాడు రాజశేఖరం. "అబ్బే మాకేం వద్దండీ" అనేశాడు.

"అలా అనకండి. ఏదో ఇదో వేడుక. అంతేగానీ మీకు లేదనీకాదు. మేం ఇచ్చేది మీకు అవసరం అనీకాదు. ఏదో మీరోమాట చెప్తే బావుంటుంది" అన్నారు పెత్తండ్రి.

"వద్దండీ. మా అబ్బాయికి కట్నం తీసు కోవాలని మేం ఎప్పుడూ అనుకోలేదు. మా అమ్మాయికీ ఇవ్వలేదు. పెళ్ళి బాగా చెయ్యి మన్నారు. చేశాం. ఏవో మాకు తోచిన లాంఛనాలు జరిపాం" అన్నాడు రాజశే ఖరం.

"మేమూ పది శుభకార్యాలు చేసినవా ళ్ళమే. మీకేలోటూ రానివ్వం. ఇక పెళ్ళి కూడా ఘనంగా చేస్తాం. మా తమ్ముడికి ఇద్దరు కూతుళ్ళు. పెద్దదాని పెళ్ళి, వాళ్ళూ అక్కడివాళ్ళు కావడంతో అక్కడే చేసేశాం. ఇది రెండోది, ఆఖరిదీను. దీని పెళ్ళి ఘనంగా చెయ్యాలని మాకూ ఆశగా వుంది" అన్నాడు పెత్తండ్రి.

"మరి అన్నీ తెలిసినవారు. మీకు చెప్పేది ఏముంటుంది? " అనేశాడు రాజశేఖరం. అంతటితో ఆ సంభాషణ ముగిసింది.

పురోహితులు ఇద్దరూ పంచాంగాలు తీసి వధూవరుల జాతకాలు ముందు పెట్టుకుని దివ్యమైన ముహూర్తం నిర్ణయించారు. తెల్లకాగితానికి పసుపురాసి ముహూర్తం రాశారు.

తాము తెచ్చిన పళ్ళూ వగైరాలు పళ్ళే లలో సర్దుకున్నారు ఆడపెళ్ళివారు. ఇంట్లోంచి మగపెళ్ళివారి పళ్ళాలు వచ్చాయి. మంత్రఘోష మధ్య తాంబూ లాలు మార్చుకున్నారు.

జరగవలసిన కార్యక్రమం యధావిధిగా ముగించి బాతాఖానీ మొదలుపెట్టారు మగ వారు. లోపలి గదిలో బిఛాణా వేశారు ఆడ

వాళ్ళు వంటమనిషికి వంట పురమాయించి వచ్చి కూర్చుంది భారతి.

"మరి పెళ్ళికూతురికి నగల విషయం ఏ చేద్దాం? మేం కోడలికి పది సవరలు పెడదాం అనుకున్నాం. ఆ అమ్మాయికి ఏం కావాలో చూసి మీరు చేయిస్తారా? " కాబోయే వియ్యపురాలిని అడిగింది.

"మాధవికి నగలంటే పెద్దగా ఇంట్రస్ట్ లేదు. నేనే పూనుకుని నగలు చేయించాను. అవన్నీ నా దగ్గరే లాకర్లో వున్నాయి. మీ కోడలికి ఏం కావాలనుకుంటున్నారో మీరే కొనండి" అంది భవాని తోటికోడలు.

"మరి చీరెలు? మేం నాలుగు చీరెలు పెట్టాలి కోడలికి. మాధవికి నచ్చినవి తను కొనుక్కుంటుందా? " మరో ప్రశ్నవేసింది.

"ఏవో డ్రస్సులు కొంటుంది తప్ప చీరెల సెలక్షన్ దానికంతగా తెలియదు"

"ఒక పని చేద్దాం. మీరు వీలు చూసుకుని బెజవాడ రండి. అందరం కలిసే షాపింగ్ చేద్దాం" అంది భవాని.

ఆ ఆలోచన అందరికీ నచ్చింది. తనివి తీరా కబుర్లు చెప్పుకుని విందు భోజనం చేసి తిరుగుముఖం అయ్యారు ఆడపెళ్ళివారు.

★ ★ ★

అదే సమయానికి మాధవి, మధు బిర్లా మందిర్ దగ్గరికి చేరారు. ఆ సాయంత్రం మాధవి ఫోన్ చేసి ఫలాన దగ్గర వెయిట్ చెయ్యమని చెప్పింది. చెప్పిన సమయానికే వచ్చి అతడిని పికప్ చేసుకుంది.

ఇద్దరూ కలిసి ఇల్లు చూడడానికి వెళ్ళారు. ఏజెంట్ వచ్చి రెండు ఇళ్ళు చూపించాడు. రెండూ చాలా బావున్నాయి. ఏది సెలక్ట్ చేసుకోవాలి అని ఆలోచించి చివరకు ఒకటి ఎంచుకున్నారు. ఆ తర్వాత కార్ల షోరూమ్‌కి వెళ్లారు. అన్ని కలర్స్ చూసి చివరకి వైట్ కలర్ బాగుంటుందని నిర్ణయించుకున్నారు. అక్కడినుంచి హోటల్‌కి వెళ్లి టిఫెన్ తిని, బిర్లామందిర్‌కి వెళ్ళారు.

దేవుడికి దణ్ణం పెట్టుకుని కిందికి వచ్చారు. టాంక్‌బండ్‌మీద నడక సాగించారు. "గుంటూర్లో మా ఇంట్లో బహుశా చాలా సందడిగా వుండి వుంటుంది" అన్నాడు మధు.

"అవును. అక్కడ జేరినవాళ్ళంతా హేమాహేమీలు. అందరికందరూ కబుర్లపుట్టలు కాబట్టి హడావిడిగా మాట్లాడేసుకుంటూ వుంటారు. మా డాడీకి ఒకపట్టాన ఎవరూ నచ్చరు. నచ్చితేమాత్రం బ్రహ్మాండంగా నచ్చుతారు. మీ ఫాదర్ ఆయనకి బాగా నచ్చారు" అంది మాధవి.

"మా నాన్నగారూ డిటో. ఆయనకీ మీ డాడీ బాగా నచ్చారు" చెప్పాడు.

"మధూ! ఒక తమాషా గమనించారా? మామూలుగా పెళ్ళిచూపులు అయితే పెళ్ళికూతురు నచ్చాక మిగిలిన విషయాలు ఆలోచిస్తారు.

అత్తగారు గడుసుదనో, మామగారు కాలాంతకుడనో వంకలు పెడతారు. మన విషయం అందుకు పూర్తివిరుద్ధం. మా మమ్మీ ఏమందో తెలుసా? వాళ్ళు చాలా మంచివాళ్లు. అబ్బాయి కూడా బుద్ధిమంతుడు. అటువంటి ఇంటికి పొందికగా అణకువగా వున్న అమ్మాయి అయితే బాగుంటుంది" అంది.

నవ్వేశాడు మధు. "మా ఇంట్లోనూ డిటో. వాళ్ళ పద్ధతులు వేరు. అంతా బాగా చదువుకుని పెద్ద ఉద్యోగాలు చేస్తున్నవాళ్ళే. వాళ్లకి ఏ ఐఏఎస్ వాడో అల్లుడయితే దర్జాగా వుండేది అన్నారు మా నాన్నగారు"

కాసేపు సీరియస్‌గా ఆలోచించింది మాధవి. "మన లైఫ్ ఎలా వుంటుందంటారు? " అడిగింది.

"బాగానే వుంటుందనుకుంటున్నాను" సమాధానం చెప్పాడు.

మాధవికి కోపం వచ్చింది. "బాగానే వుంటుందా? అలా వీల్లేదు. బ్రహ్మాండంగా

వుండాలి. అద్భుతంగా వుండాలి"

శాంతంగా నవ్వేశాడు మధు. "ఓ.కే. మీరంత సీరియస్‌గా చెప్తుంటే నేను కాదంటానా? అద్భుతంగానే వుంటుంది. అలా వుండేలా మలుచుకుందాం. ఇప్పుడు మనకు సలహాలు చెప్తున్న అందరూ తమ తప్పు తెలుసుకుని ఆనందించేలా వుందాం. సరేనా? "

"ప్రామిస్" చెయ్యి జాచింది.

"ప్రామిస్" అంటూ ఆ చేతిలో చెయ్యివేసి సున్నితంగా నొక్కాడు మధు.



ముహూర్తం నిర్ణయం అయిందని ఫోన్‌ద్వారా తెలియగానే మధుతో అరగంట మాట్లాడింది మాధవి. హనీమూన్ ఎక్కడికి వెళ్ళాలి? దేశం విడిచి వెళ్ళాలంటే మధుకి పాస్‌పోర్ట్ లేదు. కాబట్టి ఇక్కడే ఎక్కడికైనా వెళ్ళాలి. కాసేపు ఆలోచించి కులూమనాలీ గానీ, కొడైకెనాల్ గానీ వెళ్దామనుకున్నారు. కులూ దూరం. జర్నీలకే చాలా టైం పడుతుంది కాబట్టి కొడై వెళ్దామని నిర్ణయించుకున్నారు.

మాధవి పెళ్ళి విషయం ఆఫీస్‌లో అందరికీ తెలిసిపోయింది. అందరూ అభినందించి వివరాలు అడిగారు. వరుడు కూడా ఏదో మల్టీనేషనల్ కంపెనీలో పనిచేస్తూ వుంటాడు అనుకున్నవారు మధు వివరాలు విని ఆశ్చర్యపోయారు. ఆ ఆశ్చర్యం దాచుకుని అభినందించినా చాటున నవ్వుకున్నారు. ఎవరి పిచ్చి వారికి ఆనందం అనుకున్నారు. బాస్ కూడా ముందు తెల్లబోయినా తర్వాత సర్దుకుని మాధవికి కంగ్రాట్స్ చెప్పాడు. ఎన్నాళ్ళు లీవ్ కావాలో అడిగి తెలుసుకున్నాడు. ఏమైనా సహాయం కావాలంటే తెలియచేయమన్నాడు. ఏమాత్రం వీలున్నా పెళ్ళికి వస్తానని మాట ఇచ్చాడు.

అంతేకాదు. ఛెయిర్మెన్‌తో మాట్లాడి మాధవి వంటి బ్రిలియెంట్ ఉద్యోగికి తగిన కానుక వివాహ సందర్భంలో అందజేశాడు. ఆ కానుక ఏమిటంటే ఇంట్లో బయలుదేరిన దగ్గరనుండి తిరిగి ఇంటికి జేరేలా హనీమూన్ పేకేజ్.

మధు తన ఫ్రెండ్స్ అందరికీ తన పెళ్ళి వార్త చెప్పాడు. "కంగ్రాట్స్‌రా మధూ. ఎవరా అదృష్టవంతురాలు" అంటూ అడిగి తెలుసుకుని తెల్లబోయారు. సభ్యతను మరచి ఎన్నో ప్రశ్నలడిగారు. ఎన్నో సలహాలు ఇచ్చారు. అన్నింటికీ మధు చిరునవ్వే సమాధానం అయింది.

ఊరందరిదీ ఓ దారి ఉలిపికట్టెది ఇంకో దారి అన్నట్లు అలవాటుకి విరుద్ధంగా జీవితం గడపాలని నిర్ణయించుకుని వివాహం చేసుకుంటున్న ఈ జంట వైవాహిక జీవితం ఎలా వుంటుందో చూడాలనే కుతూహలంతో వీళ్ళ పెళ్ళికోసం అందరూ ఎదురు చూడసాగారు.

అందరూ ఎదురుచూస్తున్న ఆ శుభఘడియ రానేవచ్చింది. విజయవాడలో మాధవి, మధుసూదన్‌ల వివాహం వైభవంగా జరిగింది. పెళ్ళికూతురు ఉన్నతోద్యోగి. పెళ్ళికొడుకు నిరుద్యోగి. ఆ జంట ఎలా వుంటుందో చూడాలని జనం చాలా మందే వచ్చారు.

జంట కన్నులపండువగా వున్నారు. వివాహం యధావిధిగా జరిగింది. ఇంకె లాగో వుంటుందనుకుని వెళ్ళినవారికి కాస్తంత ఆశాభంగమే కలిగింది. పెళ్ళికూ తురు సిగ్గుతో మెలికలు తిరిగిపోలేదు. అలా అని ఫెళ్ళుఫెళ్ళున నవ్వుతూ జోకులూ వెయ్యలేదు. పెళ్ళికొడుకు దర్జాగా వున్నాడు. తన ఫ్రెండ్స్‌కి భార్యని సగర్వంగా పరి చయం చేశాడు. పెళ్ళికూతురూ తన ఫ్రెండ్స్‌కి భర్తను పరిచయం చేసి బోలె డంత సంబరపడిపోయింది.

ఇచ్చి పుచ్చుకోవడాల విషయంలో ఏ విధ మైన మాట పట్టింపులూ రాలేదు. మర్యాద లకు లోటు జరగలేదు. మొత్తానికి సర దాగా సంబరంగా జరిగిపోయిన వివాహం చూసి కాస్తంత ఇబ్బంది పడ్డారు, కుతూహ లంతో వచ్చినవారు. అంతలోనే సరేలే ఇల్ల లకగానే పండగ అయిందా. కాపురం పెట్టాక అప్పుడు తెలుస్తుంది అసలు విషయం అనుకుని తృప్తిపడ్డారు.

పెళ్ళి సంబరాలన్నీ యధావిధిగా ముగి శాయి. వధూవరులు కనకదుర్గమ్మ దర్శనం చేసుకువచ్చారు. గుంటూరులో గృహప్ర వేశం, సత్యనారాయణవ్రతం జరిగాయి. ఆ సాయంత్రం బయలుదేరారు నూతన దంప తులు. వారివెంట రాజశేఖరం, భారతి, భానుప్రతాప్, భవాని అందరూ తిన్నగా తిరుపతి వెళ్లారు. అక్కడినుంచి రాజశేఖరం దంపతులు, వారి కొడుకు, కోడలు మెడ్రాస్ వెళ్లారు. రాజశేఖరం దంపతులకు అమెరి కన్ కాన్సొలేట్ పని వుంది. వీసాలు తెచ్చు కోవాలి. మధు, మాధవి మెడ్రాస్ నుండి కొడైకెనాల్ వెళ్లారు. అదీ ప్రోగ్రాం.

కొత్తకోడలికి బొట్టుపెట్టి కొత్తచీరె పెట్టింది భారతి. తర్వాత వియ్యంకుడికి, వియ్యపురాలికీ బట్టలు పెట్టారు. అందరూ కారెక్కి బయలుదేరారు.

★ ★ ★

కారు రివ్వున సాగిపోతోంది. చలిగాలి కొడుతూవుంటే అద్దాలు పైకెత్తారు. మరో అరగంటలో కొడై చేరిపోతాం అన్నాడు డ్రైవర్. అప్పటికే చీకటి పడుతోంది.

"ఇక లాభంలేదు మధూ" అంటూ భార్యని ఒళ్ళోకి జేర్చుకున్నాడు మధు. మెడ్రాస్‌లో బయలుదేరగానే భర్తకు అంటి పెట్టుకుని కూర్చుంది మాధవి. భార్య చుట్టూ చెయ్యివేసుకుని దగ్గరకు తీసుకుని కబుర్లు చెప్పడం మొదలుపెట్టాడు మధు. కాస్త కదిలినా ఘల్లుఘల్లుమంటూ శబ్దం చేస్తున్న గాజులవంక విసుగ్గా చూసింది మాధవి.

"అబ్బ ఎన్ని గాజులు వేశారో చేతుల నిండా. గాజుల మలారంలా లేదూ చెయ్యి" అంది విసుగ్గా.

గోరింటతో పండిన అరిచేతులని అపురూ పంగా ముద్దుపెట్టుకున్నాడు. "ఎంత ముద్దుగా వున్నాయో నీ చేతులు. పెళ్ళిలో తెరచాటునుండి కొబ్బరిబొండాం పట్టుకుని కూర్చున్నావు గుర్తుందా. అప్పుడు కన్నార్ప కుండా నీ చేతులవంకే చూస్తూ కూర్చు న్నాను. ఎంత అందంగా వుందో ఆ దృశ్యం. కవిని అయిఉంటే కనీసం డజను కవితలు రాసేవాడిని"

"పోన్లే కవివి కాలేదేమో బతికిపోయాను. లేకపోతే నీ దారిన నువ్వు కవితలు రాసు కుంటూ వుంటే నా మెళ్ళో మంగళసూత్రం ఎవరు కడతారూ? తలంబ్రాలు ఎవరు పోస్తారూ? " అంది మాధవి.

ఫక్కున నవ్వేశాడు. "మాటల పుట్ట" అంటూ బుగ్గ మెలేశాడు. బదులు తీర్చు కుంది మాధవి. మళ్ళీ గాజులు ఘల్లుమ న్నాయి. ముందుసీట్లోని డ్రైవరు సీట్లో కది లాడు. అది గమనించిన మధు కాస్త ఇబ్బందిగా ఫీలయ్యాడు.

అందంగా వున్న మాట నిజమే. కానీ ఇబ్బందిగా వుంది. అందుకే భార్య చేతులకి టాల్కమ్ పౌడర్ రాసి గాజులు చిట్లకుండా పొందికగా చేతులనుండి తీసి నేప్‌కిన్‌లో



చుట్టి బాగ్‌లో భద్రపరిచాడు. వెంటనే హేండ్‌బాగ్‌లోంచి వాచీతీసి ఎడమచేతికి పెట్టుకుంది. అంత శ్రమపడిన భర్తకు చిన్న బహుమానం ఇచ్చేసింది. కుడిచేతిని వున్న బంగారంగాజులు గుంభనంగా వుండి పోయాయి. "పన్లోపని ఈ మెడ విషయం కూడా కాస్త చూద్దూ నీకు పుణ్యం వుంటుంది" బతిమాలింది.

మాధవి మెడవంక దృష్టి సారించాడు మధు. మంగళసూత్రాల పసుపుతాడు కొత్త గొలుసులతో మెలికపడి చిక్కుపడిపో యింది. ఇంటి దగ్గర వియ్యపురాళ్ళిద్దరూ కుస్తీపట్టి విడదీయలేక వూరుకున్నారు. కాని వ్వండి పదహార్రోజుల పండగనాడు ఎలాగూ గొలుసులోకి మారుస్తాం కదా మంగళసూత్రాలు. అప్పటిదాకా ఎలాగో మేనేజ్ చెయ్యి అన్నారు.

మెళ్ళో కొత్త మంగళసూత్రం చెయిన్, నల్లపూసలు, మరో గొలుసు. ఇవన్నీ వేసు కునేసరికి అలవాటులేని మాధవికి చిరాగ్గా వుంది. తాళికట్టిన భర్త ఆ మాత్రం సాయంచేయకపోతాడా అని అడిగింది.

నేనున్నదే నీకు సాయం చెయ్యడానికి అన్నట్లు వెంటనే ఆ పనికి పూనుకున్నాడు. కానీ ఆ పని అంత సులభం కాదని తేలి పోయింది. భయంకరంగా చిక్కులు పడిపో యాయి. నిస్సహాయంగా చూశాడు. "పెళ్ళి చేసుకోకురా! బోలెడన్ని చిక్కు సమస్యలు అన్నాడు మా ఫ్రెండ్. అప్పుడు తేలిగ్గా తీసుకున్నాను. నాకేం తెలుసు ఇలాటి చిక్కు సమస్యలు వుంటాయని? "

"చాల్లే గొప్ప. ఇలా కాంప్లికేటెడ్‌గా ఎవరు కట్టమన్నారు? " నిలదీసింది.

"నేను బాగానే కట్టాను. నువ్వే ఇలా చేసుకున్నావ్. వుండు తీస్తాను" అంటూ ట్రైచేశాడు. పక్కనించి వీలుకాక ఒళ్ళో పడుకోబెట్టుకుని అరగంట అవస్తపడి ఎలా అయితేనేం సాధించాడు. బంగారు గొలు సులు మెళ్ళోంచి తీసి భార్య చేతికిచ్చాడు. "ఆ పదహార్రోజుల పండగేదో అయేదాకా ఇలా వుండు" అన్నాడు.

"అమ్మయ్య ఇప్పుడు ప్రాణం హాయిగా వుంది" అని ఆనందపడిపోయింది మాధవి. భర్తకు కృతజ్ఞతలు తెలియజేసుకుంది.

ఇదంతా ముగిసేసరికి కొడైకెనాల్. చేరింది కారు. తిన్నగా హోటల్‌కే వెళ్ళారు. వీళ్ళకోసం హనీమూన్ జంటలకి ప్రత్యేకిం చిన సూట్ సిద్ధంగా వుంది. రూమ్‌లోకి వెళ్ళి స్నానాలు ముగించి కింద రెస్టారెం ట్‌కి వెళ్ళి భోజనం చేసివచ్చారు.

గదికి విశాలమైన బాల్కనీ వుంది. బాల్కనీలో పేము కుర్చీలు వేసి వున్నాయి. కనుచూపుమేర సుందర ప్రకృతి. పండు వెన్నెల. భుజాలమీద వున్న షాల్ సవరిం చుకుంది మధు. "అబ్బ ఎంత బాగుందో కదూ! రాత్రంతా ఇక్కడే కూర్చుని కబుర్లు చెప్పుకుందామనిపిస్తోంది నాకు" అంది పర వశంగా.

సూటిగా చూశాడు మధు. అది గమ నించి "ఏమిటది? ఏమిటలా అయిపో యావ్? " అడిగింది.

"ఇలా అయిపోక ఇంకెలా అయిపోమం టావ్. ఆవేళ అంటే అమ్మగారు అన్నీ తెములుచ్చుకుని పాలగ్లాసుతో గదిలోకి వచ్చేస రికి పన్నెండుదాటింది. తెల్లవారుజామునే లేవాలి. వ్రతం వుంది. అని అమ్మ అల్టిమే టమ్. దానికి తోడు కరెంటు పోయింది. అందుకని ఆవేళ బాల్కనీలో కూర్చుని రాత్రంతా కబుర్లు చెప్పాను. అంతమాత్రాన నన్ను అండర్ ఎస్టిమేట్ చేస్తావా? ఇలా బతుకంతా బాల్కనీలో కబుర్లు చెప్తూ కూర్చుంటే ఇక అయినట్లే"

అతని మనసులోని భావం పసిగట్టి తడ బడిపోయింది మాధవి. "అదికాదు మధూ" ఏదో చెప్పబోయింది.

ఆ అవకాశం ఇవ్వలేదు మధు. తుఫా నులా చుట్టేశాడు.

ఆ అనుభూతిని మనసారా ఆస్వాదిస్తూ భర్త తల నిమిరింది మాధవి.

"రాక్షసుడా!" అంది ముద్దుగా.

"థాంక్యూ... థాంక్యూ మేడమ్" అన్నాడు మధు అల్లరిగా.

వారం రోజులు గిర్రున తిరిగొచ్చాయి.

హోటల్ రిసెప్షనిస్ట్ తల చేత్తో పట్టు కుంది. మాధవికి ఫోన్ వచ్చింది. డోన్ట్ డిస్టర్బ్ సిగ్నల్ ఇచ్చింది మాధవి. రూమ్ బయటా అదే బోర్డు. అప్పటికి రెండుసార్లు అవతలివారికి మర్యాదగా సమాధానం చెప్పి మెసేజ్ ఏమైనా వుందా అని అడిగింది. అలా కాదు స్వయంగా మాట్లాడాలి అన్నారు అవతల్నించి, కాసేపు ఆగి ఫోన్ చెయ్యమని చెప్పింది.

మూడోసారి మళ్ళీ ఫోన్ వచ్చేసరికి మాధవి ఆజ్ఞను ఉల్లంఘించక తప్పలేదు. "సారీ మేడమ్, మీకోసం అర్జెంట్ ఫోన్" అంటూ పరిస్థితి వివరించింది.

విసుగ్గానే రిసీవ్ చేసుకుంది మాధవి. అవతల్నించి బాస్. ఏదో కొంపలంటుకు పోయే మీటింగ్ వుందిట. బాంటే వెళ్ళమని చెప్పాడు ఆయనతో మాట్లాడాక పరిస్థితి

వివరించింది మాధవి.

"ఛ... వెధవ జాబ్" అంది విసుగ్గా. "ఫర్వాలేదులే ఉద్యోగం అన్నాక ఇవన్నీ తప్పవుకదా! ఎలాగూ మనం రేపు బయలు దేరాలని ప్లాన్ వేసుకున్నాం కదా? " ఓదా ర్చాడు మధు.

"అవుననుకో. ఇద్దరం ఇంటికి వెళ్ళేవాళ్ళం కదా! నిన్నొదిలి వెళ్ళాలంటే విసుగ్గా వుంది మధూ. పోనీ నువ్వూ బాంబేరా! ఇద్దరం కలిసే వెళ్దాం" ఉపాయం చెప్పింది.

"రావడానికి నాకేం అభ్యంతరం లేదు. కానీ పగలంతా నువ్వు బిజీగా వుంటావ్. నా ఒక్కడికే బోరుకొడుతుంది. ఓ పని చేద్దాం నువ్వు బాంబే వెళ్ళు. నేను ఇంటికి వెళ్తాను. ఇల్లంతా సర్దేసి నీకోసం వెయిట్ చేస్తూ వుంటాను. పని పూర్తిచేసుకుని నువ్వు వచ్చేయ్" అన్నాడు.

ఆలోచిస్తే అదే మంచిదనిపించింది. "సరే అలాగే కానీ" అంది దిగులుగా. అది కనిపెట్టి ఉల్లాసం కలిగించేలా కబుర్లు చెప్పాడు మధు.

జీవితాంతం గుర్తుండిపోయే మధురాను భూతులను మనసునిండా నింపుకుని తిరు గుముఖం పట్టారు ఆ చిలకాగోరింకలు.

మెద్రాస్‌లో మాధవిని సీ ఆఫ్ చేసి రైల్లో గుంటూరు వెళ్ళాడు మధు.

కబురూ కాకరకాయా లేకుండా దిగిన కొడుకుని చూసి ఆశ్చర్యపోయింది భారతి.

"వంటరిగా వచ్చావేం? కోడలేదిరా? " అని అడిగింది.

"తను అర్జెంట్ పనిమీద బాంబే వెళ్ళిం దమ్మా!" చెప్పాడు.

బడలిక తీరేలా స్నానం చేసి లక్షణంగా పడుకుని తనివితీరా నిద్రపోయాడు. వాడి ఇష్టం వచ్చినంతసేపు పడుకోనీ అని ఎవరూ లేపలేదు.

నిద్రలేచాక వచ్చి తండ్రిదగ్గర కూర్చు న్నాడు. "ఏంరా? ఎలా వుంది లైఫ్? " దివి టీలా వెలిగిపోతున్న కొడుకు మొహం చూస్తుంటే స్పష్టంగా తెలిసిపోతూనే వుంది అతని లైఫ్ ఎలావుందో? అయినా అతని నోట విందామని అడిగాడు.

"బ్రహ్మాండంగా వుంది నాన్నగారూ!" చెప్పాడు. భారతి కూడా వచ్చి వాళ్ళ దగ్గిర కూర్చుంది. "ఏమ్మా పెళ్ళి బడలిక తీరిందా? "

"పెద్దగా అలసటేంకాలేదురా. ఎవరు కని పెట్టారోగానీ వాళ్ళ కడుపు చల్లగా ఈ కేట రింగ్‌లు వచ్చాక ప్రాణానికి సుఖంగా వుంది" అంది భారతి.

"ఇంతకీ నీ కోడలు ఎలా వుందమ్మా? నీకు నచ్చిందా? " కుతూహలంగా అడిగాడు.

"నా కోడలికేంరా? లక్షణంగా వుంది. మన ఫ్రెండ్స్ కూడా జంట చూడముచ్చ టగా వుందన్నారు. అంతా హడావిడిగా అయిపోయింది. కోడలు నాల్రోజులు ఇంట్లో వున్నట్లే లేదు. మళ్ళీ ఎప్పుడొ స్తుంది? వీలుచూసుకుని నాలుగురోజులు నా దగ్గర వుండేలా పంపించు. మరి మనకు శ్రావణమాసం నోములు వున్నాయి. వాళ్ళ అమ్మా వాళ్ళు దూరాన వున్నారు కాబట్టి నేనే పట్టించాలనుకున్నా. కానీ నేనూ వెళ్ళిపోతున్నాను. ఈ ఏడాది కాక పోతే వచ్చేఏడు పనికిరాదు. మళ్ళీ మూడో ఏడాదిదాకా ఆగాలి. అప్పటికి పిల్లాజెల్లా. పోనీ ఓ పని చేద్దామా? పెద్ద పిన్నికో, చిన్న పిన్నికో చెప్పి వెళ్తాను. వాళ్ళు నోము పట్టిస్తారు"

భార్య ధోరణికి విసుగేసింది రాజశేఖరా నికి.

"ఏమిటి నీ చాదస్తం నువ్వూను! ఆ అమ్మాయి ఉద్యోగం చేసుకునే మనిషి. నీ నోములకీ వ్రతాలకీ కోడలికి శెలవలు దొర కద్దూ. అమ్మాయి విషయంలోనూ ఇలాగే ఆరాటపడ్డావు. రోజులు మారాయి. దాంతో మనమూ మారాలి. ఇక ఇవన్నీ వదిలెయ్"

ఆవిడ చిన్నబుచ్చుకుంది. "నిజమేలెండి. ఏదో నాముచ్చటకోసం సరదాపడ్డాను.



అవన్నీ ఎలా జరుగుతాయి?" అంది నీరసంగా.

తల్లిని చూసి జాలివేసింది మధుకి. "నువ్వలా నీరసపడిపోకు. ఏదైనా మార్గం వుందేమో ఆలోచిద్దాం" అన్నాడు.

"మాధవి ట్రిప్ ఎన్నాళ్ళురా?" మాట మార్చాడు రాజశేఖరం.

"నాలుగైదురోజులు పడుతుందిట నాన్నగారూ! నేను ఇవ్వాళే బయలుదేరి వెళ్తాను. మీకు వేరే పన్లులేకపోతే మీ ఇద్దరూ నాతో రండి. అమ్మతోడుగా వుంటే నాకు చాలా అండగా వుంటుంది. ఫర్నిచర్ అంతా అపుడే ఆర్డర్ ఇచ్చేశాం. వెళ్ళి డెలివరీ తీసుకోవడమే. అందరం వెళ్తే మాధవి వచ్చేసరికి ఇల్లు రెడీగా వుంటుంది" అన్నాడు.

మొహమొహాలు చూసుకున్నారు భార్యాభర్తలు. "అమ్మని తీసుకువెళ్ళు" అన్నాడాయన.

"కాదు మీరూ రండి" అని బలవంతం చేసి ఒప్పించాడు. టికెట్లు తీసుకువస్తాను అని వెళ్ళిపోయాడు.

"ఇదేం విచిత్రం? ఆడపిల్లతల్లి ఆవిడ వచ్చి కాపురం పెట్టించాలిగానీ, మగపిల్లవాడితల్లిని నేను వెళ్లడం ఏమిటి? అత్తగార్ని నేను వెళ్ళి అన్నీ అమరిస్తే అపుడు కోడలుగారు వస్తుందా? అన్యాయంగా వుంది వీడి ధోరణి. వాడికి కొత్త పెళ్ళాం మోజులో ఒళ్లూపై తెలియడంలేదు. పక్కనున్నవారు మీరైనా చెప్పొద్దూ! నేను చచ్చినా వెళ్ళను. గుండెల్లో నెప్పి అని వంకపెట్టి పడుకుంటాను. అమ్మకీమధ్య ఇలాగే వస్తోంది అని మీరూ హడావిడి చెయ్యండి. ప్రయాణం బెడద తప్పుతుంది" అంది భారతి.

ఫక్కున నవ్వాడు రాజశేఖరం.

"పిచ్చిమొహానివి నువ్వు. వాడన్నదాంట్లో తప్పు ఏముంది. ఆ ఆచారాలూ అవీ ఇప్పుడెక్కడ సాగుతున్నాయి. ఆ మాటకొస్తే నువ్వు అమెరికా వెళ్ళి కాపురానికి అన్నీ అమర్చి వచ్చావా? మన అబ్బాయి మన సహాయం అడిగాడు. మనకు వెళ్ళే శక్తి వుంది. కాబట్టి వెళ్ళి వాడికి సాయం చెయ్యాలిగానీ ఏదో నెపం పెట్టి తప్పుకోడం ఏం మర్యాద చెప్పు! ఇటువంటి పిచ్చిపనులు చేసి బిడ్డలకు దూరం అవడం తప్పించి మనం మూటగట్టుకునేది ఏమీ వుండదు. కాబట్టి ఈ వెర్రి మొర్రి ఆలోచనలు కట్టిపెట్టి బట్టలు సర్దు" నచ్చచెప్పాడు.

"అదీ నిజమేలెండి. పెద్దవాళ్ళం. మనమే సర్దుకుపోవాలి" అనేసింది.

రాత్రి బస్‌లో ముగ్గురూ బయలుదేరి తెల్లవారుజామున హైదరాబాద్ చేరారు. తను వుండే రూమ్‌కి వెళ్ళి తాళాలు తీసుకుని కొత్తఇంటికి వెళ్ళారు. ఇల్లు చూసి సరదాపడిపోయింది భారతి. ఎంత బాగుందో అంది సంబరంగా.

రెండురోజులు చాలా హడావిడిగా గడిచిపోయాయి. ఫర్నిచర్ షాపు వాళ్ళు వచ్చి ఫర్నిచర్ అంతా అమర్చి వెళ్ళారు. "ఇవన్నీ మీ మామగారు ఇచ్చారట్రా?" అని అడిగింది. "లేదమ్మా మాధవే కొంది, ఇవే కాదు కారు కూడా కొనేసింది. తను రాగానే డెలివరీ తీసుకుంటాం!" అన్నాడు.

ఆశ్చర్యంతో బుగ్గలు నొక్కుకుంది భారతి. "చిన్నపిల్ల తన సంపాదనతో ఇంత ఖరీదైన వస్తువులు కొనుక్కుందా? ఎంత విచిత్రం. మా అమ్మ తన పెళ్ళయిన కొత్తల్లో ఒక చీరె కొనుక్కోవాలంటే కటకటలాడిపోయేదిట. మారోజుల్లో మేము నాలుగు స్టీలుగిన్నెలు అమర్చుకోవాలంటే పంచవర్షప్రణాలిక వేసుకునేవాళ్ళం. అలాటిది నిన్నమొన్నటి పిల్ల కొత్తకాపురానికి ఎన్నిసామాన్లు అమర్చుకుందో!"

"బాగుంది నువ్వు చెప్పేది. ఆ రోజులే వేరు ఇప్పటి రోజులే వేరు. కష్టపడి చదువుకుంది. పెద్ద ఉద్యోగం చేస్తోంది. కష్టపడుతోంది. ఫలం అనుభవిస్తోంది" అన్నాడు రాజశేఖరం.

కొడుకు బలవంతంమీద అన్యమన




స్కంగా వచ్చిన భారతికి ఈ ఇల్లు ఈ సామాన్లు చూశాక హుషారొచ్చేసింది. మహోత్సాహంతో కొడుకుతో కలిసి ఇల్లు సర్దేసింది.

"ఇవన్నీ మాకు ఐడియావుంది కాబట్టి మేము కొనేశాం. వంటిల్లు అమర్చే బాధ్యత మాత్రం నీదే" అంటూ భారం తల్లికి అప్ప గించాడు మధు.

తన అనుభవం అంతా ఉపయోగించి వంటిల్లు సర్దిపెట్టింది భారతి. కావలిసిన సామాన్లు అన్నీ కొంది. నెలరోజులకి సరి పడా సరుకులు లిస్టు రాసి తెప్పించి సర్దింది. "మరి వంట ఎట్లారా? వంటమని షిని పెట్టుకుంటారా? " అని అడిగింది.

"ఎందుకు దండగ? నేనే వంట చేస్తాను? " వెంటనే సమాధానం చెప్పాడు.

"నీకేం చాతవుతుందిరా? అయినా నీకు మాత్రం వీలవద్దూ. నువ్వు ఉద్యోగానికి వెళ్ళవా? " ఆశ్చర్యంగా అడిగింది.

"ఉద్యోగం వదిలేశాను. వంట విషయం అంటావా? నాల్రోజుల్లో నేర్చుకుంటాను. నువ్వు నేర్పు. అన్నీ డైరీలో రాసిపెట్టు. అది చూసి వంట చేస్తాను" అన్నాడు.

ఆవిడ మొహం చిన్నబోయింది. "అదే విట్రా మగపిల్లాడివి నువ్వు వంట చెయ్యటం ఏమిటి? మీకు స్తోమత వుంది కదా! వంటమనిషిని పెట్టుకోండి. చేస్తున్న ఉద్యోగం పూర్తిగా వదిలేస్తావా? ఏదో నీ సాదరు ఖర్చుకైనా వుంటుంది. ఉద్యోగం చెయ్యరాదుట్రా!" అంది దీనంగా.

తల్లి ఒళ్ళో తలపెట్టుకుని పడుకున్నాడు మధు. ఆదరంగా తల నిమిరింది భారతి. "అమ్మా నీకు నేనంటే ఎంత ఇష్టమో నాకు తెలుసమ్మా. అనుక్షణం నా సుఖసంతోషా లకోసం నువ్వెంత తాపత్రయపడతావో నా చిన్నతనంనుండి చూస్తూనేవున్నాను. నా గురించి నువ్వేం బాధపడకు. నేను సుఖంగా సంతోషంగా వుంటానని నీకు మాట ఇస్తున్నాను. సరేనా? " అన్నాడు.

"పిచ్చికన్నా! అంతకంటే నాకేం కావా లిరా!" తృప్తిపడింది తల్లి.

మరునాడు తిరుగు ప్రయాణం అయ్యారు భార్యాభర్తలు. "మధు రేపు వస్తోంది కదా! రేపటిదాకా వుండి వెళ్ళండి" అన్నాడు మధు.

"అర్జెంటు పనులున్నాయిరా మళ్ళీ వస్తాంలే!" అనేశారు రాజశేఖరం. అంతగా కొంపలంటుకుపోయే పనులేమీలేవు. కోడలొ చ్చేదాకా వుండి వెళ్ళొచ్చు. కానీ అలా వుండడం ఆయనకి ఇష్టంలేదు. కొత్తగా పెళ్ళయిన వాళ్ళు. కొత్తకాపురం. వాళ్ళమధ్య తమ ఉనికి అనవసరం. అందుకే అర్జంటు పని అని వంకపెట్టి బయలుదేరారు.

రైల్లో కూర్చోబెట్టి, కాలక్షేపానికి వీక్లీలు, మధ్యలో తినడానికి పళ్ళూ కొనుక్కుని తెచ్చాడు మధు. "చేరగానే ఫోన్ చెయ్యండి. నీ ప్రయాణం డేటు ఫిక్స్ అవగానే నాకు చెప్పమ్మా. నేను మెడ్రాస్ వస్తాను" అన్నాడు.

రైలు కదుల్తూవుండగా దిగిపోయి కిటికీ దగ్గరకు వచ్చి చెయ్యి అందించాడు. రైలు వేగం పుంజుకోవడంతో కొడుకు చెయ్యి వది లేశాడు రాజశేఖరం. కనుమరుగయ్యేదాకా చూసి కళ్ళు తుడుచుకుంది భారతి. "ఏమిటో... ఒక్కగానొక్క మగబిడ్డ. అపురూ పంగా పెంచుకున్నాను. ఎంత మనసుకి నచ్చచెప్పుకున్నా నా మనసు కలుక్కుమం టోంది. పొద్దున కూర కలుపుతూ చెయ్యి కాల్చుకున్నాడు. దొరబాబులా మోటారు సైకిల్ మీద వెళ్ళి దర్జాగా ఉద్యోగం చేసు కునే నా బిడ్డ వంటింటిపాలైపోయాడు" అంది బరువు ఎక్కిన కంఠంతో.

బరువుగా నిట్టూర్చాడు రాజశేఖరం. మగ వాడు కాబట్టి భార్యలా బయటపడకుండా గంభీరత నటిస్తూ వీక్లీ తీసి మొహానికి అడ్డం పెట్టుకున్నాడు.

★ ★ ★



మధుతో అలవాటుప్రకారం అరగంట కబుర్లు చెప్పి తండ్రికి ఫోన్‌చేసింది మాధవి.

"ఎలా వున్నావ్ బేబీ? ఎప్పుడు వెళ్తున్నావ్ ఇంటికి?" అని అడిగాడాయన. రేపు ఈవినింగ్ ఫ్లయిట్‌కి వెళ్తున్నా డాడీ. ఈ నాలుగు రోజులు ఊపిరిసలపలేదు. అక్కడికి వెళ్ళాక రెండు నెలలు హెవీవర్క్. క్షణం తీరిక వుండదు" అంటూ తన సాధక బాధకాలు చెప్పుకొచ్చింది.

"మధూ వాళ్ళ పేరెంట్స్ గుంటూరు వెళ్ళిపోయారుట. వాళ్ళూ మధూ కలిసి ఇల్లు సర్దేశారుట" అంటూ విశేషాలు చెప్పింది. "ఇంక వుంటా డాడీ. బుర్రవేడెక్కిపోయింది" అని గుడ్‌నైట్ చెప్పేసింది.

ఆ సంభాషణంతా విన్న భవాని బాధపడింది. "ఏమిటో పిచ్చితల్లి... అదీ బుద్ధి తెలియకముందు ఏం నిశ్చింతగా వుందో. అంతే. ఆ తర్వాత రాత్రింబగళ్ళూ చదువూ పరీక్షలు. తర్వాత ఉద్యోగం. దాని ప్రాణానికి సుఖంలేదు.

పెద్దదాన్ని చూడబోతే నైట్ డ్యూటీలు హడావిడీ ఆ తీరు. దీన్ని చూడబోతే ఎప్పుడూ తీరికలేనంత పనిలో పీకలదాకా కూరుకుపోయివుంటుంది. ఖర్మ కాకపోతే అందరాడపిల్లల్లా మన పిల్లలనీ ఏ గ్రాడ్యుయేషన్‌తోనో ఆపించి పెళ్ళిచేసి వుంటే బాగుండేది. హాయిగా ఇంటి పట్టున వుండే వాళ్ళు. బేబీని చూడండి. పెళ్ళై పదహార్రోజుల పండగ కాలేదు ఇంకా. అప్పుడే మీటింగులూ తిరుగుళ్ళూను. ఇక దానికి విశ్రాంతి ఎప్పుడు?" వాపోయింది.

గంభీరంగా మరో పెగ్ గ్లాసులోకి వంచుకున్నాడు భానుప్రతాప్. 'ఇన్నాళ్ళూ అంటే జాబ్ టెన్షన్ ఒక్కటే. ఇప్పుడు పెళ్ళయింది. ఇల్లూ సంసారం బాధ్యత పెరిగింది. ఎలా సమర్థించుకుంటుందో నా చిట్టి తల్లి. బేబీ మేగాడ్ బ్లెస్‌యూ!' అనుకున్నాడు.



మధు నిద్రపట్టక కాసేపు అటూ ఇటూ పొర్లి ఇక లాభంలేదనుకుని లేచి పెళ్ళికాసెట్ వీడియోలో పెట్టి మధు మంచి ఏంగిల్‌లో కనిపించగానే ఫ్రీజ్ చేసి కన్నార్పకుండా చూస్తూ కూర్చున్నాడు.

మాధవి శరీరం అలిసిపోయింది. మెదడు వేడెక్కింది. అయినా నిద్ర మాత్రం దరిదాపులకు రావడంలేదు. ఇంకా ఇరవై గంటలు గడవాలి ఎలా? ఏమిటీ విచిత్రం ఇన్నేళ్ళూ అతను లేకుండా వుంది కదా! ఇప్పుడీ మార్పుఏమిటి? నిన్నమొన్నటిదాకా అపరిచితుడు హఠాత్తుగా తన జీవితంలో ప్రవేశించి తన సర్వస్వంగా మారిపోయాడు. ఇదంతా ఈ పసుపుతాడు మహిమా? లేక తమ మధ్య ఏర్పడిన సన్నిహిత సంబంధం కారణంవలనా? చాలా సీరియస్‌గా ఆలోచించసాగింది.

అంతలో ఫోన్ మోగింది? చివాల్న లేచి ఫోన్ అందుకుంది.

"హల్లో!"

"నేనే మాధవి. నీకు ఎడమకన్ను కొంచెం మెల్లకదూ!" సీరియస్‌గా అడిగ్గాడు.

ఆశ్చర్యపోయింది మాధవి. "ఏమిటీ?

నాకు ఎడంకన్ను మెల్లా? ఎవరు చెప్పారు? "

"ఎవరో చెప్తే నేనెందుకు నమ్ముతాను. స్వయంగా చూసి చెప్తున్నాను. అదుగో పక్కచూపు చూస్తుంటే స్పష్టంగా తెలిసిపోతోంది. కొద్దిగా మెల్ల వుంది. అయినా ఫర్వాలేదులే. నువ్వు మోసం చేశావని నేను అపార్థం చేసుకోను. నాది చాలా విశాలహృదయం. అదీగాక ఆడపిల్లకు చిన్న మెల్ల అంటే సిరిమెల్ల చాలా అదృష్టం అని చెప్తూ వుంటుంది మా అమ్మ"

"ఏమిటా ప్రేలాపన? ఒంటరిగా వుండి ఏమీ తోచక కాస్త మందేమైనా పుచ్చుకున్నావా? అసలేమిటి సంగతి? ఫోటోలు చూస్తున్నావా? లేకపోతే కేసెట్ చూస్తున్నావా? ఆ వీడియోవాడు అలా తీశాడేమో! లేకపోతే నాకు మెల్ల ఏమిటి? నీ అందం అంతా నీకళ్ళలో వుంది అంటుంది మా మమ్మీ. మా కాలేజీ రోజుల్లో పాపం ఒక బ్బాయి నాకళ్ళమీద రెండు పేజీల కవిత రాశాడు" అటునుండి ఉలుకూ పలుకూ లేక పోయేసరికి ఆగిపోయింది మాధవి.

"ఏమిటి వింటున్నావా? హల్లో నిన్నే" గట్టిగా అరిచింది.

"అబ్బబ్బ! తనివితీరా అందాలను ఆస్వాదిస్తూవుంటే పానకంలో పుడకలా నీ గోల ఏమిటి? " విసుక్కున్నాడు మధు.

"ఏమిటీ? అందాలు ఆస్వాదిస్తున్నావా? నేనిక్కడవుంటే అక్కడ నువ్వెలా అందాలు ఆస్వాదిస్తున్నావ్? " నిలదీసి అడిగింది.

"నా పెళ్ళి కేసెట్ చూస్తున్నాను. మా ఆవిడ నా తలమీద బెల్లం జీలకర్ర పెడుతోంది. సైడ్ ఏంగిల్ లో కనిపించీ కనిపించని అందాలు నన్ను మైమరపింపజేస్తున్నాయి. కవితలు అల్లాలనిపిస్తోంది"

మాధవి మొహం ఎర్రబడిపోయింది. "సిగ్గులేదు నీకు రేపొస్తాకదా. అపుడు చెప్తాను నీ పని" అనేసి ఫోన్ డిస్కనెక్ట్ చేసింది.

★ ★ ★

దాదాపు వారంరోజుల తర్వాత భార్యను చూడబోతున్నానని మహోత్సాహంగా వున్నాడు మధు. ఇల్లంతా అద్దంలా సర్దాడు. తాజా పువ్వులు కొనుక్కొచ్చి ఫ్లవర్ వాజ్ లు అలంకరించాడు. తను అందంగా అమర్చిన ఇండోర్ ప్లాంట్స్ అన్నింటిమీదా నీళ్ళు చిలకరించి శుభ్రంగా వుంచాడు.

డ్రైవింగ్ క్లాసకి వెళ్ళొచ్చి భోజనం చేసి కాసేపు రెస్ట్ తీసుకున్నాడు. వంటచేసి ఎయిర్ పోర్టుకి వెళ్ళాలని ప్లాన్. వంట ఏంచేయ్యాలి? మధుకి ఏంఇష్టం? కాసేపు ఆలోచించి ఇలా కాదని మాధురికి ఫోన్ చేశాడు.

కాసేపు లోకాభిరామాయణం మాట్లాడి అసలు విషయం అడిగాడు.

"దానికా? భలేవారే? దానికి ఇష్టాఇష్టాలంటూ ఏమీలేవు. రుచిగా వుంటే చాలు తినేస్తుంది! అసలు దానికి ఏకూర ఏదో తెలీదు. ఒకసారి ఏమైందో తెలుసా మధూ, నాకు బెండకాయ కూర తినాలని వుందే అని అడిగింది. అడిగింది కదా అని మర్నాడే చేసేను. భోజనానికి కూర్చుని ఇది చేశావేం నేను బెండకాయ అడిగాను కదా! అంది. అదేమిటీ అంటే దానికి కావలసింది వంకాయ కూరట. అది కావాలని చెప్పబోయి ఇది కావాలని చెప్పిందట. అలాటి అయోమయం మనిషి అది" అంది మాధురి.

తన భార్యని అయోమయం మనిషి అనడం అంతగా నచ్చలేదు అతనికి. వంటలో పరిచయం లేదేమోగానీ మధు చాలా జీనియస్ అని పొగిడాడు. అది గమనించి ఏంకాదు మీ ఆవిడ ఉత్త బద్ధకం మనిషి. దమ్మిడీ పనిరాదు, అంటూ మరి కాస్త ఉడికించింది.

తనని ఆట పట్టిస్తోందని గమనించి, "మరి ఇన్నాళ్ళూ మీరేం చేస్తున్నారూ? మీరు అన్నిటా ప్రవీణులు కదా! మీ ఫ్రెండ్ కి కూడా నేర్పకపోయారా" అని ఆవి

డమీద దండెత్తాడు.

"నేర్పుదామనే అనుకున్నాను. మళ్ళీ అంతలోనే నాకెందుకొచ్చిన తలనెప్పి, కట్టు కున్నవాడు నేర్చుకుంటాడులే అని వూరుకు న్నాను" సమాధానం చెప్పింది.

"నామీద మీకున్న నమ్మకానికి కృతజ్ఞ తలు" అన్నాడు వినయంగా.

ఫకాల్న నవ్వేసింది మాధవి.

తన పాక శాస్త్ర ప్రావీణ్యం అంతా ఉప యోగించి వంట ముగించి సర్ది, రైస్ కుక్కర్‌లో బియ్యం కడిగి పెట్టాడు. చక్కగా స్నానంచేసి అందంగా తయారయ్యాడు. అంతలోనే వచ్చింది కంపెనీకారు. ఉత్సా హంతో ఉరకలు వేస్తున్న మనసుతో కార్లో ఎయిర్‌పోర్ట్‌కి బయలుదేరాడు.

ఎయిర్ పోర్ట్ అంతా తిరిగి చూశాడు. పైకివెళ్లి ఒక ప్లెయిన్ టేకాఫ్ చూశాడు. కాఫీ తాగాడు. అనుకున్న సమయానికి అర గంట ఆలశ్యంగా వచ్చి లాండ్ అయింది ప్లేను. అంత దూరాన్నించే చెయ్యి ఊపింది మాధవి. తనూ చెయ్యి ఊపి ఎదురు వెళ్లాడు. ఆదరంగా భుజాన చెయ్యివేసి దగ్గ రకు తీసుకున్నాడు. "ఏమిటంత డల్‌గా అయిపోయావ్. పనివల్లనో ఏమో బాగా అలిసిపోయినట్టు కనిపిస్తున్నావు" అని కంగారు పడిపోయాడు.

ఇద్దరూ కబుర్లలో మునిగిపోయారు. ఇల్లె ప్పుడొచ్చిందో గమనించనేలేదు. డ్రైవరు కారాపి గేటు తీస్తుంటే అప్పుడు ఇహలోకం లోకి వచ్చారు. తను ముందు దిగి మాధవి చెయ్యందుకున్నాడు. స్వాగతం... సుస్వా గతం... అంటూ తలుపు తాళంతీసి లోప లికి అడుగుపెట్టాడు. కళ్లు విప్పార్చుకుని ఇల్లంతా చూసింది మాధవి. అణువణువూ అద్భుతంగా వుంది. ఎంత శ్రద్ధగా అమర్చి వుంది ప్రతి వస్తువూ.

పెళ్లికాక ముందు టూర్‌నుంచి వచ్చేసరికి అరణ్యంలా ఉన్న రూమ్ స్వాగతం పలి కేది. ఆకలి వేస్తుంటే మళ్లీ బయటకి వెళ దామంటే బద్ధకం వేసి ఫ్రిజ్‌లో ఉన్న బ్రెడ్ తిని కాలక్షేపం చేసేది. కానీ ఇప్పుడు ఎంత మార్పు. ఇంట్లో అడుగు పెట్టగానే అలసట అంతా హుష్‌కాకి అయిపోయింది. శరీరం, మనసు ఆహ్లాదంగా అయిపో యాయి.

వేడి కాఫీ తీసుకొచ్చి అందించాడు మధు. కబుర్లు చెప్పుకుంటూ తాగారిద్దరూ. సూట్ కేస్ తీసుకుని మధుకోసం తను తెచ్చిన పెర్‌ఫ్యూమ్ ఇచ్చింది. బాంబే కబుర్లు చెప్పింది. స్నానం చేసి వచ్చింది.

ప్లేట్‌లో అన్నం కలిపి అపురూపంగా తినిపించాడు మధు. "అద్భుతం, ఏ హోట ల్‌నుంచి తెప్పించావ్?" మెచ్చుకుంది.

"ఎంత మాటన్నావ్. నీకోసం కష్టపడి వండితే హోటల్ తిండి అంటావా?" అలి గాడు మధు.

ఆశ్చర్యపోయింది మాధవి. "నువ్వు వంట చేశావా? చక్కగా హోటల్ నుండి తెచ్చుకునేవాళ్లం కదా!"

"నా వంట బాగా లేదా? నీకు నచ్చక పోతే చెప్పు. రేపటినుంచి హోటల్ భోజనం తెస్తాను"

"ఛ,ఛ... అదికాదు మధూ. నిజం చెప్పా లంటే వంట చాలా బాగుంది. కానీ నువ్వు చెయ్యడం ఏమిటి? శ్రమకదూ"

"ఏంకాదు. ఎంతసేపు చెయ్యాలి ఇద్దరికి వంట? ఆ హోటల్ భోజనం ఓ పూట సర దాకి బాగానే వుంటుందిగానీ రోజూ తింటే ఆరోగ్యం పాడవుతుంది" వివరించాడు.

"అలా అయితే ఓ పనిచెయ్. ఒక వంట మనిషిని మాట్లాడు"

"ఆ మాట అన్నావ్ బాగుంది. ఇందాకనే ఓ అమ్మాయి వచ్చి అడిగింది కూడాను. వంటకి మనిషి కావాలా అని. ఇరవై ఏళ్లుం టుంది వయసు. బాగానే వుంది. ఈసారి కనిపిస్తే రమ్మని చెప్పనా? నాకూ కాస్త కాలక్షేపం" చిలిపిగా అడిగాడు.

"అమ్మాయివద్దు ఎవరైనా కుర్రాడిని

# ఏరినముత్యాలు

★ నా కుటుంబంకంటే ఎక్కువగా నా దేశాన్నే ప్రేమిస్తాను. అయితే మానవజాతి నా దేశంకంటే కూడా నాకు ఎక్కువ.

–ఫెలాన్

★ స్త్రీలకు మాత్రమే పాతివ్రత్యాన్ని నిర్దేశించి, పురుషునికి విచ్చలవిడితనాన్ని ఇచ్చిన సామాజిక నీతి అంతం కావాలి.

–గురజాడ

★ భార్యను విముక్తురాలిని చేస్తే మొత్తం స్త్రీజాతి బంధనాలను తెంచుకుని జీవన స్రవంతిలో కలిసిపోతుంది.

–ఎంగెల్స్

★ మనిషి కాలాన్ని హరిస్తున్నానని అనుకుంటాడు. కాని కాలమే అతన్ని హరిస్తుంది.

–హెక్టర్ బిర్లిజో

★ భగవద్గీత నా తల్లితో సమానం. నేను కష్టాలలో, విచారంలో ఉన్నప్పుడు నేను ఆ గీతామాతనే అభయం వేడుకుంటాను.

–మహాత్మాగాంధీ

★ సాహిత్యం, వేదాంతం, ధర్మశాస్త్రం అధ్యయనం చేస్తే విజ్ఞానం సులభంగా పొంద వచ్చు

–రాధాకృష్ణన్

★ నాటి తరం వారు రోజంతా కష్టించి పనిచేసి, విశ్రాంతి తీసుకునేవారు. నేటి తరం వారు పనిచెయ్యకుండా ఎక్సర్‌సైజులు మాత్రం చేస్తున్నారు.

–అటల్ బీహారీ వాజ్‌పాయ్

★ ప్రేమను మనం ఎవరికి పంచినా, మనవద్ద అది తరిగిపోకుండా తిరిగి పెరుగు తునే ఉంటుంది.

–వినోభాభావే

★ ఇతరులతో పోరాడి వారిపై విజయాన్ని సాధించడానికి ప్రయత్నించకూడదు. నీవే నీపై పోరాటం జరుపుకొని విజయం సాధించుకోవాలి.

–మెహర్‌బాబా

★ మనచుట్టూ నెలకొని వున్న పరిస్థితులు ఎటువంటివి అయినా వాటినుంచి ఆనందం తన చుట్టూ వున్నవారికి అందించే వాడే గొప్ప కళాకారుడు.

–షేక్‌స్పియర్

★ రాబోయే ఎన్నికల గురించి ఆలోచించేవాడు రాజకీయ నాయకుడు, రాబోయే తరాన్ని గురించి ఆలోచించే వాడు రాజకీయవేత్త.

–చర్చిల్

సేకరణ: పట్నం శేషంశెట్టి

చూడు. కాలక్షేపం అవుతుంది" గుర్రుగా చూసింది మధు.

"సర్లే ముందు అన్నం తిను. చల్లారిపో తోంది. అయినా ఇంటి గొడవ నీకెందుకు. నేను చూసుకుంటాను" అనేశాడు.

"అది కాదు మధూ" చెప్పబోయింది.

"హరి భగవంతుడా. చెత్త విషయాలతో టైమ్ వేస్ట్ చెయ్యకు. త్వరగా అన్నం తిను. నీతో బోలెడంత పనుంది" అనేశాడు.

మధు చెంపలు ఎర్రబడిపోయాయి. తల వంచుకుని గబగబ అన్నం తినేసింది.

పెళ్ళి తర్వాత మొదటిసారి ఆఫీసులో అడుగుపెట్టిన మాధవిని చుట్టుముట్టి అభి నందనలతో ముంచెత్తారు అందరూ. పార్టీ కావాలంటూ గోలపెట్టారు. అలాగే తప్ప కుండా అని మాట ఇచ్చింది మాధవి.

లంచ్ టైమ్‌లో భర్తతో మాట్లాడింది. అలాగే ఇద్దాం. సాయంత్రం నువ్వు వచ్చాక ఇద్దరం కలిసి ప్లాన్ చేద్దాం అన్నాడు. ఆ రాత్రి కూర్చుని పార్టీ గురించి మాట్లాడుకు న్నారు.

హోటల్‌లో అయితే బాగుంటుంది అను కున్నారు. రేపు నేను కొంచెం లేటుగా వెళ్తాను. ఈ పనులన్నీ ముగించుకుందాం అంది మాధవి.

మర్నాడు ఇద్దరూ బయలుదేరారు. ముందుగా బేంక్‌కి వెళ్ళి మాధవి పేరున వున్న ఎకౌంట్ ఇద్దరి పేరు మీదా వుండేలా జాయింట్ ఎకౌంట్‌గా మార్చారు. తర్వాత హోటల్‌కి వెళ్ళి అన్ని ఏర్పాట్లు చూసి మెనూ నిర్ణయించారు. ఆ తర్వాత మధుని ఇంటి దగ్గర దించేసి వెళ్ళిపోయింది మాధవి.

పన్లోపనిగా మధు ఫ్రెండ్స్‌ని కూడా పిలు ద్దామని నిర్ణయించారు. పిలవాల్సిన అతి థుల జాబితా ఒకటికి రెండుసార్లు చూసు కుని ఎవర్నీ మర్చిపోలేదని రూఢిచేసుకు న్నారు. ఆహ్వానాలు పంపే బాధ్యత తనపై వేసుకున్నాడు మధు. కార్డ్సు ఆర్డర్ ఇచ్చి అవి రాగానే అందరికీ అందజేశాడు.

పార్టీ ఆదివారం సాయంత్రం ఆరుగంట లకి

మధ్యాహ్నం భోజనాలు అయ్యాక "మధూ ఏం డ్రెస్ వేసుకుంటావ్?" అని అడిగాడు. "చూద్దాంలెద్దూ ఇంకా చాలా టైం వుందిగా" బద్ధకంగా సమాధానం చెప్పింది మాధవి.

"అలాకాదు... చివర్లో హడావిడి అయిపో తుంది. ఏంవేసుకుంటావ్. అది ఇస్త్రీ చేసి వుందా? ముందుగానే చూసుకుంటే మంచిది" సలహా చెప్పాడు.

సరే అంటూలేచి బీరువాలోంచి ఒక డ్రెస్ తీసుకొచ్చింది. "ఇది వేసుకుంటాను" అంటూ చూపించింది.

"అది చూసి ఆశ్చర్యపోయాడు మధు. లేతాకు పచ్చరంగు లక్నోచికెన్ డ్రెస్ అది. "ఇది వేసుకుంటావా? మరీ సింపుల్‌గా లేదూ" అన్నాడు.

"చాల్లెద్దూ. నాకిలా సింపుల్‌గా వుండడం ఇష్టం" అంది.

"అదికాదు! మామూలుగా రోజూ సింపు ల్‌గానే వుంటావు. మరి ఇవ్వాళ ప్రత్యేకమైన రోజుకదా! ఆ ప్రత్యేకత కనిపిం చేలా వుండద్దూ. కొత్త పెళ్ళికూతురివి. పార్టీ ఇస్తున్నావు. ఈ పూట అందరి కళ్ళు నీమీదే వుంటాయి. లక్షణంగా పట్టు చీరె కట్టుకుని తయారైతే చూడముచ్చటగా వుంటుంది" అన్నాడు.

"పట్టుచీరే! అమ్మ బాబోయ్. అది కట్టు కుని అటూ ఇటూ తిరగాలంటే చిరాగ్గా వుండదూ" బెదిరిపోయింది.

"ఏంవుండదు. నేను చూసుకుంటాను పనులన్నీ. నువ్వు హైరానా పడే అవసరం రాదు" అన్నాడు.

"సరే అయితే ఏ చీర కట్టుకోమంటావ్ నువ్వే సెలక్ట్ చెయ్యి" అతనికే ఆ బాధ్యత అప్పగించింది.

"ఆమాట అన్నావ్ బాగుంది. ఇక నాఇష్టం. నీ శరీరాన్ని నాకు అప్పగించి




నువ్వు నిశ్చింతగా వుండు" హామీ ఇచ్చాడు.

★ ★ ★

సాయంత్రం తమ కొత్తకారుని మధు డ్రైవ్ చేస్తూంటే అరగంట ముందు హోటల్‌కి చేరుకున్నారు. ఏర్పాట్లు అన్నీ మరో సారి చూసుకుని తృప్తిపడి అతిథులని ఆహ్వానించడానికి సిద్ధం అయిపోయారు.

అందరికంటే ముందు వచ్చింది మాధురి. మాధవినిచూసి వావ్ అంటూ కావలించేసుకుంది. "ఎంత అందంగా వున్నావ్. ముద్దొస్తున్నావ్" అంటూ బుగ్గమీద ముద్దు పెట్టుకుంది.

"అవునూ పెళ్ళికాగానే నీలో ఎంత మార్పు వచ్చింది. ఇంత శ్రద్ధగా ఇంతకుముందెప్పుడైనా అలంకరించుకున్నావా? " అంది సంతోషంగా.

"ఆమాటకొస్తే ఇదంతా మా శ్రీవారి సెలక్షన్. నేను ఎప్పటిలాగా సింపుల్‌గా తయారవుతానంటే మధు వద్దన్నాడు" చెప్పింది మాధవి సంబరంగా.

మాధురి మాత్రమేకాదు అతిథులందరూ మాధవిని ప్రత్యేకించి అభినందించారు. రాజహంసలా వున్నావని ఒకరు, అప్సరసలను తలదన్నేలా వున్నావని మరొకరు రకరకాలుగా అభినందిస్తూ వుంటే లోలోపలే మురిసిపోయింది మాధవి. నిజం చెప్పాలంటే వారి మాటల్లో అతిశయోక్తి ఎంత మాత్రమూ లేదు. ఎర్రటి జరీ అంచు తెల్లని పట్టుచీరె కట్టుకుని తగుమాత్రం నగలు అలంకరించుకుని అందరికీ కనువిందు చేస్తోంది మాధవి. అన్నివిధాలా ఆమెకి తగినట్లు వున్నాడు మధు.

అతిథులు ఆ దంపతులని అభినందించారు. వాళ్ళ సంసారం ఎలా నడుస్తూ వుందో అడిగి తెలుసుకున్నారు. సలహాలు కూడా ఇచ్చారు. పార్టీ సరదాగా సాగింది. మాధవిని పాట పాడమన్నారు.

"నాకు రావు బాబోయ్. నన్ను వదిలెయ్యండి" గోలపెట్టింది మాధవి.

"అయితే మీ శ్రీవారిని ఓ పాట పాడమనండి" అంటూ పట్టుబట్టారు ఫ్రెండ్స్.

మధు రంగంలోకి దూకాడు.

"నా శ్రీమతే అడగక్కర్లేదు. మీరు పాడమన్నా పాడతాను. కానీ ఒక్క షరతు"

"ఏమిటది? " అడిగారు అతిథులు.

"మేము అందరికీ సరిపడా భోజనం ఏర్పాట్లు చేసుకున్నాం. నా పాట విని ఎవరం పారిపోము అని ప్రామిస్ చేస్తే పాడతాను" అన్నాడు వినయంగా.

అంతా నవ్వేశారు. "అలాగే ప్రామిస్. పారిపోం. పాడండి" అన్నారు.

గొంతు సవరించుకుని 'తెలవారదేమో స్వామీ' పాట పాడాడు. అంతా శెభాష్ అన్నారు. మరొకటి పాడమని బలవంతపెట్టారు. ఈసారి హిందీ పాట 'చేద్‌లీకా బాంద్‌హు" పాడాడు మరింత మధురంగా. అంతా చప్పట్లు కొట్టారు. భర్తని అమాంతం ముద్దుపెట్టేసుకునేదే మాధవి. అందర్లో అలాటి పనిచేస్తే అంత బావుండదని మానేసింది.

భోజనాలు ముగించి అతిథులందరూ వెళ్ళాక హోటల్‌వారికి బిల్ చెల్లించి బహుమతులు వెనకసీట్లో పడేసుకుని ఇంటికి బయలుదేరారు దంపతులు. కారు కాస్త ఖాళీగావున్న రోడ్ మీదకి రాగానే పక్కకి తీసి బ్రేక్ వేసి ఆపింది. పక్కకి జరిగి భర్తని గాఢంగా ముద్దుపెట్టుకుంది. అంత అద్భుతంగా పాడినందుకు ప్రెజంట్.

"అయినా అంత బాగా పాడగలనని నాతో మాటమాత్రం చెప్పలేదు కదూ" నిష్ఠూరం ఆడింది.

"ఏదీ ఆ ప్రసక్తి రాలేదుకదా! నేనూ మర్చిపోయాను" సంజాయిషీ చెప్పాడు.

"నువ్వు సంగీతం నేర్చుకున్నావా? " అడిగింది.

"నేను ప్రత్యేకంగా నేర్చుకోలేదు. అక్క నేర్చుకునేది. ఇల్లెగిరిపోయేలా సాధన

చేస్తూండేది. దాంతో ఇంట్లోవున్న వాళ్ళంద రికీ ఆటోమేటిక్‌గా సంగీతం వచ్చేసింది" చెప్పాడు.

"అబ్బ నేర్చుకోకుండా విని ఇంత బాగా పాడుతున్నావంటే మాటలుకాదు, నిజంగా నీకు హేట్సాఫ్" అంటూ మరో ప్రజంట్ ఇచ్చింది.

గేరు మార్చబోతుంటే వారించాడు మధు. "నువ్వెంత అందంగా వున్నావో చెప్పలేను. నామాట మన్నించి ఇంత అందంగా అలంకరించుకున్నందుకు మంచి బహుమానం ఇవ్వాలి" అంటూ తనూ ఓ బహుమతి ఇచ్చాడు.

ఆ తర్వాత కారు బయలుదేరింది. కాక పోతే ఇద్దరూ పరస్పరం బహుమతులు ఇచ్చుకోవడంకోసం అడుగడుగు దణ్ణాల వాడా అని ఆగుతూ మళ్ళీ బయలుదే రుతూ.

అందులో బహుమతులు బోలెడిచ్చుకో వాల్సి వచ్చింది. వెన్యూ సెలక్ట్ చేసినం దుకు, మెనూ నిర్ణయించినందుకు, అతిథు లకి సమయానికి ఆహ్వానాలు అందజేసినం దుకు, అతిథులని చక్కగా రిసీవ్ చేసుకు న్నందుకు, పార్టీ ఆహ్లాదంగా జరిపించినం దుకు ఇలా కోకొల్లలు బహుమతులు ఇచ్చు కుంటూ ఇంటికి చేరేసరికి అర్ధరాత్రి అయింది.

బట్టలు మార్చుకుని ప్రెజెంటేషన్లు విప్పి చూస్తూండగా ఫోన్ మోగింది గుంటూరు నుంచి.

భారతి ప్రయాణం నిశ్చయం అయింది. టికెట్ వచ్చేసింది. ముందు ఆవిడ వెళ్తుంది. రెండునెలల తర్వాత రాజశేఖరం వెళ్తాడు. మరో రెండునెలలు వుండి ఇద్దరూ కలిసి వచ్చేస్తారు. ఇదీ ప్రోగ్రాం. అమ్మ వెళ్ళడానికి నాలుగురోజులు ముందుగానే గుంటూరు వస్తాను అన్నాడు మధు. ఏకంగా ఆ వేళ్టికి మెడ్రాస్ వస్తానంది మాధవి. పార్టీ కబుర్లు వాళ్ళకి చెప్పి ఆనం దింపచేసారు.

మధు అండ్ మధూల సంసారం ఒక గాడిలోపడి చక్కగా సాగిపోతోంది. మాధవి సరే ఉదయం ఎనిమిదినుండి రాత్రి ఏడింటిదాకా పీకల దాకా పనిలో మునిగివుంటుంది.

మధుకు కూడా సరిపోతుంది రోజంతా. మాధవి వెళ్ళాక పనిమనిషి వస్తుంది. ఇల్లంతా శుభ్రం చేయించి బట్టలుతికించి పనిమనిషిని పంపేస్తాడు. ఆ తర్వాత బజా రుకి వెళ్ళి కావలసినవి అన్నీ కొనుక్కువ స్తాడు. అదివరకు పనిచేసిన ఫ్రెండ్‌కి అవ సరమైతే ప్లాన్లు గీసి ఇస్తాడు. మాధవి ప్రోద్బలంవల్ల మ్యూజిక్ నేర్చుకుంటు న్నాడు. "సితార్ అంటే నాకు ప్రాణం. నేనె లాగూ నేర్చుకోలేకపోయాను. నీకు సంగీ తంలో పరిచయం వుందికదా! నువ్వు నేర్చుకో" అని బతిమాలింది.

అలాగే అనేసి వెంటనే క్లాసులో జేరిపో యాడు. వారానికి మూడురోజులు ఆ క్లాసు లుంటాయి. మధ్యాహ్నం భోజనానికి మాధవి ఇంటికిరాదు. వాళ్ళకి అక్కడే సప్లై చేస్తారు. తన ఒక్కడికోసం కదా అని లంచ్ క్లుప్తంగా వండేసి భోజనం చేస్తాడు. మధ్యాహ్నం టి.వి. చూస్తూ పుస్తకాలు చదువుతూ కాలక్షేపం చేస్తాడు. కావాలంటే చిన్న కునుకు తీస్తాడు.

సాయంత్రం మొక్కలకి నీళ్ళుపోసి ఇల్లంతా మరోసారి సర్ది శ్రద్ధగా వంట చేస్తాడు. మాధవికోసం ఎదురుచూస్తూ కూర్చుంటాడు.

మాధవి వచ్చేస్తుంది.

మంచి వంటల పుస్తకాలు కొని రకరకాల వంటలు ప్రయోగం చేస్తూ వుంటాడు. మంచి డ్రెస్ డిజైన్ కనిపిస్తే దాన్నికట్‌చేసి భద్రంగా వుంచి మాధవికోసం ఆ డ్రెస్ ఆర్డర్ చేసి కుట్టిస్తాడు.

మనసులు కలిసిపోయిన ఆ జంట చిల కాగోరింకల్లా సంసారం సాగించసాగారు.




ఈ పరుగుల ప్రపంచంలో ఒకర్ని గురించి పట్టించుకునే తీరిక, ఓపిక ఎవరికీ వుండడం లేదు. ఎవరి బతుకులు వాళ్ళవి.

కానీ ఈ రోజుల్లో కూడా కలహభోజనుడి వారసులు కొంతమంది వున్నారు. ఆ కోవకి చెందినవాడే మాధవరావు. మాధవరావు తండ్రీ, భానుప్రతాప్ చిన్ననాటి మిత్రులు. మాధవరావ్ కంప్యూటర్ ఇంజనీరింగ్ చేసి ఉద్యోగంలో చేరాడు. అతనికి మాధవిని పెళ్ళి చేసుకోవాలని మనసులో వుంది. తండ్రితో చెప్పాడు. ఆయన భానుప్రతాప్‌తో చెప్పాడు. మాధవి ఒప్పుకోలేదు. నేను ఇప్పుడే పెళ్ళి చేసుకోను. ఎమ్. బి. ఏ. చదవాలి అనేసింది.

మాధవరావు అహం దెబ్బతింది. ఆ తర్వాత అతనికి పెళ్ళయింది. అంతా బాగానే వుంది. కానీ మనసులో ఏదో మూల మాధవిపట్ల కోపం దాగివుండిపోయింది. మాధవి పెళ్ళి చేసుకుంటూందని తెలిసి అతగాడు ఎంత గొప్పవాడో అని కుతూహలంతో వాకబు చేశాడు. నిజం తెలుసుకుని ఎగతాళి చేశాడు. అందరిదగ్గరా మాధవి గురించి చులకనగా మాట్లాడాడు. మాధవి ఇచ్చిన పార్టీకి వెళ్లాడు.

వాళ్ళిద్దరూ అలా రాసుకుపూసుకు తిరగడం అతనికంతగా నచ్చలేదు. ఇంతటి గొప్ప మొగుడు తనకీ వున్నాడు అన్నట్లు ఏం చూసుకుని ఆ మాధవికి అంత గర్వం అని పళ్ళు కొరుక్కున్నాడు. మాధవి భర్త ఇంట్లో వుండి వంటావార్పూ చూసుకుంటూ వుంటాడని తెలిసి చచ్చేంత నవ్వు వచ్చింది అతనికి. మాధవిని ఎద్దేవా చెయ్యాలనిపించింది.

పనిగట్టుకుని ఒక ఆదివారం పొద్దున్న పదకొండింటికి ఫోన్ చేశాడు. మాధవే స్వయంగా రిసీవ్ చేసుకుంది.

ఆప్యాయంగా పలకరించింది. "ఎలా వుంది మీ జాబ్" అని అడిగాడు మాధవరావు.

"మామూలేనండి. మీ జాబ్ ఎలా వుంది? " అంది మాధవి.

"నా జాబ్‌కేమండీ. ఫస్ట్‌గా వుంది. వచ్చే ఏడాది స్టేట్స్ వెళ్ళిపోవాలని ప్లాన్ చేస్తున్నాను. ఫ్యామిలీని కూడా తీసుకువెళ్తాను. అక్కడైతే బోలెడంత డబ్బు. చూస్తున్నారుగా డాలర్ రోజురోజుకీ ఎలా పెరిగిపోతోందో. ఇండియాకి భవిష్యత్తు లేదండీ. ఇక్కడుంటే ఈ గొర్రెతోక జీవితాలే. నా భార్యని డబ్బులో, సకల సుఖాలలో ముంచెత్తాలని నా కోరిక" అన్నాడు.

"మంచి ఆలోచన మీది. కంగ్రాట్స్" అభినందించింది మాధవి.

"మీ వారేం చేస్తున్నారు? వంట టైం కదా. వంటింట్లో వున్నారా? " అడిగాడు కించిత్ ఎగతాళిగా.

"అవునండీ. ఇప్పుడే మొదలుపెట్టారు" చెప్పింది.

మరి కాస్త ఏడిపించబుద్ధి వేసింది మాధవరావుకి.

"మా ఆవిడకి ఏదో రెసిపీ కావాలిట. మీవారిని అడిగి తెలుసుకోవాలనుకుంటోంది. అందుకే ఫోన్ చేశాను" అన్నాడు.

"మంచిపని చేశారు. వుండండి మధుని పిలుస్తాను" అని చెప్పి లోపలికి వెళ్ళింది.

గభాల్న ఫోన్ పక్కనపెట్టి భార్యని లాక్కొచ్చాడు మాధవరావు. ఆవిడకి ఈ వ్యవహారం అంతా చిరాగ్గా వుంది. "ఎందుకివన్నీ" అని విసుక్కుంది. "ఇష్... నోరు మూసుకో. అవతల ఆయన వస్తున్నాడు. ఏదో ఒకటి అడుగు. కాస్త కష్టమైనదే అడుగు" అని బోధపరిచి ఫోన్ అందించాడు.

అటువైపునుండి మధు బదులుగా మాధవే మాట్లాడింది కుశలప్రశ్నలు అయ్యాక, "సారీ అండీ మధు మైసూర్‌పాక్ చేస్తున్నారు. మధ్యలో ఆపకూడదుట కదూ. ఆ పని కాగానే తనే మీకు ఫోన్ చేస్తానన్నారు" అని చెప్పింది.

"అబ్బా మీవారు మైసూర్‌పాక్ కూడా చేస్తున్నారా? " సంభ్రమంగా ప్రశ్నించింది ఆవిడ.

"అవునండీ. మైసూర్‌పాక్ నాకిష్టం. అందుకని కష్టపడి నేర్చుకున్నారు" గర్వంగా చెప్పింది మాధవి.

"మీరు చాలా అదృష్టవంతులు. మంచి భర్త దొరికాడు" అందావిడ.

"అవునండీ... అందుకేమాత్రం సందేహం లేదు" తృప్తిగా చెప్పింది మాధవి.

ఫోన్ పెట్టేసి పక్కకు తిరిగేసరికి ధుమ ధుమలాడుతూ కనిపించాడు మాధవరావు.

"నీకు బుద్ధివుందా? మంచి భర్త దొరి కాడు అంటూ ఓ పొగిడేస్తున్నావ్. ఏమిటా మంచి గడమంచి? " అన్నాడు ఆగ్రహంగా.

"ఏదో మాటవరసకి అన్నాను. అయినా నేనన్నదాంట్లో తప్పేముంది. ఆయన మంచివాడుకాడా? " నిలదీసింది ఆవిడ.

"ఏం మంచి ఇంట్లో కూర్చుని ఆడంగి వెధవలా వంటలు చెయ్యడం కూడా గొప్పేనా? "

"వంటలే చేస్తాడో అంట్లే తోముతాడో ఆయనిష్టం. మధ్యలో మీకెందుకు? పనిగ ట్టుకుని ఆయన్ని పిల్చి వంటలు చెప్పమన డంలో ఏమిటి మీ ఉద్దేశ్యం? " దెబ్బలాటకి దిగింది.

అంతలోనే ఫోన్ మోగింది. విసురుగా ఫోనందుకున్నాడు మాధవరావ్. "హల్లో" అన్నాడు.

"నమస్కారం.... నేను మధుసూదన్‌ని మాట్లాడుతున్నాను. మీ శ్రీమతిగారు నన్నేదో అడగాలనుకున్నారుట కదా!" గంభీ రంగా వున్న ఆ కంఠం విని కాస్త తడబడి పోయాడు మాధవరావ్.

"అవునండీ ఇదుగో మాట్లాడండి" అంటూ ఫోన్ అందించాడు.

"క్షమించాలి ఇందాక మీరు ఫోన్ చేసిన పుడు కాస్త బిజీగా వున్నాను" మర్యాదగా చెప్పాడు.

"అబ్బే ఫర్వాలేదండీ" మొహమాట పడి పోయింది ఆవిడ.

"ఇంతకీ మీకే రెసిపీ కావాలి? "

తడబడిపోయింది. ఒక్కక్షణం ఆలోచించి "కాలీఫ్లవర్ మంచూరియా" అని చెప్పింది.

"ఓ అదా! చాలా సింపుల్. బైదిబై మీరు వెల్లుల్లి తింటారు కదా!" అడిగాడు.

"తింటాం!"

"అయితే సరే. వెల్లుల్లి ఇష్టపడని వాళ్ళు చైనీస్ వంటకాలు తలపెట్టకుండా వుంటే మంచిది. ఈ డిష్‌కి తాజా కాలీఫ్లవర్ కావాలి. నిలవదైతే బాగుండదు. వెల్లుల్లి, అల్లం, పచ్చిమిర్చి, సోయాసూప్, కార్న్‌ఫ్లోర్, అజినమోటో" అంటూ చెప్పుకుపోసాగాడు.

నోరూరించేలా తయారుచేసే విధానం చెప్పి ముగించాడు. "చేసి చూడండి. ఎలా కుదిరిందో చెప్తారు కదూ!" అనేసి ఫోన్ పెట్టేశాడు.

అతనితో మాట్లాడి దీర్ఘంగా నిట్టూర్చింది మిసెస్ మాధవరావ్. "దేనికైనా పెట్టిపు ట్టాలి. అంత చదువుకున్నా అన్నీ వచ్చు ఆయనకి. గర్వం కాస్తంతైనా లేదు. కొత్త మనిషితోనైనా ఎంత ఆప్యాయంగా మాట్లా డాడో. మీరూ వున్నారు ఎందుకూ? ఎంత సేపూ పుల్లవిరుపుగా మాట్లాడి ఎదుటివా రిని ఎలా బాధపెట్టాలా అని ఆరాటం తప్పించి ఇంకేమీ చాతకాదు. అతన్ని చూసి నేర్చుకోండి" అనేసి విసురుగా లోపలికి వెళ్ళి పోయింది.

తను విసిరిన రాయి తిరిగొచ్చి తన తల మీద పడి బొప్పికట్టేసరికి తెల్లబోయి తలప ట్టుకుని కూర్చున్నాడు మాధవరావు.

★ ★ ★

మాధవి ఇంటి ఎదురుగా వున్న ఇంటో ప్రభావతి అని ఒక ఇల్లాలు వుంది. ఆవిడ భర్త గవర్నమెంటులో పెద్ద ఆఫీసరు. బోలెడంత డబ్బుంది. మంచి ఇల్లు కట్టుకు న్నారు. ఆ ఇంట్లో పని చెయ్యడానికి పనిమ నిషి, వంటమనిషి, వాచ్‌మెన్, తోటమాలి వగైరా హంగులన్నీ అమర్చుకున్నారు.




దాంతో ఆవిడకి బొత్తిగా పనీపాటూ లేకుండా అయిపోయింది. పనిలేని వాడు పిల్లి తల గొరిగాడు అన్నట్లు ఆవిడకి ఏం చెయ్యాలో తోచక ఇరుగుపొరుగు ఇళ్ళవాళ్ళ మీద ఓ కన్నువేసి వుంచి వాళ్ళ వివరాలన్నీ సేకరించడం, అవి వాళ్ళకీవీళ్ళకీ చెప్పి తద్వారా వినోదం పొందడం అలవాటు చేసుకుంది.

ఆ కార్యక్రమంలో భాగంగా మాధవి ఇంటిమీద పడింది ఆవిడ కృపా కటాక్షం. వాళ్ళింట్లో పనిచేసే మనిషిని పిలిపించి కాఫీ ఇచ్చి మంచిచేసుకుని బోలెడు వివరాలు సేకరించింది. మీటింగు పెట్టి "చూశారా ఆ ఎదురింటి వింత. ఆ అమ్మాయికి పెద్ద ఉద్యోగం. ఆ మొగుడుగారేమో ఇంట్లోనే వుంటాడు. వంటావార్పు అతనే చేస్తాడుట. ఆదివారంనాడు కూడా ఆవిడ గుర్రెట్టి నిద్ర పోతుందిట. ఆయన టిఫిన్ చేసి నిద్రలేపు తాడుట. ఇద్దరూ కలిసి బయటికి సినిమాకి, షికారుకు వెళ్తారా! రాగానే ఆవిడ ఆ బట్టలు విప్పి విసిరేస్తుందిట. ఆయన మర్నాడు అవన్నీ మడతలు పెడతాడుట" అంటూ చెప్పుకుని ఆనందపడుతుంది.

వాళ్ళంటే ఆవిడకి చిన్నచూపు. ముఖ్యంగా మధు అంటే తేలికభావం. అత న్నెలాగైనా ఏడిపించాలని ఆవిడకి సరదా. ఒకరోజు ఆ అవకాశం వచ్చింది.

చీరెలవాడు వచ్చాడు. వెంకటగిరి, పాటూరు, గద్వాలు మొదలైన చీరెలు తెచ్చి వాయిదాలపద్ధతిన అమ్ముతూ వుంటాడు. అందరూ కొంటారు అతని దగ్గర. ఆవేళ మామూలుగా వచ్చాడతను. ఆవిడకి మెరుపులాటి ఆలోచన వచ్చింది. ఎదురింటికి వెళ్ళి మధుని పిల్చి చీరెలు కొంటారా అని అడిగితే అతని మొహం మాడిపోతుంది. ఆ సుందర దృశ్యం ఊహించుకుంటేనే ఒళ్ళు పులకరించిపోయింది. అందుకే ఆ ఆలోచన అమల్లో పెడుతూ ఒక్క పరుగున ఎదురింటికి వెళ్ళి కాలింగ్ బెల్ నొక్కింది.

సితార్ ప్రాక్టీస్ చేస్తున్న మధు లేచి వచ్చి తలుపు తీశాడు.

"నమస్కారం నా పేరు ప్రభావతి. నేను మీ ఎదురింట్లో వుంటాను" అంటూ పరిచయం చేసుకుంది.

"అవునండీ... నేను మిమ్మల్ని చూశాను" అన్నాడు మధు.

"ఈ వీధిలోకి చీరెలవాడు వస్తాడండీ. పాటూరు, వెంకటగిరి అన్నిరకాల చీరెలు తెస్తాడు. ఇక్కడ ఇంట్లో వుండే ఆడవాళ్ళం అందరం తీసుకుంటూ వుంటాం. మీరూ ఇంట్లోనే వుంటారుగా. చూస్తారేమో అని అడిగాను" అంది ప్రభావతి.

"అలాగా! చీరెలు బాగుంటాయా? మన్నికగా వుంటాయా?" అడిగాడు మధు. ఆవిడ కాస్త గతుక్కుమని అంతలోనే సర్దుకుంది. "చాలా బాగుంటాయి. మేము ఎప్పటినించో తీసుకుంటున్నాం" చెప్పింది.

"అయితే పంపించండి. చూస్తాను" అన్నాడు.

అలా పంపిస్తే తనకోరిక ఎలా నెరవేరుతుంది. అతడ్నే రమ్మంటే అంతమంది ఆడవాళ్ళ మధ్య అతను ఇబ్బందిగా మొహమాటంగా కూర్చుంటే మరో నాలుగు మాటలని అతడిని ఏడిపించే అవకాశం వుంటుంది, అందుకే.

"అలా ఇంటింటికీ రాడండీ. మా ఇంట్లో మూట విప్పాడు. అక్కడికే వచ్చి తీసుకోవాలి. అందరం అలాగే తీసుకుంటాం. మీరూ అక్కడికే రండి" అంది.

"అలాగా! అయితే అక్కడికే వస్తాను. ఇల్లు తాళంవేసి వస్తాను. మీరు పదండి" అన్నాడు మధు. ఆవిడ పరుగున వచ్చేసి మిత్రురాళ్ళందర్నీ సమాయత్తం చేసేసింది.

పావుగంట తర్వాత దర్జాగా వచ్చాడు మధు. అందరినీ చూసి పలకరింపుగా నవ్వాడు. అందర్నీ పరిచయం చేసింది. అందరికీ వినయంగా నమస్కారంచేశాడు. ఏవేవో ప్రశ్నలు వేశారు. చక్కగా సమాధా

నాలు చెప్పాడు.

ఆ తర్వాత చీరెలు పరిశీలించడంలో మునిగిపోయాడు. నాణ్యత, ధరల విష యంలో అతనికి వున్న అవగాహన కని పెట్టి కాస్త ఖంగుతిన్నాడు ఆ చీరెలవాడు. ఆడ వాళ్ళముందర ప్రదర్శించే ట్రిక్కులు ఇతని ఎదుట చెల్లవని అతనికి అర్థంఅయిపో యింది.

చీరలన్నీ క్షుణ్ణంగా పరిశీలించి మూడు చీరెలు ఎంచి పక్కన పెట్టాడు మధు. వీటి ధర చెప్పమన్నాడు. బదులుగా అతను చెప్పిన ధరను విని నవ్వేశాడు. వాయిదాల పద్ధతి వద్దు. ఇప్పుడే మొత్తం ఇచ్చేస్తాను. ఎంతకిస్తావో చెప్పు అని ఖచ్చితంగా బేరం ఆడి బాగా తగ్గించి సెటిల్ చేసి ఇంటికొచ్చి డబ్బు తీసుకుపో అని చెప్పి చీరెలు తీసు కుని లేచాడు. "వెళ్ళొస్తానండీ థాంక్స్" అన్నాడు.

అప్పటిదాకా నోరావలించి అతడి వ్యవ హారం గమనిస్తున్న ఆడవాళ్ళంతా ఇహ లోకంలోకి వచ్చారు. "బాగుంది మీ సెల క్షన్. మీ ఆవిడకి బాగా నప్పుతాయి" అంది ఒకావిడ.

"ఇవి మా ఆవిడకి కాదండీ. రెండు మా అక్కకోసం. ఒకటి మా అమ్మకి" అని చెప్పి అక్కడినించి వచ్చేశాడు.

ప్రభావతి బుగ్గలు నొక్కుకుంది. "చూశారా చూశారా ఎంత అన్యాయమో. అంత డబ్బుపోసి చీరెలు కొన్నది తన తల్లి కోసం, తోడబుట్టిన దానికోసంట" అని వాపోయింది.

అమ్మలక్కలు అందరూ కూడా బాధప డ్డారు." సొమ్ము ఒకడిది సోకుఒకడిది అంటే ఇంతే. పాపం ఆ అమ్మాయి కష్టపడి సంపా దిస్తుంటే తేరగా తినడమేకాకుండా ఇలా ఖర్చుచేస్తున్నాడు. అంతేనమ్మా దిక్కుమా లిన మొగజాతి" అనుకుని నిట్టూర్చారు.

ఆ రాత్రి మాధవికి తీసుకొన్న చీరెలు చూపించాడు మధు. అదోలా నవ్వింది మాధవి. సెలక్షన్‌ని మెచ్చుకుంటూనే అంత దూరం అమెరికాకి ఇక్కడినించి చీరెలు తీసి కెళ్ళడాన్ని ఆక్షేపించింది.

"ఇదో అలవాటు మధూ. అవీఇవీ అంటూ సామాన్లు పోగేసి ఎద్దంత సూట్ కేసులు ఈడ్చుకుంటూ చెమటలుకక్కుతూ తిరిగే వాళ్ళను చూస్తే జాలి వేస్తుంది నాకు.

"ఇక్కడి సామాన్లు అక్కడికి తీసుకు పోయి, మళ్ళీ అక్కడినించి ఇక్కడికి మోసు కొచ్చి ఎందుకీ అవస్థ? డబ్బు పెడితే ఎక్క డైనా అన్నీ దొరికే అవకాశం వున్నప్పుడు బహుమతులుగా ఆ డబ్బే ఇస్తే సరిపోదా" అంది.

సూటిగా చూసి నవ్వేశాడు మధు. "ఒక విధంగా ఆలోచిస్తే నువ్వు చెప్పింది అక్ష రాలా నిజమే. ఇదంతా శ్రమతో కూడిన పని. డబ్బు ఇచ్చేస్తే వాళ్ళకి నచ్చినది వాళ్ళు కొనుక్కుంటారు. సూక్ష్మంగా తేలిపోతుంది. మనకు అంతగా పరిచయంలేని దూరపు బంధువులకూ, మిత్రులకూ ఫంక్షన్స్ అయి నపుడు ఈ పద్ధతి నిజంగా ఆచరణయో గ్యమే కాదనను. కానీ ఆత్మీయుల విష యంలో మాత్రం ఆ పద్ధతి సరైనదికాదు. వాళ్ళ అభిరుచి, మనసు, స్పష్టంగా తెలిసిన ప్పుడు డబ్బు రూపంలో ఇచ్చేకన్నా మనకు తోచిన కానుక వారికి నచ్చే రీతిలో ఎంచి అందజేస్తే ఆ ఆనందం వేరు. ఇప్పుడు ఈ చీరెలు వున్నాయి చూడూ. నిజానికి మా అక్కయ్యదగ్గర కోకొల్లలుగా చీరెలున్నాయి. వీటి అవసరం దానికి లేదనే చెప్పాలి. కానీ ఇలా పంపించామనుకో మురిసిపోతుంది. నా తమ్ముడు, మరదలు నన్ను గుర్తుంచు కుని నాకిష్టమైన చీరెలు పంపారు అని అందరితో చెప్పుకుంటుంది.

కాస్తంత డబ్బు వెచ్చించి కాస్త శ్రమప డినా ఆత్మీయతని పెంచి మనుషులు దూరాన వున్నా, మనసులు దగ్గరపడడానికి దోహదం చేస్తాయి ఈ కానుకలు.

ఇక మా అమ్మ విషయం. ఏ ఆడదైనా కొడుకు పెళ్ళయ్యాక వంటరితనం అనుభవిస్తుంది. పైకి చెప్పకపోయినా మనసులో ఏ మూలో ఇక నా కొడుకు నన్ను మర్చిపోతాడు అనే భావన దాగివుంటుంది. అటువంటి అపోహలను దూరం చెయ్యాలంటే ఇటువంటి చిన్నచిన్న జాగ్రత్తలు తీసుకోవడం ఎంతైనా అవసరం.

"అందుకే వాళ్ళిద్దరికోసం ఈ చీరెలు కొన్నాను" అన్నాడు. "నిజమేసుమా! ఈ ఏంగిల్ లో నేను ఏనాడూ ఆలోచించలేదు. మా అక్క నాకు ఎప్పుడూ డబ్బే ఇచ్చేది. నేనూ వాళ్ళకి డబ్బే ఇచ్చేదాన్ని. మమ్మీ, డాడీ కూడా అంతే. అదే మా అందరికీ అలవాటు అయిపోయింది. ఈసారి నేను కూడా ఏమైనా బహుమతులు కొంటాను" అంది మాధవి.

తల్లికీ, అక్కకీ ఖరీదైన చీరెలు కొన్న విషయం భార్యదగ్గర దాచాడేమో లేక చెప్తే హత్తేరీ నాకెందుకు కొన్లేదు అని మాధవి దుమ్మెత్తి పోసిందేమో. అసలేం జరిగిందో తెలుసుకోవాలని సమయంకోసం కనిపెట్టుకుని కూర్చుంది ప్రభావతి. మధు ఊళ్ళో లేడని, గుంటూరు వెళ్ళాడని తెలుసుకుని మాధవి ఆఫీసునించి రాగానే పనిగట్టుకుని వెళ్ళింది వాళ్ళింటికి.

అలిసిపోయి ఇంటికొచ్చిన మాధవికి భర్త లేనిలోటు కొట్టొచ్చినట్లు కనిపించింది. అటువంటి సమయంలో ఎదురింటావిడ రాక ఆనందం కలిగించింది. ఆదరంగా ఆహ్వానించి కూల్ డ్రింక్ అందించింది.

"మీ ఆయన లేరా అమ్మా" అని అడిగింది ప్రభావతి ఏమీ ఎరగనట్లే.

"లేరండీ... గుంటూరు వెళ్ళారు. మా అత్తగారు అమెరికా వెళ్తున్నారు" చెప్పింది మాధవి.

"అమెరికా ఎందుకమ్మా" అడిగింది కుతూహలంగా.

"వాళ్ళ అమ్మాయికి డెలివరీ. హెల్ప్ కి వెళ్తున్నారు. ఈ ఆదివారం ఫ్లైట్. మళ్ళీ నాలుగునెలలదాకా రారు కదా. వాళ్ళ అమ్మగారి దగ్గర నాలుగురోజులుండి వస్తానని వెళ్ళారు. ఆయనకి వాళ్ళ అమ్మగారంటే చాలా ఇష్టం" చెప్పింది మాధవి.

"అవును... నేనూ గమనించానావిషయం. నీకు చెప్పాడోలేదో ఆమధ్య చీరెలవాడొస్తే బోలెడంత డబ్బుపోసి తల్లికీ, అక్కగారికీ చీరెలు కొన్నాడు మీ ఆయన!" చెప్పింది ప్రభావతి.

మాధవికి చిరాకువేసినా అణుచుకొని "నాకు చూపించారు. చాలా బాగున్నాయి" అనేసింది.

ఆవిడ గతుక్కుమని అంతలోనే సర్దుకుంది. "పోనీ కొన్నాడే అనుకో. నీకోసం కూడా కొనొచ్చుగా? మీ అమ్మకోసం కొనొచ్చుగా? తన వాళ్ళమటుకే కొనడం వుంది చూశావూ నీకేమోగానీ నాకెంత మాత్రం నచ్చలేదమ్మా" అంది ఆదరంగా.

నవ్వాపుకుని గంభీరత నటించింది మాధవి. కాసేపు కాలక్షేపం అనుకుంది. పైకి మాత్రం "నిజమే సుమండీ! నాకాఆలోచనే రాలేదు" అంది.

"ఎలా వస్తుందమ్మా? నువ్వు అమాయకురాలివి. నీ ఉద్యోగం ఏమో నీలోకం ఏమో అన్నట్లు వుంటావు. ఇంటి పెత్తనం అంతా ఆయనదే. ఇక అడ్డేం వుంది? ఆయన ఆడింది ఆట పాడింది పాట" అంటూ మొదలుపెట్టి జ్ఞానబోధ చేసి ఏదైనా అవసరంవస్తే నా దగ్గరికిరా అని హామీ ఇచ్చి తృప్తిగా వెళ్ళిపోయింది.

ఆవిడ వెళ్ళాక తనివితీరా నవ్వుకుంది మాధవి. ఆ రాత్రి గుంటూరు ఫోన్ చేసింది. భారతే రిసీవ్ చేసుకుంది. "నువ్వు పంపిన చీరె చాలా బాగుంది మాధవీ. అయినా ఇప్పుడెందుకు పంపించావమ్మా?" అంది ఆప్యాయంగా. ఆవిడతో కాసేపు మాట్లాడిన తర్వాత మధు లైన్ లోకి వచ్చాడు.

"ఎలావున్నావ్?" అని అడిగాడు.

"నాకేం బ్రహ్మాండంగా వున్నాను. ఇవ్వాళ నాకు జ్ఞానోదయం కలిగింది" అంది సీరియస్‌గా.

"అబ్బా! నిజంగానే! ఏమిటో అంత జ్ఞానోదయం?" అడిగాడు.

"నేను అసలే అమాయకురాలిని. అది అలుసుగా తీసుకుని నువ్వు పెత్తనం చెలాయిస్తున్నావు. ఇలా లాభంలేదు. ఊర్నించి రాగానే నిన్ను అదుపులో పెట్టాలి. నిన్ను బాగా కోప్పడి నా చెప్పుచేతల్లో పెట్టుకోవాలి. లేకపోతే అదుపుతప్పిపోతావు" ఖచ్చితంగా చెప్పేసింది.

"అబ్బా! నిజంగానే జ్ఞానోదయం కలిగింది నీకు. బైదిబై నీకు అంత జ్ఞానం బోధించిన పుణ్యాత్ములెవరో తెలుసుకోవచ్చా" అడిగాడు.

"ఎవరైతేనేం? ఎవరో ఇరుగు పొరుగు వాళ్ళు" వివరంగా చెప్పింది.

"సరే... అయితే నేను రాగానే నాకు నీ చేతుల్లో సన్మానం వుందన్నమాట?" భయంభయంగా అడిగాడు.

"అలాటిలాటి సన్మానంకాదు. ఘన సన్మానం!" హామీ ఇచ్చింది.

కాసేపు కబుర్లు చెప్పుకున్నాక ఆదివారం మెద్రాస్ వస్తాను. అని చెప్పింది. చెప్పింది గానీ వెళ్ళటం కుదరలేదు. అర్జెంటుపని వచ్చిపడింది. తల్లిని విమానం ఎక్కించి తిరుగుమొహం పట్టాడు మధు. తండ్రిని తనతో రమ్మన్నాడు. కానీ ఆయన వేరే పన్లున్నాయి తర్వాత వస్తానని వాయిదా వేయటంతో ఒంటరిగా ఇల్లు చేరుకున్నాడు.

★ ★ ★

టెక్సాస్ చేరాక ఫోన్ చేసింది భారతి. ప్రయాణం బాగానే జరిగిందని చెప్పింది. అక్కడ వాతావరణం బాగా కొత్తగా వుందని చెప్పింది.

తర్వాత నీరజ చాలాసేపు మాట్లాడింది. వాళ్ళు పంపించిన చీరెలు చాలా బావున్నాయని మెచ్చుకుంది. తన ఆరోగ్యం బాగానే వుందని చెప్పింది.

చివరిగా సుధాకర్ మాట్లాడాడు. దంపతులని అమెరికా రమ్మనాడు. తను ఇండియా వచ్చినప్పుడు మధు, మాధవిలతో నాలుగురోజులు గడుపుతానని మాట ఇచ్చాడు. ఆ తర్వాత కొత్తకాపురం ఎలా వుందని బావమరిదిని కాసేపు ఏడిపించి వదిలాడు.

భార్యద్వారా ఎదురింటి ప్రభావతిగారి ప్రహసనం విన్నాక మధుకి చిర్రెత్తుకొచ్చింది.

"పోనిద్దూ ఆవిడ స్వభావం అది" అనేసింది మాధవి తేలిగ్గా తీసేస్తూ.

కానీ మధు మాత్రం అలా తీసిపారెయ్యలేదు. నీకు తెలీదు మధూ. ఇలాంటివారికి కీలెరిగి వాతపెట్టాలి. లేకపోతే ఇలాగే వచ్చి ఏవిటేవిటో మాట్లాడిపోతుంటారు. ఇలాంటివారి కారణంగానే చాలా కుటుంబాలకి కలతలు ఏర్పడేది అన్నాడు.

ఆ తర్వాత ప్రభావతిగారూ ఆవిడ భర్త కలిసి మాట్లాడుకునే సమయం కనిపెట్టి పనిగట్టుకు వెళ్ళి,

"అక్కయ్యగారూ! మీరిలా మా ఆవిడకి చెప్పారుటగా. ఆవిడ ఎప్పుడూ పంజాబీ డ్రెస్‌లే వేసుకుంటుందండీ అందుకే మా ఆవిడకి కొన్లేదు. మా అమ్మకీ, అక్కకీ మాత్రం కొన్నాను. పాపం మీరేదో వూహించుకుని చాలా బాధపడ్డారుటకదా! ఇక ముందు ఇలాంటి అనుమానంగానీ వస్తే నేరుగా నన్నే అడిగి తెలుసుకోండి" అన్నాడు అతి మర్యాదగా!

ఆవిడ మొహం మాడిపోయింది. అసలు విషయం ఏమిటో అర్థంగాక తెల్లమొహం వేసిన ఆవిడ భర్తకు అంతా వివరించి చెప్పి మరీ వచ్చేశాడు మధు. ఆ తర్వాత ఆయన ప్రభావతిని బాగా చీవాట్లు వేశాడు.

"ఇదా నువ్వు రోజంతా కూర్చుని చేసే నిర్వాకం. ఊళ్ళోవాళ్ళ గోల నీకెందుకు.



ఇంకోసారి ఇలాటి వెధవపన్లు చెయ్యకు" అని వార్నింగ్ ఇచ్చాడు.

దాంతో థారెత్తి వీళ్ళజోలికి రావడం మానేసింది ప్రభావతి.

మాధవి, మధుసూదన్‌ల సంసారం పూలనావలా సాగిపోతోంది. ఆర్నెల్లు ఇట్టే గడిచిపోయాయి. కూతురి సంసారం ఎలా వుందో చూడాలని కోరికతో ఇటువైపు ప్రయాణం పెట్టుకున్నారు భానుప్రతాప్ దంపతులు.

ఫోన్‌ద్వారా వారి ప్రోగ్రాం తెలుసుకుని వెంటనే ఇంటికి ఫోన్ చేసి చెప్పింది మాధవి. ఎగిరి గంతువేశాడు మాధవ్. "మమ్మీ, డాడీ వస్తున్నారు. మనకు కావలిసినంత కాలక్షేపం. పన్లోపని డాక్టర్లని కూడా రమ్మంటే బాగుంటుంది. అందరం కలిసి సరదాగా గడపొచ్చు" అన్నాడు. అక్కతో మాట్లాడుతాను అంది మధు.

పెళ్ళయిన కొత్తల్లో మీ అమ్మ మా మమ్మీ! మీ డాడీ మా నాన్న అని మాట్లాడుకుంటూ విసుగువేసింది ఇద్దరికీ. ఛ ఛ ఇలా బాగాలేదు ఈ మీ మా అనుకుంటూ వుంటే ఏదోలా వుంది. అని ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చారు.

మాధవికి తల్లిదండ్రులని చిన్నప్పటినించి మమ్మీ డాడీ అని పిలవడం అలవాటు. అందుకని మధు కూడా అదే అలవాటు చేసుకున్నాడు. అలాగే మధు అలవాటు ప్రకారం అమ్మా నాన్నా అంటుంది మాధవి. ఇకపోతే సుమిత్ర డాక్టర్ అక్క అయితే నీరజ అమెరికా అక్క. ఆ ఏర్పాటు చేసుకున్న తర్వాత హాయిగా వుంది.

అమ్మ అమెరికానుండి ఫోన్ చేసింది. డాడీకి ఈమధ్య జ్వరం వచ్చి తగ్గిందిట అంటూ మాట్లాడుకోవడంతో మీ మా ఎగిరిపోయాయి.

తమ పెళ్ళయ్యాక మొదటిసారి తమ ఇంటికి వస్తున్న అత్తమామలకోసం తగిన ఏర్పాట్లు చేస్తూ యమబిజీగా వున్నాడు మధు. బెడ్‌రూమ్‌ను నీట్‌గా సర్దించాడు. ఇంట్లోకి కావలసిన సరుకులన్నీ తెచ్చి నిలవచేశాడు. ఏది కావాలన్నా బజారుకి పరిగెట్టే పని పడకుండా ముందే జాగ్రత్తపడ్డాడు.

అనుకున్న ప్రకారం వచ్చారు భానుప్రతాప్, భవానీ. స్టేషన్‌కి వెళ్ళి రిసీవ్ చేసుకున్నారు మధు అండ్ మధు. అందరూ ఇంటికి వచ్చారు.

ఇల్లు చూసి సంబరపడిపోయింది భవాని. "పెళ్ళయ్యాక నీకు బాగా స్థిరత్వం వచ్చింది బేబీ. అదివరకు నీ రూమ్‌లో అడుగుపెట్టాలంటే భయం వేసేది" అంది.

"ఈ ప్రతిభ అంతా మీ అల్లుడిది. నేను ఏమీ మారలేదు" చెప్పేసింది మాధవి.

ఆశ్చర్యపోయింది ఆవిడ. "నలుగురు పనివాళ్ళు సర్దుతూవున్నా మా ఇల్లు కూడా ఇంత అందంగా శుభ్రంగావుండదు. అద్దంలా వుంది మీ ఇల్లు" అని మెచ్చుకుంది.

అద్దంలా వున్న కూతురి ఇంటిని మెచ్చుకుని ఆనందపడిన భవానికి అల్లుడు వంట చేసి బల్లమీద సర్దిపెట్టడం, తమకు కాఫీలు అందించడం చూసి పచ్చి వెలక్కాయ గొంతున పడినట్లు అయింది. దానికి సాయం కూతురు కూడా తమతోబాటు కూర్చుని కబుర్లు చెప్తూ కాఫీ తాగుతూ వుండడం చూసి చచ్చేంత మొహమాటపడిపోయింది.

భర్తతో చెప్పుకుని వాపోయింది. "బేబీతో చెప్తే అది తేలిగ్గా కొట్టిపారేసింది. మమ్మీ కాఫీ కావాలా మమ్మీ టిఫిన్ తినండి అని అల్లుడు బలవంతంచేస్తుంటే నా ప్రాణం చచ్చిపోతోంది" అని.

ఆయనకు మాత్రం చీమకుట్టినట్టుకూడా లేదు. ఆయనకి అల్లుడు ఎంతో నచ్చేశాడు. ఇంటికి రాగానే కాఫీ కావాలా, మజ్జిగ తాగుతారా అని చాదస్తాలు పోకుండా చక్కగా మగ్‌నిండా చల్లని బీరు తెచ్చి ఇచ్చాడు.




బంగారు నాయన. ఇలాటి అల్లుడు ఏడుజన్మల పుణ్యం చేసుకుంటేగానీ దొరకడు అనుకున్నాడు.

"మనం వున్న నాలుగు రోజులైనా అది శెలవుపెట్టి ఇంట్లో వుంటే బాగుండు. చెప్తే వినేరకమా ఏమైనానా? మొండి ఘటం" అంటూ పన్లో పని కూతుర్ని కూడా విసుక్కుంది.

"ఇలాటి పిచ్చి సలహాలు చెప్తే ఎవరు వింటారు? దాని ఉద్యోగం, దాని ఇల్లు, దాని భర్త, దాని ఇష్టం

"అల్లుడు కష్టపడిపోతున్నాడని బాధగా వుంటే నీకు చాతనైన సహాయం చెయ్యి" అని సలహా ఇచ్చాడాయన.

ఆ సలహా ఆవిడకి నచ్చింది. మర్నాడు మనస్ఫూర్తిగా సాయం చేద్దామని వంటింట్లోకి వెళ్ళింది. కానీ అది సాధ్యం కాలేదు. ఆవిడకి ఏ పన్లూ చేతకావు. చిన్నతనంలో తండ్రి పెద్దపోలీసాఫీసరు. పెళ్ళయ్యాక ఆర్మీ ఆఫీసరుతో కాపురం. ఆడ జన్మ ఎత్తాక మరీ బొత్తిగా పన్లు రాకపోతే ఎలా? రేపు రిటైరు అయ్యాక ఏం చేస్తావు అని అయినవాళ్ళు చెప్పిచెప్పి విసుగేసి వూరుకున్నారు. అల్లుడికి అయిదు నిముషాలు సాయంచేసేసరికి తను సాయంచేసి అతడికి ఇబ్బంది కలిగించడంకంటే వూరుకోవడం ఉత్తమం అనిపించి అక్కడినించి వచ్చేసింది.

వారంరోజులు చాలా సరదాగా గడిచిపోయాయి. హోటల్ భోజనాలు, షాపింగులు, సందడేసందడి. మరోవారం రోజులుండి వెళ్ళిపోతారు భానుప్రతాప్ దంపతులు. ఆవేళ భవానికి కొంచెం నలతగావుంది. ఆవిడకి అప్పుడప్పుడు మోకాళ్ళ నెప్పి వస్తూ వుంటుంది. మందులు వేసుకుంటుంది. ఆ నెప్పి వచ్చినప్పుడు ఒకటి రెండురోజులు నడవడానికి కాస్త ఇబ్బంది పడుతుంది. ఆ తర్వాత తగ్గిపోతుంది.

"అటూఇటూ తిరగడంవల్ల కాలునెప్పి వచ్చింది. బుద్ధిగా మందేసుకుని విశ్రాంతి తీసుకో. ఊరికే పదిసార్లు మేడక్కి దిగకు" అని చెప్పి వెళ్ళింది మాధవి.

పొద్దున పదకొండు గంటలు అయింది. వంట మొదలు పెట్టాడు మధు. మామగారికి ఇష్టం అని గుత్తొంకాయ కూర, ముక్కల పులుసూ వంటివేవో వండాలని ప్లాన్‌వేశాడు. ఆ సమయంలో కాఫీ తాగడం అతనికి అలవాటు. మామగారు, అత్తగారూ కూడా తాగుతారేమో అడుగుదామని వెళ్ళాడు.

ఆయన హాల్లో కూర్చుని టి.వి. చూస్తున్నాడు. ఆయన్ని అడిగి తర్వాత మేడమీద బెడ్‌రూమ్‌లోకి వెళ్ళాడు. మంచంమీద పడుకుని ఏదో పుస్తకం ముందు పెట్టుకుని వుంది భవాని. "మమ్మీ కాఫీ తాగుతారా?" అని అడిగాడు. ఏదో పరాగ్గా వున్నదల్లా అతని పిలుపుకి ఉలిక్కిపడింది. "వద్దు మధూ!" అంది. కిందికి వచ్చేశాడు మధు. దిగులుగా వున్న భవాని వదనం, ఆవిడ దాచుకోవాలన్నా దాగని బాధ కనిపెట్టిన మధుకి తక్షణ కర్తవ్యం ఏమిటో తెలిసింది. ఆ కఠినమైన వంటకాలు చేసే పని విరమించి అయిదునిముషాల్లో చారు పెట్టేసి బియ్యం రైస్ కుక్కర్‌లో పడేసి రెండు కప్పుల కాఫీ, ఒక కప్పులో బోర్నవిటా కలిపి వంటింట్లోంచి బయటపడ్డాడు.

మామగారికి కాఫీ ఇచ్చి మేడమీదికి వెళ్ళాడు. "మమ్మీ! ఇదుగో కాస్త బోర్నవిటా తాగండి" అంటూ కప్పు అందించి మంచం పక్కనే కుర్చీలాక్కుని తీరిగ్గా కూర్చున్నాడు.

"మమ్మీ! నాకు బోరుగా వుంది. ఏమైనా కబుర్లు చెప్పండి" అన్నాడు.

"నేనా? ఏం కబుర్లు చెప్పను" అడిగింది భవాని.

"ఏమైనా సరే. మీ చిన్నప్పటి విశేషాలు చెప్పండి. మీరు స్టూడెంట్‌గా వున్నప్పటి కబుర్లు చెప్పండి" అన్నాడు.

అప్పటివరకూ దిగులుగా వున్న భవాని



మొహంలోకి కళ వచ్చింది. "నా చిన్నతనం కబుర్లా? ఏనాటి మాట? ఎప్పటి చిన్న తనం?" అంటూనే మొదలుపెట్టి స్కూల్లో ఇంగ్లీషు మాస్టార్ని ఎలా ఏడిపించిందీ, తర్వాత కాలేజీలో కెమిస్ట్రీ లాబ్‌లో ఎలా అల్లరి చేసిందీ. ఎన్.సి.సి. మాస్టార్ని ఎంత ఏడిపించుకుని తిన్నదీ చెప్పుకుంటూ పోయింది.

ఒక సంఘటన తర్వాత మరో సంఘటన. పరిసరాలు మరచిపోయి గతంలోకి వెళ్ళిపోయింది. చిన్నపిల్లలా సంబరాలు పడుతూ చెప్తూవుంటే సరదాగా వింటూ వుండి పోయాడు మధు.

గడియారం సంగీతం పాడి ఒంటిగంట కొట్టేసరికి ఉలిక్కిపడింది భవాని. "ఇదేమిటి ఒంటిగంట అయిందా? టైమే తెలీలేదు. మీకు అవతల బోలెడంత పని వుందేమో" అంటూ బాధపడిపోయింది.

"ఫర్వాలేదు మమ్మీ. మీతో తీరిగ్గా కబుర్లు చెప్పాలని వంట తేలిగ్గా ముగించేశాను" అన్నాడు.

"రోజూ మాట్లాడుకుంటూనే వున్నాంగా. ఇవ్వాళ ప్రత్యేకంగా నాతో మాట్లాడాలని ఎందుకు అనిపించింది? ఏమైనా చెప్పాలా నాతో" అనుమానంగా అడిగింది.

"అబ్బే అదేంకాదు మమ్మీ. మీకు ఒంట్లో బాగాలేదు. వంటరిగా వుంటే మరీ విసుగ్గా వుంటుందేమో, వంట త్వరగా ముగించేసి కాసేపు దగ్గర కూర్చుందాం అనిపించింది. చారూ, అన్నం వండేశాను. ఊరగాయలు వుండనే వున్నాయి. ఒక్కపూటకి ఎలాగో సర్దుకుందాం" అన్నాడు ఆదరంగా.

భవాని కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. నిజమే మామూలు సమయాలలో ఎలా వున్నా ఇలా నలతగా వున్నపుడు ఎవరైనా కాసేపు దగ్గర కూర్చుంటే బాగుండుననిపిస్తుంది. మగవారికీ, పిల్లలకూ అనారోగ్యం వస్తే ఇల్లాలు కనిపెట్టుకుని వుంటుంది. కానీ ఆడవారికా అదృష్టం వుండదు. భవానికీ అంతే. మందువేసుకో, విశ్రాంతి తీసుకో అని రెండు ముక్కలు చెప్పేసి ఎవరి పనుల్లో వారు మునిగిపోతారు. అలాటి సమయాలలో ఎంత సర్దుకున్నా మనసు చివుక్కుమంటుంది. వంటరితనం భూతంలా భయపెడుతుంది. ఏ పుస్తకమో చదువుకుంటూ మనసు కుదుట పరుచుకుంటుంది. అది ఆవిడకి అలవాటే.

అలాటిది ఇవ్వాళ అల్లుడు తన వంటరితనం కనిపెట్టి పని త్వరగా ముగించుకుని వచ్చి దగ్గర కూర్చుని ఆప్యాయంగా మాట్లాడేసరికి పట్టరానంత సంతోషం కలిగింది.

"మధూ. నీకో మాట చెప్పనా! నాకు మొదట్నించీ కొడుకులంటే ఎంతో ఇష్టం. కొడుకు కావాలని నేను మొక్కని దేవుడు లేడు. రెండుసార్లూ నిరాశే కలిగింది. కూతుళ్ళంటే నాకేం తేలికభావంలేదు. వాళ్ళని నా ప్రాణంతో సమంగా చూసుకుంటూ వున్నా ఆ లోటు మిగిలిపోయింది. నా తోటివారు మా అబ్బాయి మా అబ్బాయి అని గర్వంగా చెప్పుకుంటూ వుంటే నాకో కొడుకుంటే నేనూ గొప్పలు చెప్పుకునే దాన్నికదా అనిపించేది.

"మా పెద్దమ్మాయి పెళ్ళయింది. అన్నిటా వారిదే పైచేయి. మా పెద్దల్లుడు చాలా మంచివాడు. అందులో ఏమాత్రం సందేహంలేదు. ఎటొచ్చీ ఆయనకు కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి. ఆడపిల్లకు పెళ్ళిచేసి పంపించాక ఇక పూర్తిగా బాధ్యత తీరిపోయినట్లు భావించాలంటాడు. పదిరోజులు మా ఇంటికి పంపమన్నా ఆయనకి ఇష్టంవుండదు. మేము వెళ్ళి అక్కడున్నా అతనికి నచ్చదు. మళ్లీ తన తల్లి అంటే పంచప్రాణాలూను, అమితగౌరవం.

"అదంతా చూసి నేనూ కొడుకు తల్లినైతే నాకూ కొంత గౌరవం, అధికారం వుండేవి కదా అనిపించేది. తర్వాత బేబీ పెళ్ళి నిశ్చయం అయింది. మీ అమ్మగారు మీ గురించి ఎంతో మంచిగా చెప్పారు. కష్టం

సుఖం తెలిసిన మనిషి. అమృతంలాటి మనసు వాడిది అని గర్వంగా చెప్పారు.

"ఆవిడ మాటల్లో ఎంత మాత్రం అతిశ యోక్తి లేదని ఇక్కడికి వచ్చాక తెలుసుకు న్నాను. ఇవ్వాళ నా వంటరితనం కనిపెట్టి నీ పని మానుకుని నా దగ్గర వచ్చి కూచు న్నావు. నిజం చెప్తున్నాను. ఇవ్వాళ నాకెంతో తృప్తిగా వుంది. నాకూ ఒక కొడుకు వున్నాడనే భావన కలుగుతోంది" అంది కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

ఆదరంగా ఆవిడ చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు "మీకు నేను కొడుకునే కదా మమ్మీ. తెలుగులో అల్లుడని అనేశారుగానీ ఇంగ్లీషులో చూడండి ఎంచక్కా సన్‌ఇన్‌లా అని చెప్పారు. అంటే న్యాయంగా కొడుకు అనేగా అర్థం. మీరిలా నన్ను కొడుకుగా భావించడం నా అదృష్టం.

"అల్లుడంటే దశమగ్రహం అనకుండా కొడుకునంటున్నారు. ఎవరికైనా ఒక అమ్మ వుంటుంది. అదే మహాభాగ్యం. అటువం టిది ఇద్దరు అమ్మలుంటే ఆ అదృష్టం వేరే చెప్పాలా? కోటికి ఒకడికి పడుతుందా అదృష్టం" అన్నాడు మధు.

ఆ రాత్రి భార్యతో జరిగినది అంతా చెప్పాడు మధు.

"అదన్నమాట సంగతి. అమ్మ ఎందుకో చాలా సంతోషంగా వుందే అనుకున్నాను. ఆవిడ చెప్పింది అక్షరాలా నిజం మధూ. మా ఇంట్లో ఎవరికి వాళ్ళం మెకానికల్‌గా వుండడం అలవాటు అయిపోయింది. అంత వరకూ ఎందుకు? మమ్మీకి ఒంట్లో బాగాలే దని నాకు తెలుసు. పొద్దున వెళ్తూ జాగర్త, రెస్ట్ తీసుకో అనేసి వెళ్ళిపోయాను. ఆ తర్వాత ఫోన్ చేసి మాట్లాడాలని కూడా నాకు తోచలేదు. పోన్లే. ఇన్నాల్టికి ఆ లోటు నువ్వు తీర్చేశావు నాకు చాలా సంతోషంగా వుంది" అంటూ ఆనందపడిపోయింది మాధవి.

మరో వారంరోజులు గిర్రున తిరిగి వచ్చాయి. భానుప్రతాప్ దంపతులు తిరు గుప్రయాణం అయ్యారు. "అప్పుడే అయిపో యాయి డాడీ శెలవులు. మీరు వుంటే ఎంతో సరదాగా వుంది. అప్పుడే వెళ్ళిపోతు న్నారంటే బాధగా వుంది" అన్నాడు మధు.

"మాకూ వెళ్ళాలని లేదు. కానీ తప్ప దుగా! వెళ్ళాల్సిందే. ఉద్యోగ ధర్మం" అన్నాడు భానుప్రతాప్.

"పోనీ మీరు వెళ్ళండి. నేను ఇంకో పది హేనురోజులుండి వస్తాను" అంది భవాని.

"ఏం అఖ్ఖర్లేదు. వున్నది చాలు ఇక బయలుదేరు" అన్నాడాయన.

"అది కాదండీ! మీకు అక్కడ భోజనా నికేం ఇబ్బంది కాదు కదా!" అంటూ ఏదో చెప్పబోయిన భార్య రెక్కపుచ్చుకుని అవత లికి లాక్కెళ్ళాడు.

"చెప్తే ఓ పట్టాన అర్థంకాదేం నీకు! కొత్తగా పెళ్ళయిన వాళ్ళు. వాళ్ళ మధ్య నువ్వెందుకు సత్రకాయలా! ఏదో కూతురి సంసారం చూడాలని ముచ్చటపడ్డావ్. బాగానే వుంది. వచ్చాం. చూశాం. ఇక మనదారిన మనం పోవాలిగానీ ఇక్కడే తిష్ట వేస్తానంటే ఎట్లా? " అని మెత్తగా మందలిం చాడు.

"అవునుసుమా? ఆ ఆలోచనే రాలేదు నాకు" అనుకుంది భవాని.

అల్లుడూ, కూతురూ తెచ్చిన కొత్త బట్టలు కట్టుకొని కమ్మగా భోజనంచేసి బయలుదే రారు భానుప్రతాప్, భవాని. వెళ్ళేముందే స్వగృహా ఫుడ్స్‌కి వెళ్ళి ఊరగాయలు, తెలుగు పిండివంటలు కొనితెచ్చి నీట్‌గా పాక్‌చేసి అత్తగారికి అందించాడు మధు.

"ఇది బాగుంది మధూ. సర్వసాధార ణంగా అత్తగారు కూతురికీ, అల్లుడికీ ఇవన్నీ చేసి ఇస్తుంది. అందుకు వ్యతిరేకంగా నువ్వే నాకు ఎదురిస్తున్నావు" అంది భవాని.

"ఫర్వాలేదు మమ్మీ! ఎవరు ఎవరికి స్తేనేం? ఇవి అక్కడ దొరకవు కాబట్టి ఇచ్చాను. మేము అక్కడికి వచ్చినప్పుడు

మీరు అక్కడ దొరికేవి మాకు ఇవ్వండి" అన్నాడు మధు నవ్వేస్తూ.

కూతురి సంసారం చూసి తృప్తిగా ఆనందంగా తిరుగు ప్రయాణం అయ్యారు భానుప్రతాప్, భవాని.

★ ★ ★

ఆరోజు ఆదివారం. భార్యాభర్తలిద్దరూ బ్రేక్‌ఫాస్ట్ ముగించి తీరిగ్గా కూర్చున్నారు. లంచ్‌కి బయటికి వెళ్దాం అనుకోటంతో వంట పని లేదుకాబట్టి కాసేపు మాట్లాడుకుని, మరికాసేపు పోట్లాడుకుని మరోసారి కాఫీ తాగేసరికి పది అయింది. ఇక బయలుదేరుదాం అనుకుంటూ వుండగా ఫోన్ మోగింది.

మధు రిసీవ్ చేసుకున్నాడు. "ఇది పి. మాధవి ఇల్లేనాండీ!" అని వినిపించింది ఓ ముసలి కంఠం.

"అవునండీ!" అన్నాడు మధు.

"నువ్వెవరివి? " మళ్ళీ అడిగాడు అవతలాయన.

"నేను మాధవి భర్తనండి!"



"అలాగా నాయనా! నా పేరు సదాశివం. నన్నందరూ సూరంపూడి బాబాయ్ అంటారు. నేనూ, మీ మావగారి తండ్రీ బాల్యమిత్రులం" అంటూ మొదలుపెట్టి సగంసేపు నసపెట్టి పావుగంటసేపు మాట్లాడిన మాటల్లో సారాంశం ఇది. ఆయన యాత్రా స్పెషల్ బస్‌లో భార్యా సమేతంగా బయలుదేరాడు. వెళ్ళే ఊళ్ళల్లో వున్న బంధువుల అడ్రసులూ, ఫోన్ నెంబర్లు సేకరించి పెట్టుకున్నాడు. ముందు రోజు హైదరాబాదు జేరారు. అవీ ఇవీ చూశారు. ఇవ్వాళ బజార్లవీ తిప్పుతారుట. బజార్ల వెంట తిరగడం ఇష్టంలేదు. ఎలాగూ ఆదివారం వీళ్ళు ఇంట్లోనే వుంటారు కాబట్టి ఫోన్ చేశాడు.

"అలాగే... తప్పకుండా రండి" అంటూ వివరంగా ఇల్లు గుర్తులు చెప్పాడు. "ఏదైనా ఇబ్బంది అయితే ఫోన్ చెయ్యండి" అని చెప్పాడు.

సంగతి విని విసుక్కుంది మాధవి. "ఆయన్నెపుడు చూశానో లేదో కూడా నాకు గుర్తులేదు. తీరికదొరికేదే ఒక్క ఆదివారం. ఆ ఒక్కరోజూ ఇలా తగలెట్టుకుంటే ఇక అయినట్లే. మనం బయటికి వెళ్తున్నాం అని చెప్పేస్తే సరిపోదూ!" అంది.

"భలేదానివి మధూ. పాపం పెద్దాయన! మన ఫోన్ నెంబరు అడిగి తెలుసుకుని ఎంతో ఆప్యాయంగా వస్తానంటే కాదంటామా? పోతే పోయింది ఆదివారం. వారం తిరిగేసరికి మరోటి వస్తుంది. అందుకని మీ ఇంటికి వస్తాం అని అంటే కాదంటం ఏం సంస్కారం. మరేం ఫర్వాలేదు. వాళ్ళు గంటలో వచ్చేస్తారు. మళ్ళీ సాయంత్రం వెళ్ళిపోతారు" అని భార్యకి సర్ది చెప్పి పన్లో మునిగిపోయాడు మధు. వంట ముగించి తయారై బజారుకి వెళ్ళాడు. ఆదివారం కూడా తెరిచివున్న షాపు వెతికి పట్టుకుని సుమారైన చీరె, జాకెట్టు, గ్లాస్కో పంచెలచాపు కొనుక్కుని ఇంటిమొహం పట్టాడు.

"ఇదేమిటి? వచ్చినవాళ్ళకి బట్టలు కూడా పెట్టాలా?" కాస్తంత అప్రసన్నంగానే ప్రశ్నించింది మాధవి.

"పెద్దవాళ్ళు వస్తున్నారు. మనకు శక్తి వుంటే తప్పకుండా పెట్టాలి" అన్నాడు మధు.

మరికాసేపట్లోనే వాకిట్లో ఆటో ఆగింది. సూరంపూడి తాతగారు, మామ్మగారూ దిగారు. ఆప్యాయంగా ఎదురువెళ్ళి ఆహ్వానించారు మధులు.

"మా అమ్మే. నీకు అచ్చంగా మీ నాన్న పోలికే వచ్చింది" అంటూ మాధవి బుగ్గలు నిమిరింది మామ్మ.

"ఏవిరా అబ్బాయ్... ఆమధ్య గుంటూరు వెళ్ళినప్పుడు వెతికి మీ ఇల్లు పట్టుకున్నాను. మీ నాన్నని కలిశాను. మహాయోగ్యుడు. ఏదీ మీ పెళ్ళికి మీ మావగారు కార్డు వేశాడుగానీ దీనికి ఆరోగ్యం బాగుండక బయలుదేరలేకపోయాం. సరే ఎలాగూ ఇటు వస్తున్నాం కదా! ఓసారి చూసి ఆశీర్వదించి పోదాం అని వచ్చాం" అన్నాడు తాతయ్య.

"ఇదుగో ఆ అక్షింతలు ఏవీ?" అని భార్యని అడిగాడు. ఆవిడ సంచీలోంచి ఓ పొట్లం తీసి అందులోంచి అక్షింతలు తీసి ఇచ్చింది. "ఇవి మనూర్లో రాములవారి కళ్యాణం అక్షింతలు. మీ తాతయ్య పెళ్ళికి ఆ తర్వాత మీ నాన్న పెళ్ళికీ తలంబ్రాల్లో కలిపాం. ఏదో అవకాశం కలిసొచ్చింది కదా అని తీసుకొచ్చాం" అంటూ దంపతులు తలలమీద అక్షింతలు జల్లి ఆశీర్వదించారు.

ఓ అయిదు నిముషాలపాటు ఏం చాదస్థంరా దేవుడా! సాయంత్రందాకా వీళ్ళనెలా భరించాలో అని అవస్థపడిన మాధవి క్రమంగా ఆ చాదస్థంచాటున దాగున్న ఆప్యాయత, అనురాగం చవిచూసి సరదాపడింది. ఎన్నో కబుర్లు, ఎన్నో పాత జ్ఞాపకాలు.




నోరు మూతపడకుండా మాట్లాడుతూనే వున్నాడు తాతగారు. మామ్మ సంచీతీసి "ఇది పాండురంగడి ప్రసాదం, ఇది సాయి నాధుడి విభూతి" అంటూ బొట్లుపెట్టి ప్రసాదాలు ఇస్తూనే వుంది.

"అదికాదే అమ్మడూ, మరి మీ ఆఫీసులో అంతపని చెయ్యడానికి నీకు భయం వెయ్యదుటే!" అంటూ ఆప్యాయంగా అమాయకంగా అడిగే మామ్మ ప్రశ్నలకు సమాధానం చెప్తూ అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవించింది మాధవి.

చూస్తుండగానే సమయం గడిచిపోయింది. "నాలుగయింది ఇక బయలుదేరుతాంరా అబ్బాయ్" అన్నాడు తాతగారు. మాధవికి దిగులు వేసింది "ఇంకో రెండ్రోజులుండరాదా మామ్మా!" అంది.

"బస్సులో వచ్చాం కదుటే తల్లీ. మళ్ళీ వస్తాంలే. మునిమనవడు పుడితే వాడిని చూడ్డానికి వస్తాం" అని హామీ ఇచ్చిందావిడ. తీరా వీళ్ళు బయలుదేరుదాం అనుకుంటూ వుండగా ఆ బస్సువాళ్ళే ఫోన్ చేశారు. మేము ఇక్కడినించి కాస్తముందుగా బయలుదేరుతున్నాం వేరే రూట్‌లో వెళ్తున్నాం. మీరు ఇటు వస్తే చెరోదారీ అయిపోతాం. అక్కడే వెయిట్ చెయ్యండి. ఎలాగూ అటే వెళ్ళాలి కాబట్టి అటువచ్చి మిమ్మల్ని పికప్ చేసుకుంటాం" అన్నారు. పోన్లే ఇదీ మంచిదే మరోగంట ఇక్కడే వుంటారు అని సరదాపడింది మాధవి.

మధు వెళ్ళి చాక్లెట్లు, ఓ అరకిలో కారం బూంది తీసుకొచ్చాడు. రెండు బిందెల నిండా ఏక్వాగార్డ్ నీళ్ళు పట్టి ఐస్‌వేసి సిద్ధంగా వుంచాడు.

ఆరింటికి హడావిడిగా వచ్చేసింది బస్. శ్రీ వెంకటేశ్వరా యాత్రా స్పెషల్ అని బేనర్ కట్టివుంది. బస్ ఆగగానే ఆర్గనైజరు దిగాడు. "ఆ రెడీయా బాబుగారూ! వెళ్దామా!" అని అడిగాడు తాతగార్ని.

"వాళ్ళు రెడీగానే వున్నారు. మీరు దిగి కాసిని మంచినీళ్ళు తాగి వెళ్ళండి" అన్నాడు మధు.

వేడిగా వుందేమో చల్లని మంచినీళ్ళు అనేసరికి ఒకరివెనుక ఒకరు బస్ జనం మొత్తం దిగారు. పిల్లలకి చాకలేట్లు, పెద్దలకు కారంబూంది అందించాడు మధు. ఇల్లు చూసి బోలెడంత ఆనందపడ్డారు. మాధవి ఉద్యోగం గురించి అడిగి తెలుసుకుని అమ్మో అనుకున్నారు గౌరవంగా.

మధు చూపిన ఆప్యాయత చూసి మహదానందపడ్డారు.

"ఇక వెళ్తాం సార్. ఈసారి నార్త్‌ట్రిప్ వేస్తాను. ముందుగా మీకు రాస్తాను. మీరిద్దరూ తప్పకుండా రావాలి" అన్నాడు టూర్ ఆర్గనైజర్.

అతనొక్కడే కాదు దాదాపు అందరూ తమతమ ఇంటికి రమ్మని ఆహ్వానించారు.

"మా ఊరు నూజివీడు సార్. మామిడి పళ్ళకు పెట్టింది పేరు. మాకు మామిడి తోటలున్నాయి. ఈసారి సమ్మర్‌లో రండి"

"మాది తాడేపల్లిగూడెం. మా ఊరికి దగ్గర్లోనే ద్వారకా తిరుమల గుడి వుంది. చాలా బాగుంటుంది. వీలు చూసుకుని ఓసారి రండి. నేను వెంటబెట్టుకుని తీసికెళ్ళి దర్శనం చేయిస్తాను" అంటూ తాతగారు, మామ్మ పదేపదే ఆప్యాయంగా చెప్పి బస్సెక్కారు. పోలోమంటూ బస్సు బయల్దేరి వెళ్ళిపోయింది.

"ఇల్లంతా బోసిపోయినట్లు వుంది కదూ!" అన్నాడు మాధవ్ ఇల్లు సర్దుతూ.

"అవును. ఇంత తక్కువ సమయంలోనే ఎంతో దగ్గర అయిపోయారు మామ్మా, తాతయ్య. వాళ్ళు సరే ఆ యాత్రకొచ్చిన వాళ్ళు కూడా అంత ఆప్యాయంగా మాట్లాడుతూవుంటే చాలా సరదా వేసింది" అంది మాధవి భర్తకు సహాయంచేస్తూ.

"నిజానికి మనం వాళ్ళకి ఇచ్చింది ఏముంది? చల్లటి మంచినీళ్ళు అంతేగా. ఆ మాత్రానికే మహాదానందపడిపోయి



మనని వాళ్ళ ఇళ్ళకి ఆహ్వానించారు. మని షికీ మనిషికీ మధ్య ఈ అనుబంధం లేక పోతే మరీ నిస్సారంగా మారిపోతాయి జీవి తాలు" అన్నాడు మధు.

ఆ సంఘటన తర్వాత మాధవిలో చాలా మార్పు వచ్చింది. అదివరకులాగా అబ్బా ఎవరు వెళ్తారు లెద్దూ అని బద్ధకించకుండా పెళ్ళిళ్ళకూ, ఫంక్షన్‌లకు హాజరుకావడం మొదలుపెట్టింది. బంధుమిత్రుల ఇళ్ళకి రాకపోకలు వీలుకాకపోతే ఫోన్‌లో పలక రించసాగింది.

ఆ ఉత్సాహంతోనే శ్రావణమాసంలో మంగళ గౌరీవ్రతం చేసింది. బెజవాడ నుండి పెద్దమ్మను సాయం పిలిపించుకుని పెందలాడే పూజ చేసుకుని ఆఫీస్‌కి వెళ్ళి సాయంత్రం తిరిగొచ్చి ముత్తైదువులకు వాయినాలిచ్చింది.

ఇదంతా తెలుసుకున్న అత్తగారు అమెరి కాలో మహదానందపడిపోయింది. అసలే మనవడు పుట్టిన ఆనందంలో వుందేమో ఈ విషయం తెలుసుకుని మరీ సరదాపడి పోయింది. భర్తద్వారా మరిదికి ఫోన్ చేయించి కోడలికి శ్రావణపట్టి పంపించింది. అవన్నీ చూసి కోడలూ చాలా సంతోషిం చింది. అత్తగారికి కృతజ్ఞతలు తెలుపు కుంది.

★ ★ ★

పూలనావలా సాగిపోతోంది మాధవి మధుల సంసారం. అసలే మేధావి మాధవి. దానికితోడు స్వర్గంలాటి ఇంటి వాతావరణం. మనసునిండా సంతోషం నిండిపోడంతో ప్రశాంతంగా వున్న మన సుతో నూతనోత్సాహంతో ముందుకు దూసుకుపోతోంది.

భారతి, రాజశేఖర్ ఇండియా రావలసిన సమయం దగ్గరపడింది. పిల్లవాడికి రెండో నెల వెళ్ళింది. తల్లికూడా పూర్తిగా కోలు కుంది. అదీగాక వీసా వ్యవధి కూడా ముగి సిపోతోంది. కాబట్టి ఏవో అక్కడికి దగ్గర ప్రదేశాలు కొన్ని చూసి కూతురికి లక్షజాగ ర్తలు చెప్పి విమానం ఎక్కింది భారతి.

"నాకు నిన్ను చూడాలనివుంది. పుట్టి బుద్ధి తెలిశాక ఇంతకాలం నిన్ను చూడ కుండా ఎప్పుడూ వుండలేదు. దిగులువే స్తోంది. తిన్నగా ఇక్కడికి వచ్చేయ్" అని కొడుకు మారాం పెట్టడంతో మెడ్రాస్ నుండి విమానంలో హైదరాబాదు వచ్చి ఆ తర్వాత గుంటూరు వెళ్ళేలా ఏర్పాటు చేసు కున్నారు.

తల్లితండ్రులు వస్తున్నారని తెలిసిన మధు సంబరం వర్ణనాతీతం. అది చూసి "నా చిట్టితండ్రే. ఓ పాలసీసా కొనిపెట్టమం టావా అమ్మకూచీ" అని ఏడిపించింది మాధవి. అతడిని ఏడిపించిందిగానీ వాళ్ళొ స్తున్నారంటే మాధవికీ సరదాగానే వుంది. నీకోసం అవి తెస్తున్నా ఇవి తెస్తున్నా అని ఊరిస్తూనే వుంది అత్తగారు. అవన్నీ చూడాలని సరదా! అక్కడి కబుర్లన్నీ వినా లని కుతూహలం! అన్నీ ఏకమై వాళ్ళకోసం ఎదురు చూడసాగింది.

ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళారు ఇద్దరూ. ఫ్లైట్ గంట డిలే అని తెలిసి కాస్త నీరస పడిపోయి కాఫీ తాగి తేరుకున్నారు. అటూ ఇటూ పచార్లుచేసి కాసేపు మాట్లాడు కుంటూ మరికాసేపు వాదించుకుంటూ కాల క్షేపం చేసేశారు. విమానం లేండ్ అయింది.

అదృష్టవశాత్తూ మాధవి పాత ఫ్రెండెవరో కనిపించాడు. అతనక్కడే ప్రైవేట్ ఎయిర్‌లైన్స్‌లో పని చేస్తున్నాడుట. రండి అంటూ తనవెంట లోపలికి తీసుకువె ళ్ళాడు.

అంతదూరాన వాళ్ళని చూడగానే పరు గున ఎదురెళ్ళి కావలించేసుకున్నాడు మధు. "అమ్మా ఎలా వున్నారు?" అంటూ అత్తగారిని కావలించుకుంది మాధవి. కూతుర్ని వదిలేసి వచ్చిన దిగులుతో




దారంతా కళ్లు తుడుచుకుంటూనే కూర్చున్న భారతికి "అమ్మా" అంటూ తనని చుట్టుకు పోయిన కోడల్ని చూసి ప్రాణం లేచివచ్చింది. "బాగున్నాను తల్లీ. నువ్వెలా వున్నావ్? " అంటూ ఆప్యాయంగా తలనిమిరింది.

లగేజ్ తీసుకుని బయటికి వచ్చారు. ఇక కబుర్లే కబుర్లు దారంతా, ఇంటికి చేరాక, అర్ధరాత్రిదాకా, మళ్ళీ తెల్లవారగానే. మాధవి ఆఫీసుకి వెళ్ళలేక వెళ్ళలేక వెళ్లింది.

కొడుకు సంసారం చూశాక అదివరకు ఏ మూలో వున్న దిగులు పటాపంచలు కాగా తృప్తిగా నిట్టూర్చింది భారతి. అమ్మా నాన్న గారూ అంటూ తిరుగుతున్న కోడలిని చూసి రాజశేఖరం ఆనందానికి పట్టపగ్గాలు లేవు. వారంరోజులు గిర్రున తిరిగొచ్చాయి. ఇక వెళ్తాం అని ప్రయాణం అయ్యారు దంపతులు. మరికొన్నాళ్ళుండమని బలవంతపెట్టినా "ఇల్లొదిలి చాలారోజులు అయిందికదురా! మళ్ళీ వస్తాంలే" అని చెప్పి బయలుదేరారు.

కార్లో తీసుకువెళ్లి రైలు ఎక్కించాడు మధు. పళ్ళూ, పుస్తకాలు కొనిచ్చాడు. రైలు కదుల్తుంటే "వెళ్ళగానే ఫోన్ చెయ్యమ్మా" అని చెప్తూ వెంట నడుస్తున్న కొడుకుని ఆనందంగా, గర్వంగా చూసుకుని కళ్లొత్తుకుంది భారతి.

"ఏమో అనుకున్నానుగానీ అబ్బాయి సంసారం ఎంత బాగుందోకదూ. బాబు మరికాస్త రంగు తేలాడు. చూస్తేనే దిష్టి తగిలేలా వున్నాడు" అంది భర్తతో.

"అవును భారతీ. మాధవి కూడా సమర్థురాలు, మంచిపిల్ల. చిలకాగోరింకల్లా వున్నారు ఆ దంపతులు. పెళ్ళి విషయంలో మంచి నిర్ణయమే తీసుకున్నాడు" అన్నాడాయన ఆనందంగా.

ఆ తర్వాత నెలకో రెండు నెల్లకో ఒకసారి కొడుకు ఇంటికి వచ్చి నాల్రోజులుండి వెళ్ళడం ఓ అలవాటయిపోయింది రాజశేఖరం దంపతులకి.



పెళ్ళో పెళ్ళో అని అలమటించిపోయిన మాధురికి ఒక సంబంధం కుదిరింది. తనే కుదుర్చుకుంది. పెళ్ళికొడుకు సి.ఏ. పాసయ్యాడు. పేరు సుధీర్. "కట్నం ఏమీ వద్దు. మాది మామూలు కుటుంబం. నా చదువుకి అప్పులు అయ్యాయి. అదీగాక నాకు కొన్ని బాధ్యతలు కూడా వున్నాయి. అందుకోసం అప్పుగా ఓ లక్ష ఇస్తే మళ్ళీ తీర్చేస్తాను" అన్నాడు మర్యాదగా. "అయ్యో గానిదేముంది" అంది మాధురి. వివాహం తారీకు నిశ్చయం అయింది. పెళ్ళి హైదరాబాదులోనే. మాధురి తల్లిదండ్రులు వచ్చి అబ్బాయిని చూసి పెళ్ళి ఏర్పాట్లు చూసి మళ్ళీ పెళ్ళికి ఓ వారం ముందుగా వస్తాం అని వెళ్ళిపోయారు.

అప్పుడు వున్న ఇల్లు మార్చాలని మరో పెద్ద ఇంట్లోకి వెళ్ళాలని అనుకుంది మాధురి. కానీ సుధీర్ వద్దన్నాడు. "ఎందుకు అనవసరంగా. ఎలాగూ పగలంతా ఇద్దరం బయటే వుంటాం. అదీగాక పెద్ద ఇల్లు తీసుకుంటే దానికి తగిన ఫర్నిచర్ కొనాలి. అదో డబ్బు దండగ"

అన్నాడు. అదీ నిజమేలే అనుకుంది మాధురి.

"బట్టలు కొందాం సాయంత్రం ఇద్దరం వెళ్దామా?" అని ఫోన్ చేసింది. "నాకు తీరిక దొరకదు. నువ్వెళ్ళి నీక్కావలసినవి కొనుక్కో. డబ్బు పంపిస్తే నాకు కావలసినవి నేను కొనుక్కుంటాను" అన్నాడు.

మాధురి మనస్సు చివుక్కుమంది. అప్పుడే కాదు. తన ప్రాణస్నేహితురాలు మాధవి పెళ్ళి కుదిరిన తర్వాత మాధవి వున్నంత సంతోషంగా తను లేదేమో అన్న భావం అనుక్షణం కలుగుతూనే వుంది. అప్పుడూ అలాగే అనిపించింది. వాళ్ళిద్దరూ కలిసి ఎంత ఉత్సాహంగా షాపింగ్ చేశారు అనుకుని మళ్ళీ అంతలోనే ఇదంతా నా భ్రమ. అందరు మనుషులూ ఒకేలా వుండరుకదా! ఇతని స్వభావం ఇది అనుకుని సర్ది చెప్పుకుంది.

డబ్బెవరితో పంపించాలి అని కాస్త తర్జన భర్జనపడి ఆఫీసు ప్యూన్‌తో పంపితే మర్యాదగా వుండదేమో అని సంశయించి మధుని సహాయం అడిగింది. "ఓ దానికేం భాగ్యం. ఇంట్లో డబ్బుంది. నేను తీసుకువెళ్ళి ఇస్తాను. తర్వాత మీరు ఇవ్వండి నాకు" అన్నాడు మధు.

"సరే. సెలక్షన్‌కి సాయం కావాలంటే మీరూ వెళ్లండి" అని చెప్పింది మాధురి.

వెంటనే బయలుదేరి సుధీర్ ఇంటికి వెళ్ళాడు మధు. ఓ రూమ్‌లో వుంటున్నాడు సుధీర్. అంతకుముందు ఒకసారి వెళ్ళాడు మధు. వెళ్ళగానే కాలింగ్‌బెల్ నొక్కాడు. కరెంటు పోయిందేమో బెల్ మోగలేదు. తలుపు తట్టేసరికి గడియతీసి వున్న తలుపు ఓరగా తెరుచుకుంది. సుధీర్‌ని పిలవబోయిన మాధవ్ లోపల్నించి మాటలు వినిపించడంతో ఆగిపోయి చెవులప్పగించాడు.

"మొత్తానికి నా పథకం పారినట్లే. పిట్ట ఇంత త్వరగా వల్లో పడుతుందని అనుకోలేదు" అంటున్నాడు సుధీర్.

"జాగ్రత్త. పెద్దవాళ్ళతో వ్యవహారం. పట్టుబడితే మొదటికే మోసం వస్తుంది. నా మాట విని ఇప్పుడున్న దాన్ని నయానో భయానో వదుల్చుకుని అప్పుడు పెళ్ళి చేసుకో" నచ్చచెప్తున్నాడు అవతలివ్యక్తి.

"సర్లే. అన్నింటికీ భయపడితే ఎలా? ఇదీ వుంటుంది అదీ వుంటుంది. చాకిరికి ఇది. సంపాదించడానికి అదీను. ఎంత మంది మగవాళ్లు ఇలా చెయ్యడంలేదు. తెలియకుండా జాగర్తపడతాను. ఒకవేళ తెలిసినా ఏం చేస్తుంది. ఏడిచి అదే వూరుకుంటుంది" అంటున్నాడు సుధీర్ ధీమాగా.

మధు తల గిర్రున తిరిగింది. నిశ్శబ్దంగా అక్కడినుండి వచ్చేశాడు. పక్కనున్న కొట్టుకి వెళ్ళి ఓ కూల్‌డ్రింక్ తాగి కాస్త తేరుకున్నాడు. వెంటనే మాధవికి ఫోన్‌చేసి అర్జెంటుగా ఇంటికి రమ్మని చెప్పాడు. తనూ వెంటనే ఇంటికి వెళ్ళాడు.

"ఏమిటంత అర్జెంటుగా రమ్మన్నావ్?" అంటూ కంగారుగా వచ్చింది మాధవి. "కొంపలంటుకున్నాయ్" అంటూ జరిగినదంతా చెప్పాడు. నిర్ఘాంతపోయింది మాధవి.

"ఇప్పుడేం చేద్దాం?" అన్నాడు మధు. "తక్షణం మధుకి ఈ నిజం తెలియాలి" అంటూ వెంటనే మాధురిని అక్కడికి పిలిపించారు. అంతవరకూ ధైర్యంగా వున్న మాధవి స్నేహితురాల్ని చూడగానే నిలువునా నీరైపోయింది. బేలగా కన్నీళ్లు పెట్టుకుంది. "ఏమిటి మధూ ఏమైంది అలా వున్నావేం?" అంటూ కంగారుపడింది మాధురి.

పరిస్థితి గ్రహించి తను ఊరుకున్నాడు మధు. "మాధురీ! నీకో ముఖ్యమైన విషయం చెప్పాలి. ఇది నీకు చాలా షాకింగ్ న్యూస్. గుండెదిటవు చేసుకో" అంటూ నెమ్మదిగా జరిగిందంతా చెప్పేసింది.

తలమీద పిడుగు పడినట్లు అయింది మాధురికి. నిశ్చేష్టురాలై కూలబడిపోయింది.

"ఎంత మోసం! ఎంత దగా" కోపం, దుఃఖం ముంచుకురాగా నోటమాట రాక సతమతం అయిపోయింది.

"నేనెవరికి ఏం అపకారం చేశానని నాకిలా జరిగింది" అంటూ చేతుల్లో మొహం దాచుకుని బావురుమని ఏడిచింది. స్నేహితురాలి తలనిమురుతూ తనూ ఏడిచేసింది మాధవి. కాసేపటికి ఇద్దరూ తేరుకున్నారు.

"ఇప్పుడేం చేద్దాం?" వాళ్ళిద్దరికీ చెరో కప్పు కాఫీ అందించి అడిగాడు మధు.

"ముందు ఈ పెళ్ళి ఆపేయాలి" అంది మాధురి.

"అదెప్పుడో ఆగిపోయింది. ఆ రోగ్‌కి తగిన శాస్తి చెయ్యడం మన ప్రథమ కర్తవ్యం. ఆ ఏరియా పోలీస్‌స్టేషన్‌కి కంప్లయింట్ ఇవ్వాలి. వాడిని కటకటాల వెనక్కి పంపితేగానీ నా మనసు చల్లబడదు"

ముందుగా మధూ వాళ్ళ నాన్నగారికి ఈ విషయం తెలియచెయ్యాలి. అంటూ ఆయనకి ఫోన్ చేసింది. సంగతంతా విని లబలబలాడాడు ఆయన. ఇంతదాకా వచ్చాక పెళ్ళాగిపోతే కష్టం కదమ్మా అన్నాడు ముందు సగటు ఆడపిల్ల తండ్రిలా. ఆ తర్వాత ఇంకా నయం ముందే తెలిసింది. అన్నాడు. ఆ తర్వాత ఆ వెధవను అంత తేలిగ్గా వదలను అంటూ మండిపడ్డాడు. చివరికి నేనూ, నా భార్యా ఇప్పుడే బయలుదేరివస్తాం అన్నాడు.

మాధవి అమిత ఆగ్రహంతో బయలుదేరి పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళి కంప్లయింట్ ఇచ్చింది. ప్రెస్‌ని పిలిపించి ఈ సంగతి తెలియజేసింది. పెళ్ళి ఆగిపోయినట్లు ప్రకటన ఇమ్మని పేపర్‌కి మేటర్ పంపించింది. ఫోన్లుచేసి కళ్యాణమండపం వగైరా ఏర్పాట్లన్నీ కేన్సిల్ చేసింది.

కంప్లయింట్ ఇచ్చింది అల్లాటప్పా మనిషి కాదు. అందుకే పోలీసులు చురుగ్గా పనిచేశారు. నేరస్థుడిని పట్టితెచ్చారు. ప్రెస్ విలేఖరులు రంగంలోకి దూకి వ్యవహారం అంతా కూపీ లాగారు.

సుధీర్ పచ్చిమోసగాడనీ, సి.ఏ. కాదుగదా బీ.ఏ. కూడా చదవలేదనీ తెలిసివచ్చింది. అదివరకే పెళ్లయిందనీ ఒక కొడుకు కూడా వున్నాడనీ తెలిసింది. ఆ భార్యని బెదిరించి నోరు మూయించి మళ్ళీ పెళ్ళికి తలపెట్టాడని తెలిసింది. సుధీర్‌కి అరదండాలు వేసి స్టేషనుకి తరలించారు.

"వెళ్ళి వాడిని ఎడంకాలి చెప్పుతో సన్మానం చేసిరా" అంది మాధవి.

"ఛ... వాడి మొహం మళ్ళీ చూడను. వాడు చచ్చిన చిలకతో సమానం" అంది మాధురి. పత్రికల్లో వచ్చిందీ వార్త. దాంతో ఆ మోసగాడికి బెయిల్ ఇవ్వడానికి ఎవరూ సాహసించలేదు.

సుధీర్ భార్య పిల్లాడిని వెంట బెట్టుకొచ్చి మాధవి కాళ్ళమీద పడి ఏడిచింది. తనకు దిక్కులేదనీ భర్తని విడిపించమనీ బతిమాలుకుంది.

"నీకు దిక్కులేకపోతే ఎక్కడైనా పని ఇప్పిస్తాను చేసుకో. అంతేగానీ వాడిని మాత్రం క్షమించను. వాడికి తగిన శిక్ష పడాల్సిందే" అంది మాధవి ఖచ్చితంగా.

★ ★ ★

ఈమధ్య మాధవికి ఎందుకో నలతగా, బడలికగా అనిపిస్తోంది. వారంరోజులు గడిచినా మాధవి బడలిక తగ్గకపోయేసరికి హఠాత్తుగా ఏదో గుర్తువచ్చింది మధుకి. వెంటనే భార్యతో తన సందేహం చెప్పాడు.

"నిజమేకదూ. ఈ హడావిడిలోపడి ఆ సంగతే పట్టించుకోలేదు" అంది మాధవి.

"అంటే! అదేనంటావా?" సంభ్రమంగా ప్రశ్నించాడు మధు.

"ఏమోమరి మరో నాల్రోజులు చూద్దాం" అంది మాధవి.

మరో వారం ఆగి డాక్టర్‌ని కన్సల్ట్





చేసింది. రిజల్ట్ పాజిటివ్.

రిపోర్టు అందుకుని ఎగిరి గంతులేశాడు మధు. మాధవి మాత్రం కాస్త సంకోచించింది. "మరో ఏడాది ఆగితే బాగుండేదేమో. మనం మేనేజ్ చెయ్యగలమా?" అంది.

"వద్దు ఇంకా లేట్ అయితే కాన్పు కష్టం. మేనేజ్ చెయ్యడం అంటావా? ఈ తొమ్మిది నెలలూ కాస్త శ్రమపడు. ఆ తర్వాత పూర్తి బాధ్యత నాది" అన్నాడు.

ఈ శుభవార్త తెలుసుకుని రెక్కలు కట్టుకుని వాలింది భారతి.

"ఇక ఆఫీసుకి వెళ్ళకమ్మా. నీకు శ్రమ అవుతుంది" అంది కోడలి తలనిమురుతూ. పడిపడి నవ్వింది మాధవి. "ఏమిటీ! ఇప్పట్నించి సెలవు పెట్టి ఈ తొమ్మిది నెలలూ ఇంట్లో కూర్చోనా?" అంది అల్లరిగా.

కోడలి నోట్లో మాట నోట్లో వుండగానే అడిగినదే తడవుగా అన్నీ అమర్చి పెడుతోందామె. మధు సరేసరి. అసలే అపురూపం. ఇక వేరే చెప్పాలా. అడుగులకు మడుగులు వత్తడం మొదలుపెట్టాడు.



కూతురి శుభవార్త విని ఎగిరి గంతులేశారు భానుప్రతాప్, భవాని. వెంటనే రావాలని వున్నా దూరంకాబట్టి అక్కడ అత్తగారు సాయం వున్నారు కాబట్టి ప్రయాణం వాయిదావేసున్నారు.



మాధురి విషయం పేపర్లో చదివి చాలామంది ఆమెకి లెటర్స్ రాశారు. కొన్ని స్త్రీజనోద్ధరణ సంఘాలవారు అవసరం అయితే తమ సహాయం అందిస్తామని తెలియజేశారు.

కొంతమంది మహిళలు 'పెళ్ళికిముందే మాకూ మా కాబోయేభర్త గురించి చూచాయగా తెలిసినా అవన్నీ గాలికబుర్లు అని పెడచెవిన పెట్టి పెళ్ళి చేసుకుని ఇప్పుడు నరకం అనుభవిస్తున్నాం' అంటూ తమ జాలి గాథలు రాశారు.

కొందరు ఆడపిల్లలు 'ఈ సంఘటన ఆడపిల్లలందరికీ హెచ్చరిక. అయినా కొనబోయే చిన్నా చితకా వస్తువులకే పదిసార్లు నాణ్యత పరీక్షించి చూస్తారు కానీ జీవితాంతం కలిసివుండాల్సిన పెళ్ళి విషయం మాత్రం చాలా తేలిగ్గా తీసుకుంటారు. పెళ్ళికి ముందే వారు చెప్పిన వివరాలన్నీ నిజమేనా అని పరిశోధించి తెలుసుకోవడం మనందరం అలవాటు చేసుకోవాలి' అంటూ రాశారు.

మరికొంతమంది 'మీరు పెద్ద ఉద్యోగం చేస్తున్నారు. సర్వస్వతంత్రులు. కాబట్టి పీటలమీద పెళ్ళి ఆపించగలిగారు. అందుకు మీ తల్లిదండ్రులూ సహకరించారు. ఆ అవకాశం లేనివారు ఏం చెయ్యాలి? ఇంతదాకా వచ్చాక పెళ్ళి ఆగిపోతే పరువు తక్కువ. మగవాడన్నాక ఆమాత్రం దురలవాట్లు వుండవా, పెళ్ళైతే అన్నీ సర్దుకుంటాయి అని మెడలు విరిచి పెళ్ళి పీటలమీద కూర్చోబెడితే మేము ఏం చెయ్యాలి?' అంటూ అమాయకంగా ప్రశ్నించారు.

'ఇలాటి మగవాళ్ళవల్ల అందరు మగవాళ్ళకీ చెడ్డపేరు వస్తోంది. మంచివారి మంచితనం మరుగున పడిపోతోంది. ఏది ఏమైనా మీ ధైర్యానికి అభినందిస్తున్నాం' అంటూ రాశారు కొంతమంది మగవారు.

మరికొందరు ఆమెను వివాహం చేసుకోడానికి తమ సంసిద్ధతను తెలియజేశారు.

తనకు వచ్చిన ఉత్తరాలకి కొన్నింటిని ఎంచుకుని సమాధానాలు రాసింది మాధురి.

అలా రాసిన వారిలో భాస్కర్ ఒకడు. చక్కని భాషతో చెప్పదలచినది క్లుప్తమైన మాటలో చెప్పిన తీరు మాధురికి నచ్చింది. తగిన రీతిన సమాధానం రాసింది.

అంతటితో ఆగక మళ్ళీ చక్కగా ఉత్తరం రాశాడు భాస్కర్. తన గురించి తెలియజేశాడు. అభిరుచులేమిటో తెలియజేశాడు. రెండు పేజీల ఆ ఉత్తరంనిండా స్నేహసౌరభమే.

అతని అభిరుచులను తెలుసుకుని ఆశ్చర్యపోయింది మాధురి. ఇవన్నీ తన అభిరుచులే. అచ్చుగుద్దినట్లు ఇద్దరు వ్యక్తుల్లో వుండడం చిత్రంగా తోచింది. ఆ విషయమే తెలియజేస్తూ మళ్ళీ ఉత్తరం రాసింది.

అలా ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచాయి. అతని భావాలను, అతనిలోని భావుకతనూ

# ఏరిన ముత్యాలు

★ ధనం సంపాదించుట నిషేధం కాదు కానీ గర్వపడుట మంచిది కాదు.

–జాన్‌క్రిస్టోఫర్

★ సాలెగూడులాంటి జీవితం, చిక్కుపడిన దారంవంటిది. మంచి, చెడు కలిసే ఉంటాయి.

–షేక్స్‌పియర్

★ మెదడును ఖాళీగా ఉంచినప్పుడు వ్యసనాలకు దారి తీస్తుంది.

–విలియంకాపర్

★ స్వచ్ఛమైన యోగ్యత నదివంటిది. లోతుకెళ్లినకొద్దీ తక్కువ శబ్దం మాత్రమే సృష్టిస్తుంది.

–ఒక సామెత

★ అవసరానికి చట్టంగురించి తెలియదు. కానీ, జయించటానికే ప్రయత్నిస్తుంది.

–పుబ్లియస్ సిరాస్

★ భగవంతుని ఉత్తమ కృషిచిహ్నమే నిజాయితీ పరుడైన వ్యక్తి.

–పోప్

★ అవకాశం లేనప్పుడు, శక్తి సామర్థ్యములంతగా పరిగణనకు రావు.

–నెపోలియన్

★ అర్థంలేని మాటలకన్నా మౌనం మంచిది.

–పైథాగరస్

★ మిడిమిడి జ్ఞానం ప్రమాదకరం

–పోప్

★ నిర్మలచిత్తమంతటి మెత్తని దిండులేదు.

–ఫ్రెంచి సామెత

★ సత్యమే శీలం! సత్యమే అందం! సత్యమే దైవం!!

–మహాత్మాగాంధీ

★ భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించడం వివేకం.

–స్వామి వివేకానంద

★ ధన సంపాదనకన్నా విజ్ఞాన సంపాదన మేలు

–బైబిల్‌సూక్తి

★ సర్వజగత్తుకు మూలం కర్మ. ఆ కర్మకు త్రిమూర్తులు కూడా లొంగవల్సిందే.

–కవిశ్రీ

★ జీవితమాధుర్యాన్ని చవిచూడాలంటే గతాన్ని మరచిపోయే శక్తి ఉండాలి.

–చలం

-సేకరణ : రాంబాబు

గమనించి ముగ్ధురాలై తనకు తెలియకుం డానే ఆ అజ్ఞాత వ్యక్తిపట్ల కుతూహలం పెంచుకుంది. "ఎవరో ఇతను? వివాహి తుడో, అవివాహితుడో! పెళ్ళికాకపోతే ఎంత బాగుండు"

కుతూహలం అణచుకోలేక ఒక ఉత్త రంలో రాసింది. 'మీ కుటుంబం గురించి మీ దినచర్య గురించి రాయండి' అంటూ.

సమాధానం వచ్చింది. మాధురి కోరినట్లే అన్నీ వివరంగా రాశాడు. అందులో ఎక్కడా భార్య ప్రసక్తిలేదు. కాబట్టి ఖచ్చి తంగా అవివాహితుడే.

జరిగిన చేదు అనుభవంతో కరడుకట్టిన మాధురి మనసుమీద తొలకరిజల్లు కురిసి నట్లు అయింది.

మాధవి దగ్గర తన మనసులోని మాట బయటపెట్టింది.

జాలిగా చూసింది మాధవి. 'పిచ్చి మొహం పెళ్ళంటే దీనికెంత ఇష్టమో! ఇంకె వరైనా దీని స్థానంలో వుంటే జన్మలో పెళ్ళి ఆలోచన తలపెట్టేవాళ్ళు కాదు' అనుకుంది మనసులో.

పైకిమాత్రం "నీకా ఉద్దేశ్యం వుంటే అతన్ని ఇంటికి రమ్మని పిలు. ఉత్తరాలు వేరు నిజరూపం వేరు. ఒకసారి మనిషిని చూసి మాట్లాడితే ఆ తర్వాత సంగతి తర్వాత చూద్దాం" అని సలహా ఇచ్చింది.

ఆ సలహా పాటించి అతనికి ఉత్తరం రాసింది మాధురి. వెంటనే సమాధానం వచ్చింది.

శనివారం ఇల్లంతా అద్దంలా సర్దింది. ఆదివారం పొద్దున్నే లేచి పనులన్నీ ముగిం చుకుని అందంగా తయారై అతనికోసం ఎదురుచూడసాగింది.

అనుకున్న సమయానికి పావుగంట ఆల స్యంగా వచ్చాడు భాస్కర్.

ఎదురేగి ఆహ్వానించింది మాధురి. లోప లికి వస్తూనే తనుతెచ్చిన స్వీట్‌పాకెట్ అందించాడు భాస్కర్.

ఎగాదిగా చూశాడు. "మీరేకదూ మాధురి? " అనుమానంగా అడిగాడు.

"నిస్సందేహంగా నేనే" సమాధానం చెప్పింది.

"నమ్మలేకపోతున్నాను. మీ ధైర్యసాహ సాలు, మీ చదువు, మీ ఉద్యోగం గురించి విని మీరెలా వుంటారో వూహించుకు న్నాను. తీరా చూస్తే మీరింత సింపుల్‌గా వున్నారు. మీలో ఇంత ప్రతిభ వుందని తెలియదు మిమ్మల్ని చూస్తుంటే" అన్నాడు ఆశ్చర్యంగా.

నవ్వేసింది మాధురి. "నిజంగానా! ఇప్ప టికీ నమ్మలేక పోతే చెప్పండి నా పాస్‌పోర్ట్ చూపిస్తాను" అంది అమాయకత నటిస్తూ.

అతనూ నవ్వేశాడు. "వద్దులెండి మీరు స్వయంగా చెప్పారుగా. నమ్ముతాను"

"నేనే మాధురిని అని నిర్ధారణ అయింది కాబట్టి తీరిగ్గా కూర్చుని మాట్లాడుకోవ చ్చేమో" సూచించింది.

"తప్పకుండానూ. కాఫీ తాగుతూ కబుర్లు చెప్పుకుంటే ఇంకా దివ్యంగా వుంటుంది" మరో సలహా ఇచ్చాడు.

తూరీగలా లోపలికి వెళ్ళి కాఫీ తెచ్చి అందించింది. ఒక్కగుటకవేసి "అబ్బ అద్భు తంగా వుంది" అంటూ మెచ్చుకున్నాడు.

"నేను మీరు ఊహించినట్లు లేనేమోగానీ మీరు మాత్రం ముమ్మూర్తులా నేనూహించి నట్లే వున్నారు" అంది మాధురి.

"నిజంగానా? "

"అవును... ఇలా మీరు మా ఇంటికి రాక పోయినా ఇంకెక్కడైనా చూసినా మిమ్మల్ని గుర్తుపట్టేదాన్నే" చెప్పేసింది.

"మీరు అంతటి మేధావులే. అందులో ఎంతమాత్రం సందేహంలేదు" చెప్పాడు.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ వుంటే గంటలు క్షణాల్లా గడిచిపోయాయి. కాలేజీ కబుర్లు, సినిమాలు, రాజకీయాలు... ఒకటే మిటి? ఎన్నో విషయాలు. పన్నెండు కొట్టే సరికి ఉలిక్కిపడ్డాడు భాస్కర్.




"బాప్‌రే ఎంత సమయం గడిచిపో యిందో నేనింక వెళ్తాను" అన్నాడు.

దిగాలుపడిపోయింది మాధురి. "అప్పుడే వెళ్తారా? పోనీ ఈ పూటకి ఇక్కడే భోజనం చెయ్యకూడదూ. అరగంటలో వంటచేస్తాను" అంది వేడికోలుగా.

ఆవిడమాట కాదనలేకపోయాడు భాస్కర్. "సరే అలాగే కానివ్వండి" అన్నాడు.

ఏదో లాటరీ దొరికినంత ఆనందపడి పోయి చెంగునలేచి వంటింట్లోకి పరిగె ట్టింది. "నేనూ సహాయం చెయ్యనా? " అడి గాడు భాస్కర్.

"పద్దు చిటికెలో చేసేస్తాను. మీరు ఆల్బమ్స్ చూస్తూవుండండి" అంటూ నాలుగు ఆల్బమ్స్ తెచ్చి ఇచ్చింది.

అతను చూస్తూవుంటే మధ్యలోవచ్చి "ఇదుగో మా అమ్మా నాన్నా" అని చెప్తూ "ఇది మేం ఎడ్యుకేషనల్ టూర్ వెళ్లినప్ప టిది" అని చూపిస్తూ ఆయా వివరాలు వివ రిస్తూ వంట పూర్తిచేసేసింది.

అరగంట అయేసరికి "రండి భోజనం చేద్దాం" అనేసరికి ఆశ్చర్యపోయిన భాస్కర్ బల్లమీద అమర్చిన పదార్థాలు చూసి మూర్ఛపోయినంత పనిచేశాడు.

"ఏమిటిది ఇంత త్వరగా ఇన్ని ఐటమ్స్ ఎలా చేశారు. మాయాబజారు సినిమాలో రమణారెడ్డిలాగా అం అహ ఇం ఇహీ అని సృష్టించే మంత్రదండం ఏమైనా వుందా? " అని అడిగాడు.

నవ్వేసింది మాధురి "అలాటి దండాలేమీ లేవుగానీ ఆధునిక పరికరాలు అన్నీ వున్నాయి" అని చెప్పింది.

ఐటమ్స్ రుచిచూసి "అద్భుతంగా వున్నాయి" అని మెచ్చుకుంటూ తృప్తిగా భోజనం చేశాడు. అతనలా చనువుగా వుండడంతో అతనికి ఇల్లంతా చూపించింది మాధురి. తను ఎంబ్రాయిడరీ చేసిన దుప్పట్లు, వేసిన పెయింటింగ్స్ చూపిం చింది.

"మీరు బహుముఖ ప్రజ్ఞాశాలి. ఒక మని షిలో ఇన్ని విద్యలు దాగివుండడం చాలా గొప్ప విషయం" అన్నాడు మనస్ఫూర్తిగా.

"మీరిలా మెచ్చుకుంటున్నారా! మా మధు నన్ను ఎప్పుడూ ఎగతాళి చేస్తూ వుంటుంది. నీకున్నంత సంసార తాప త్రయం ఈ భూమ్మీద ఎవరికీ వుండదు అంటుంది" అంది మాధురి.

"మీ ఉత్తరాలలో కూడా మాధవిగారి ప్రసక్తి చాలాసార్లు వచ్చింది. ఆవిడ మీకు చాలా మంచిఫ్రెండ్ కదూ. ఈ ఆధునిక యుగంలో అంతమంచి ఫ్రెండ్ దొరకడం నిజంగా చాలా అదృష్టం" అన్నాడు.

"ఆమాట అక్షరాలా నిజం. ఏ మంచి ముహూర్తాన ఒకరినొకరం కలుసుకున్నామో ఒకరికి ఒకరం ప్రాణం అయిపోయాం. దాని పెళ్ళి అయ్యాక అది నాకు దూరం అవుతుందేమో అని భయపడ్డాను. కానీ మధు మంచితనంవల్ల మరింత దగ్గ రయ్యాం" అంది మాధురి.

"ఆయన అంతమంచివారా? " కుతూహ లంగా అడిగాడు.

"మంచిలో వేలలో ఎన్నదగిన వ్యక్తి. అటువంటి భర్త దొరకడం దాని అదృష్టం" అంటూ ప్రారంభించి వాళ్ళ పెళ్ళి ఎలా కుదిరిందో పూసగుచ్చినట్లు చెప్పింది. వద్దు వద్దు అంటూనే పెళ్ళి చేసుకుని నిశ్చింతగా వుంది అది. పెళ్ళిపెళ్ళి అని తాపత్రయప డిన నేను ఇలా మోసపోయాను" చెప్తూ వుంటే మాధురి వదనం చిన్నబోయింది.

"ఏమిటో ఈ విచిత్రం! మనిషి కోరుకు న్నవి అన్నీ చేజిక్కే అవకాశం వుంటే ఎంత బాగుంటుంది. కొందరికి కాళ్ళదగ్గరికి వచ్చి పడే అవకాశాలు మరి కొంతమందికి ఎండ మావులైపోతాయి. నామటుకు నాకూ పెళ్ళి, సంసారం అంటే ఎంతో ఇష్టం. కానీ ఏం చేస్తాను? పరిస్థితులకు బందీని" అన్నాడు నిరాశగా.



ఆశ్చర్యంగా చూసింది మాధురి. "మన సమాజంలో మగవాడికి పెళ్ళి ఒక సమస్య కాదు కదా. ఆడపిల్లకైతే చదువు ఎక్కువైనా పెళ్ళవదు తక్కువైనా పెళ్ళవదుగానీ మగ వాడికా సమస్యలేదు. ఆడపిల్ల పెళ్ళికి సవా లక్ష అడ్డంకులు. కానీ మగవాళ్ళ దారి సుగమం.

"అందులోనూ మీకేం దర్జాగా డాక్టరు. చూడ్డానికి బావుంటారు. మరి మీ పెళ్ళికేం సమస్య? " అడిగింది.

బరువుగా నిట్టూర్చాడు భాస్కర్. మాధు రివంక సూటిగా చూశాడు. "నిజానికి నా వ్యక్తిగత సమస్యలు ఎవరితో చెప్పుకోవడం, నా బాధను మరొకరితో పంచుకోవడం నాకు ఇష్టం వుండదు. కానీ మీతో చెప్పుకో వాలనిపిస్తోంది. వివరంగా చెప్తాను. ఇక్క డేవిటో వూపిరాడనట్లు వుంది. ఎక్కడికైనా వెళ్దామా? " అన్నాడు.

"అలాగే వెళ్దాం పదండి" అంటూ వెంటనే బయలుదేరింది మాధురి.

"నా కార్లో వెళ్దాం" అన్నాడు భాస్కర్.

"సరే" అంది మాధురి. ఇద్దరూ గండి పేట దగ్గరికి వెళ్ళారు ప్రశాంతంగా వున్న చోటు చూసుకుని కూర్చున్నారు.

"మాది ఉమ్మడి కుటుంబం. మా అమ్మా నాన్నలకు మేము నలుగురం పిల్లలం. అన్నయ్య, నేను. నాకు ఒక చెల్లెలు ఒక తమ్ముడు. మానాన్నగారు అదోరకం మనిషి. వయసులో వుండగా ఆయనకేవో అలవాట్లు వుండేవిట. మా అమ్మ ఆయ నతో వేగుతూ మమ్మల్నందర్నీ పెంచుకువ చ్చింది. ఆయన రిటైరు అయ్యారు.

అప్పటికి నా చదువు పూర్తి అయింది. మా అన్నయ్యకి పెళ్ళి అయింది. వాడు కాలేజీలో లెక్చరరు. నాకు ఢిల్లీ దగ్గర ఉద్యోగం వచ్చింది. కానీ వెళ్ళలేదు. కారణం మా అమ్మ. ఆవిడకు మేమంటే ప్రాణం. మమ్మల్ని వదిలి వుండలేదు. ఆవిడ మాట కాదనలేక మొదట కొన్నాళ్ళు వేరే నర్సింగ్ హోమ్‌లో పనిచేసి ఆ తర్వాత స్వంతంగా చిన్న క్లినిక్ పెట్టుకున్నాను.

మా ఇంటికి దగ్గరలో లోయర్ మిడిల్ క్లాసు ఏరియా వుండడంవల్ల నా ప్రాక్టీసు బాగానే సాగుతోంది. రోజుకి నాలుగైదు వందలు మిగుల్తాయి. మాకు స్వంత ఇల్లు వుంది.

మా చెల్లెలుకి పెళ్ళి చేశాం. కానీ దానికీ దాని భర్తకీ ఏవో గొడవలు. చీటికీమాటికీ పుట్టింటికి వచ్చేస్తుంటుంది. ఏడాది కిందట మా ఇంటికి వచ్చేసింది. మళ్ళీ వెళ్ళలేదు.

తమ్ముడు ఇంజనీరింగ్ పాసయ్యాడు. వాడికీ భోపాల్‌లో ఉద్యోగం వచ్చింది. షరామామూలే. అమ్మ వద్దని గోలచేస్తే మానేసి ఇక్కడే ఉద్యోగం వెతుక్కున్నాడు. ఇంతవరకూ విన్నారు కదా. ఇప్పుడు చెప్పండి మా కుటుంబం గురించి మీకేం అనిపిస్తోంది? " హఠాత్తుగా అడిగాడు.

శ్రద్ధగా వింటూన్న మాధురి ఉలిక్కిపడింది.

"చక్కటి కుటుంబం, అందరూ వృద్ధిలోకి వచ్చారు. అంతా లక్షణంగా కలిసి వున్నారు. మీ చెల్లెలి సంసారం గురించి వీలైతే సర్దుబాటు చెయ్యడం, లేదంటే విడా కులు ఇప్పించి ఉద్యోగంలో జేర్పించడమో, మళ్ళీ పెళ్ళి చెయ్యడమో చేస్తే సరి. ఇంక మీకేం లోటు? "

"బయటనుండి చూస్తే ఇంత అందంగా వుండే మా సంసారం మేడిపండు వ్యవ హారం. పరస్పర విరోధాలూ, వైరాలు.

మా అమ్మకీ వదినకీ పడదు. మా నాన్నకీ అమ్మకీ పడదు. మా తమ్ముడికి అన్నయ్యని చూస్తే చులకన. అన్నయ్యకి మా చెల్లెలిమీద పీకలదాకా కోపం. నన్ను చూస్తే అందరికీ మంట.

మా ఇంట్లో వారానికోసారి ఎవరో ఒకరు ఆత్మహత్యా ప్రయత్నం చేస్తారు. మా నాన్న పదిరోజులకోసారి హిమాలయాలకు

పోతా అని సంచీ సర్దుకుంటారు.

అనుక్షణం ఏవో వాదనలు, మూతి ముడుచుకోడాలు, అలకలు, అన్నం మానే యడం. అదోరకమైన వాతావరణం.

నా దృష్టిలో వివాహం అంటే అదో పవిత్రమైన బంధం. జీవితంలో మధురమైన అనుభవం. వైవాహిక జీవితం పట్ల నాకు కొన్ని అభిప్రాయాలున్నాయి. నేను కోరుకునే వైవాహిక జీవితం మా ఇంట్లో సమకూరడం అసంభవం. నా వాళ్ళనందరినీ ముఖ్యంగా మా అమ్మను వదిలి వెళ్ళడం కూడా అసంభవమే కాబట్టి నా పెళ్లిని వాయిదావేశాను" వివరంగా చెప్పాడు.

అంతా విన్న మాధురికి విచిత్రంగా అనిపించింది.

"ఏమిటో అనుకున్నాను. ఇలాంటి సమస్యలు కూడా వుంటాయన్నమాట" అంది సానుభూతిగా. లోలోపల చాలా నిరాశగా అనిపించింది మాధురికి. మరి కాసేపు కూర్చుని ఏవేవో కబుర్లు చెప్పుకుని ఇంటి మొహం పట్టారు.

"ఏదో కాసేపు కూర్చుని వెళ్ళిపోదాం అని వచ్చినవాడిని దాదాపు రోజంతా వుండిపోయాను. చాలా బాగా గడిచింది. ఇంత ఆహ్లాదంగా కాలక్షేపం చేసి చాలా చాలా కాలం అయింది" అన్నాడు భాస్కర్ మనస్ఫూర్తిగా.

"నాకూ అంతే. మధు పెళ్లికాకముందు ఇలాగే ఇద్దరం కాలక్షేపం చేసేవాళ్ళం. మళ్లీ ఇన్నాళ్లికి ఈ ఆదివారం చాలా సరదాగా గడిచింది. మీకు వీలైనప్పుడల్లా రండి" అంది మాధురి.

మర్నాడు ఫోన్ చేశాడు భాస్కర్. అంత వరకూ ఉత్తరాలే తప్పించి ఫోన్ చెయ్యని భాస్కర్ ఫోన్ చేసేసరికి మాధురి చాలా ఆనందించింది.

"నిన్న నేను రావడం లేటయిందని మా అమ్మ కంగారుపడి చాలా గొడవ చేసింది" మాటల మధ్య చెప్పాడు భాస్కర్.

భలే తమాషాగా వుందే. అంత కంగారుపడడానికి మీరేం చిన్న పాపాయా? నేను ఆడపిల్లని. స్కూల్ డేస్‌లో నేనెక్కడికైనా వెళ్ళిరావడం లేటయితేనే ఏమీ అనేది కాదు మా అమ్మ" అంది మాధురి.

"అదేకదా మరి మా ఘనత. అందర్లా వుంటే మా గొప్పతనం ఏముంది? " అన్నాడు భాస్కర్.

ఆరోజు మొదలు ప్రతిరోజూ నిర్ణీత సమయంలో ఫోన్‌చేసి తీరిగ్గా మాట్లాడడం ఒక దినచర్య అయిపోయింది భాస్కర్‌కి. "ఇవాళ మా ఇంట్లో గొడవ జరిగిందండీ" అంటూ చెప్పేవాడు. "ఏమిటో నా సోదితో మిమ్మల్ని విసిగిస్తున్నానో ఏమో. మీతో చెప్పుకుంటే నా మనసు కాస్త తేలిక పడుతుంది" అనేవాడు.

అతని పరిస్థితికి జాలిపడి సానుభూతిగా ఆదరంగా మాట్లాడేది మాధురి. అదంతా మాధవితో చెప్పేది. వినీవినీ అలవాటు అయిపోయింది మాధవికి. అందుకే "ఏవిటి తల్లీ ఈ పూట వార్తలు? ఏమన్నాడు మీ భాస్కరు" అంటూ ఆటపట్టించేది.

భాస్కర్‌పట్ల విపరీతంగా ఆకర్షితురాలైన మాధురి తన ఆలోచనను స్నేహితురాలికి తెలియజేసింది. ఉలిక్కిపడింది మాధవి.

"వాళ్ళ వాళ్ళకు భయపడి పెళ్లి చేసుకోనని అతను అంటుంటే నువ్వు కోరి కోరి ఆ గోతిలో దిగుతానంటావేం? మతిపోయిందా? " అని మందలించింది.

"నా బోటిది అయితే అందరికీ మాడు పగలగొట్టి దారిలోకి తెస్తుంది. నువ్వు చూడబోతే పరమసాత్వికురాలివి. నువ్వెలా వేగుతావ్? " అని నిలదీసింది.

"ఏం ఫర్వాలేదు. ఊ అంటే నోరెట్టుకు పడిపోయే నువ్వు, ఆచారాలంటే చిరాకుపడే నువ్వు పెళ్లిచేసుకుని ఇంత సౌమ్యంగా మారిపోయి పిలవడమే పాపం అన్ని పేరంటాలకూ హాజరవుతూ తిరగడంలేదూ అలాగే నేనూ మారిపోతాను. అవసరం



అయితే అందరి మాడూ పగలగొడతాను" అంది ధీమాగా మాధురి.

"సరే నీ ఇష్టం. నువ్వు తల్చుకుంటే చెయ్యలేనిది లేదు. అది మాత్రం గ్యారంటీగా చెప్పగలను" అంది మాధవి.

మర్నాడు ఫోన్‌చేసి భాస్కర్‌ని రమ్మని పిలిచింది. అతను రాగానే తన నిర్ణయం తెలియచేసింది మాధురి.

తెల్లబోయాడు భాస్కర్. "అన్నీ తెలిసి ఈ నిర్ణయం ఎలా తీసుకున్నారు మాధురీ? సుఖంగా సాగిపోతున్న మీ జీవితంలో కోరి సమస్యలు తెచ్చిపెట్టుకోకండి. మీరు కావాలనుకుంటే నాకంటే అన్నివిధాలా అధికుడే దొరుకుతాడు." అన్నాడు ఆదరంగా.

"నా జీవితం గురించి నేను బాగా ఆలోచించి ఈ నిర్ణయం తీసుకున్నాను. మీకు

ఇష్టం లేకపోతే చెప్పండి" అంది మాధురి.

నొచ్చుకున్నాడు భాస్కర్. "ఎంతమాట మాధురీ. నిజానికి నా అంత దురదృష్టవంతుడు మరొకడు వుండడు. కోరి వచ్చిన అదృష్టాన్ని కాలదన్నుకునే మూర్ఖుడు వుంటాడా? కానీ చూస్తూ చూస్తూ మీ జీవితం నాశనం చెయ్యలేనుకదా!" అన్నాడు.



తేలికగా ఊపిరి పీల్చుకుంది మాధురి. "ఆ విషయం నాకొదిలేయండి. నా జీవితం నాశనం చేసుకోను సరికదా! మీ జీవితం కూడా స్వర్గం చేస్తాను" అంది ధీమాగా.

ఎంతగానో నచ్చచెప్పి చూశాడు భాస్కర్. కానీ మాధురి తన పట్టు వీడలేదు. చివరికి సరేననక తప్పలేదు భాస్కర్‌కి.

తన పెళ్ళి విషయం ఇంట్లో చెప్పాడు భాస్కర్.

అదిరిపడింది తల్లి మీనాక్షి. వివరాలడిగి తెలుసుకుని అంత చదువుకున్న పిల్ల మన మాట ఏం వింటుంది వద్దు అంది. భాస్కర్ మొండికి వేశాడు. నయానా భయానా చెప్పి చూసి చివరకు ఏదో మహోపకారం చేస్తున్నట్లు అంగీకరించింది.

పెళ్ళి జరిగిపోయింది.



ప్రతినెలా క్రమం తప్పకుండా డాక్టర్‌కి చూపించుకుంటోంది మాధవి. అయిదవ నెల సీమంతం ఘనంగా జరిగింది. అందరు బంధువులూ వచ్చారు. అమెరికా నుండి నీరజ కూడా పతీసమేతంగా రావటంతో అందరూ ఒకచోట కలిశారు. మరదలికోసం, పుట్టబోయే బిడ్డకోసం పెట్టెడు సామాన్లు తెచ్చింది నీరజ.

డెలివరీకి తమ ఇంటికి తీసుకువెళ్తాం అన్నారు భానుప్రతాప్, భవానీ.

అంత దూరం వెళ్ళడం ఎందుకు? ఇక్కడే వుంటే మంచిది అని మాధవి, మధు అభిప్రాయపడడంతో అందరూ చర్చించి అదే మంచిదని నిర్ణయించారు.

డెలివరీ టైముకి వస్తానని చెప్పింది భవాని. అందరూ ఎవరిదారిన వాళ్ళు వెళ్ళారు. భారతి మాత్రం ఓ కాలు గుంటూర్లోనూ ఓ కాలు హైదరాబాదులోను అన్నట్లు కాలక్షేపం చేసింది.

మాధవికి ఎనిమిదో నెల నిండేసరికి రాజశేఖరానికి సెలవులు ఇచ్చేయడంతో ఆ సమస్య కూడా పరిష్కారం అయింది. అక్కడినించి బాగా తెలిసిన వంటమనిషిని వెంట బెట్టుకుని పాతబియ్యం, పాత చింతకాయపచ్చడీ వగైరాలన్నీ మూట కట్టుకుని వచ్చేసింది భారతి పతీసమేతంగా.

వంటావిడ వుంది కాబట్టి వంటపని లేదు. పాతచీరెలు చింపి చిన్న చిన్న బొంతలు, లంగోటీలు కుడుతూ హైరానపడుతున్న అత్తగార్ని చూసి నవ్వేసింది మాధవి.

"ఎందుకమ్మా ఈ శ్రమ. డబ్బుపెడితే బజార్లో దొరకవా? " అంటే "చాల్లే వూరుకో. నీకేం తెలుసు నీ తలకాయ! పసిబిడ్డ శరీరం పువ్వులా వుంటుంది. కొనుక్కొచ్చిన బట్టలు గరుగ్గా వుంటాయి. పాతబట్టలైతే మెత్తగా వుంటాయి" అని మందలించింది కోడల్ని.

మరో వారంలో దిగింది భవాని. ఊలుతో చిట్టి చిట్టి స్వెట్టర్లు అల్లి పట్టుకొచ్చింది. బూరుగుదూదితో కుట్టి పట్టుకొచ్చిన చిన్న పరుపులూ రజాయిలూ వియ్యపురాలికి చూపించింది.

తాము తయారుచేసిన సరంజామా అంతా ముందేసుకుని చూసి తృప్తిపడ్డారు. "ఇక మాపని అయిపోయింది. నీదే ఆలస్యం" అన్నారు మాధవిని చూసి.

"మీకంటే వెయ్యిరెట్లు తొందరగా వుంది నాకు. ఈ బరువు మొయ్యలేకపోతున్నాను" అంది నడుం సవరించుకుంటూ మాధవి.

అందరూ వేయికళ్లతో ఎదురు చూస్తున్నారు ఆ చిన్న ప్రాణికోసం. ఆ శుభఘడియ రానేవచ్చింది.

స్టార్ హోటల్ని తలదన్నేలా అన్ని సౌకర్యాలూ వున్న హాస్పిటల్లో పండంటి మగబిడ్డకు జన్మనిచ్చింది మాధవి.

అభినందనల వర్షం కురిసింది.

అపురూపంగా పుట్టిన బిడ్డ. అందరికీ కంటిదీపం. ఇక ఆనంద సంరంభాలకి లోటేముంది.

మాధవి బిడ్డనెత్తుకుని ఇంటికి వచ్చేసింది. కుటుంబ సభ్యులందరూ వాళ్ళ మంచం చుట్టూ మకాం. దినం అస్తమానం పసివాడి కబుర్లే.

"అచ్చుగుద్దినట్లు మాధవ్ పోలికే" అని భారతి అంటే,

"ఇంకా నయం ఆ నుదురు, ఆ కళ్లు అంతా మధూలా లేదూ" అని భవాని వాదన.

"మీరు అబ్బాయి జోలికి రాకండి బావగారూ! వాసన పసిగట్టాడంటే అన్నప్రాసన నాడే బీరు కావాలని గోలచేస్తాడు" అని రాజశేఖరం హాస్యం ఆడితే...

"అబ్బే వద్దులెండి. మీరే చంకనేసుకుని తిప్పి వీడినీ మజ్జిగ స్వాములవారుగా తయారుచేయండి బావగారూ" అని భాను ప్రతాప్ బదులు తీర్చుకున్నాడు.

ఇక మధు హడావిడి చూడాల్సిందే. చంటివాడు కాస్త ఏడిస్తే చాలు వెంటనే పీడియాట్రీషియన్‌కి ఫోన్‌చేసి "డాక్టర్ మా బాబు ఏడుస్తుంటే బుగ్గలు ఎర్రబడుతున్నాయి, కాస్త వచ్చి చూస్తారా? " అంటూ మొరపెట్టుకోవడం.

వినీవినీ ఆ డాక్టర్ "చూడు నాయనా ఇవన్నీ పసిపిల్లలలో సహజంగా వుండే లక్షణాలే. ఇంట్లో పెద్దవాళ్ళు వున్నారుగా వాళ్ళని అడిగిచూడు. లేదు నేనే రావాలంటే ఓ పని చెయ్. మీ ఇంటిపక్కనే నాకో ఇల్లు చూడు. నాకు వచ్చేజీతం నువ్వే ఇవ్వు. రిజైన్ చేసివచ్చి నీ ఇంటిపక్కనే కాపురం పెట్టి నీ కొడుకుని దగ్గరుండి చూసుకుంటాను" అంది నవ్వేస్తూ.

దాంతో ఆవిడని వదిలేసి తల్లివెంట పడ్డాడు. వాడు కాస్త ఏడిస్తే కంగారు. ఏడవకుండా నిద్రపోతుంటే అదో టెన్షను. అతడి హడావిడి చూసి మాధవి ఒకటే నవ్వు.

ఓరోజు సాయంత్రం మబ్బుపట్టి ఉరుములు ప్రారంభం అయ్యాయి. వెధవగొడవ పిల్లవాడు భయపడతాడు అని గది తలుపులన్నీ మూసి వాడి చెవుల్లో దూది పెట్టి ఇంకా తృప్తి పడక కంగారుపడుతుంటే,

"వెంటనే ఇల్లు సౌండ్‌ప్రూఫ్ చేయించవయ్యా అల్లుడూ" అని సలహా ఇచ్చాడు మామగారు.

"ఇల్లు సౌండ్‌ప్రూఫ్ చేయించినంత మాత్రాన సరిపోదుగానీ లక్షణంగా ఆకాశానికి సైలెన్సరు బిగించెయ్" అన్నాడు తండ్రి ఆటపట్టిస్తూ.

మధు మొహం ఎర్రబడిపోయింది.

అది గమనించిన ఆడవాళ్ళిద్దరూ ధ్వజం ఎత్తారు.

"చాల్లెండి అయిదోనెల వచ్చేదాకా పిల్లలని ఎత్తుకోడానికి భయపడేవారు. మీరే ఎగతాళి చెయ్యాలి" అంది భారతి.

"బాగా చెప్పారు వదినగారూ! ఈయనగారైతే మా రెండో అమ్మాయి పుట్టినప్పుడు ఎవరైనా కంగ్రాట్యులేషన్స్ చెప్పి కూతురా కొడుకా అని అడిగితే హాస్పిటల్‌కి ఫోన్ చేసి నన్ను అడిగి తెలుసుకుని మరీ సమాధానం చెప్పేవారు. ఈయన కూడా ఎగతాళి చేస్తున్నారు చూడండి" అంది భవాని.

దాంతో ఠక్కున నోళ్లు మూసుకున్నారు వియ్యంకులు.

నవ్వులు వెల్లివిరిశాయి.

★ ★ ★

అక్కడ మాధవి ఆనందంలో మునిగి తేలుతుండగా ఇక్కడ మాధురి నడుం బిగించి పోరాటం సాగిస్తోంది.

పెళ్లికూతురిగా గృహప్రవేశం చేసిన మరుక్షణంనుండి ఇంట్లోని వ్యక్తులని నిశితంగా పరిశీలించి చూడసాగింది.

అత్తగారు మీనాక్షమ్మ లక్షణంగా వుంటుంది. చక్కటి విగ్రహం. కట్టూ బొట్టూ పట్ల శ్రద్ధ తీసుకుంటుంది. మంచి బట్టలూ కొనుక్కుంటుంది. చాలా నగలు కూడా వున్నాయి.

మామగారు బలరామయ్య కోరలు తీసిన పాములా వుంటాడు. భార్యని ఏమీ అనలేక ఆ కోపం అంతా ఎదుటివారిమీద చూపించి కేకలు వేస్తాడు.

బావగారు ఆనంద్ భాస్కర్‌లాగా చాలా మంచివాడు. అటు భార్యకీ ఇటు తల్లికీ మధ్య అడకత్తెరలో పోకచెక్కలా నలిగిపోతుంటాడు. తోటికోడలు అరుణకి ఎప్పుడూ నీళ్లకుండ నెత్తినే వుంటుంది. బి.ఏ. పాస యింది. కానీ ఆ లక్షణాలు కాగడా వేసి వెతికినా కనిపించవు. మనిషి కనిపించడం ఆలస్యం "ఇదంతా నా ఖర్మ. తెలియక నా గొంతు కోశారు మా నాన్న. ఇలాటి నరకం పగవాళ్లకి కూడా వద్దు. ఇంతకంటే చావు నయం" అని వాపోతూ వుంటుంది.

ఆడపడుచు శ్రీలక్ష్మి. ఎవరైనా ఓ మాట అంటే చాలు. "మీ ఇంటికి చేరబట్టికదా నన్నిలా తేలిక చేస్తున్నారు" అని నోరు పెట్టుకుపడిపోతుంది. మరిది రాజేష్ అందరిలోకి మేలు. సరదాగా మాట్లాడతాడు. ఇంట్లో నవ్వే ఏకైక వ్యక్తి అతడే. పెళ్లికాగానే హనీమూన్ వెళ్ళాలని ప్రయాణం పెట్టుకున్నారు నూతన దంపతులు.

"అదేం కుదరదు. ముందుగా తిరుపతి వెళ్ళాలి. నేను మొక్కుకున్నాను" అంది మీనాక్షమ్మ.

"అలాగే వెళ్దాం. అక్కడినుండి మేం అటు వెళ్తాం. మీరు ఇటు వచ్చేయండి" అంది మాధురి.

"అలా ఎలా వీలవుతుంది? అందరం కలిసి వెళ్ళాక అందరం కలిసిరావాలి" అంది ఆవిడ ఖచ్చితంగా.

"అలా అని ఎక్కడైనా రూలుందా?" కరుగ్గా ప్రశ్నించింది మాధురి.

అదిరిపడింది మీనాక్షమ్మ. "ఎంత పొగరు. చదువుకుని ఉద్యోగం చేస్తున్నానని గర్వం నీకు? అందుకే మావాడికి చెప్పాను. ఈ పొగరుబోతుపిల్ల మనకొద్దని" అంది.

"మీరు చెప్పారు. ఆయన వినలేదు. పెళ్ల యిపోయింది. ఇక ఇప్పుడేం అనుకుని ఏం లాభం? మీరు నా అత్తగారు. నేను మీ కోడల్ని. ఎలాగో ఒకరితో ఒకరం సర్దుకుపోవాలి" అంది మాధురి.

"నేనెందుకు సర్దుకుపోవాలి? ఇది నా ఇల్లు. ఇక్కడ నీ పప్పులు ఉడకవు" అందావిడ ఇంత గొంతు చేసుకుని.

"ఇది మీ ఒక్కరి ఇల్లూ కాదు. అందరి ఇల్లూనూ. అందరం కలిసివుంటున్నప్పుడు అందరం సర్దుకుపోవాలి. ఇకపోతే మీ పప్పులు ఉడకగా లేనిది మా పప్పులు వుడకవా!" అంది మాధురి అదే స్వరంతో.

పెద్ద పెట్టున ఏడుస్తూ "ఒరే భాస్కరా నా మాట కాదని నువ్వు హనీమూన్ వెళ్తే తిరిగొచ్చేసరికి నా శవం ఎదురవుతుంది" అంది.

ఆవిడ చూస్తుండగానే మాధురి భర్త చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకువెళ్ళింది. "ఆవిడేం చెయ్యదు. నాదీ హామీ. మనం ప్రోగ్రాం ప్రకారం వెళ్దాం. ఇప్పుడు మెత్తపడ్డారో మన బతుకు నట్టేట మునుగుతుంది" అంది మెల్లిగా.

గంట తర్వాత సామాన్లు సర్దుకుని హనీ

మూన్ వెళ్తున్న కొడుకుని, కోడల్ని చూసి దొర్లిదొర్లి ఏడిచింది.

ఒకే భావాలు కలిగి ఒకేరకమైన అభిరుచులు కలిగి పరస్పరం ఇష్టపడి వివాహం చేసుకున్న ఆ దంపతుల ప్రేమయాత్ర హాయిగా జరిగింది.

"మీ కుటుంబ బాధ్యత ఇకనుండి నాది. వాళ్ళంతా నిజానికి చాలా మంచివాళ్లు. ఎవరికి వారికే సెల్ఫ్‌పిటీ. ఇదో జబ్బు. అయ్యోపాపం అంటే మరింత పేట్రేగిపోతారు. ఇలాటివారిని మొండితనంతోనే లొంగదీయాలి. మీరు నాకు సహకరించండి" అని చెప్పింది మాధురి సమయం కనిపెట్టి.

"అలాగే. నీ మీదా, నీ సమర్థత మీదా నాకు గౌరవం వుంది. నీ ఇష్టం వచ్చినట్లు చెయ్" అన్నాడు భాస్కర్.

హనీమూన్ ముగించుకుని ఆహ్లాదంగా ఇంటికి చేరుకున్న ఆ దంపతులకు వాకిట్లోనే ఎదురైంది మీనాక్షమ్మ. "ఏం అత్తయ్యా బాగున్నారా?" అని పలకరిస్తే మూతి మూడు వంకరలు తిప్పింది.

స్నానం చేసి తయారై ఆఫీసుకి బయలుదేరుతూవుంటే మళ్లీ మొదలెట్టింది అత్తగారు.

"పొద్దున్నే రింగురంగామని తయారై బయటికిపోతే ఇంట్లో పనెవడు చేస్తాడు నీ తాత!" అంది.

శాంతంగా వెనక్కి తిరిగింది మాధురి. "నాకు తాత లేడు, చచ్చిపోయాడు. మీ తాతని పిలిపించి పనిచేయించుకోండి. పొద్దున్నే తయారైపోక మిట్టమధ్యాహ్నం పోనా ఆఫీసుకి?" నిలదీసింది.

"ఓయబ్బా మాలావు చేస్తున్నావులే బోడి ఉద్యోగం. పక్కవీధి కనకమ్మ కోడలూ చేస్తోంది ఉద్యోగం. పనంతాచేసి అత్తగారికి కంచంలో పెట్టి మరీ వెళ్తుంది" మండిపడింది.

"మరైతే ఇహనేం. వాళ్ళింటికి వెళ్ళేసరి. ఆవిడతోబాటు మీకూ పెడుతుంది కంచంలో" అనేసి వెళ్ళింది మాధురి.

మళ్ళీ దొర్లిదొర్లి ఏడిచి ఆ కోపం అంతా పెద్దకోడలిమీద చూపించింది. దాంతో మళ్ళి కుళ్లి ఏడిచింది అరుణ.

ఆ రాత్రి పెద్ద దెబ్బలాట లేవదీసింది మీనాక్షమ్మ.

అత్తగారనే భయంభక్తీ లేకుండా తనని అన్ని మాటలు అన్నందుకు కోడలు క్షమాపణ చెప్పుకుంటే సరేసరి లేకపోతే బావిలో దూకుతాను అంటూ హఠం వేసుకుని కూర్చుంది.

"నేనేమీ అనలేదు. మీరన్నదానికి సమాధానం చెప్పాను. అది తప్పు అని నేననుకోడంలేదు. కాబట్టి క్షమాపణ చెప్పను. నాలో తప్పు వుంటే పెద్దవారు మీరు చెప్పండి. చిన్నదాన్ని నేను సరిదిద్దుకుంటాను. అంతేగాని వూరికే యాగీ చెయ్యాలని మాత్రం చూడకండి" అంది మాధురి అంతకంటే మొండిగా.

నేను బావిలో దూకుతా అంటూ పరుగుపెట్టింది. అందరూ వారించబోయారు ఆగండి అంటూ కేకపెట్టింది మాధురి. ఆ అరుపుకి జడిసిపోయారు అందరూ.

అందర్నీ దాటుకుంటూ వెళ్ళి అత్తగారి జబ్బ పట్టుకుని బరబర బావి దగ్గరకు లాక్కెళ్ళింది. "దూకవమ్మా దూకు ఇవ్వాళ ఏకాదశి మంచిది కూడాను. త్వరగా కానీయ్" అంది కరుగ్గా.

దెబ్బకి దయ్యం దిగివచ్చినట్లు కోడలి కరుకుతనం చూసి బెదిరింది మీనాక్షమ్మ. ఇంకాసేపాగితే కోడలే తోసేస్తుందేమో అని భయపడి గిర్రున తిరిగి వచ్చేసింది. గదిలోకి వెళ్ళి ధడాల్న తలుపేసుకుంది.

ఆరోజు తర్వాత మీనాక్షమ్మ చస్తాను అనడం ఆలస్యం "మరింకా ఆలోచన ఎందుకు త్వరగా చావు" అంటూ వెంటబడడంతో విసుగేసి ఆ అస్త్రం ప్రయోగించడం మానుకుంది ఆవిడ.



ఓరోజు కన్నీరుమున్నీరుగా ఏడుస్తున్న అరుణని చూసి చీవాట్లు పెట్టింది మాధురి.

"ఎవరో చచ్చినట్లు ఎందుకా ఏడుపు?" అని అడిగింది విసుగ్గా.

"ఎవరో చచ్చారని ఏడవడంకాదు, నాకు చావు రాలేదని ఏడుస్తున్నాను" అంది అరుణ. "హారి భగవంతుడా! ఈ ఇంట్లో మనుషులంతా చావు గురించి తప్ప బతుకు గురించి మాట్లాడరేం? ఆవిడంటే పాతకాలంది. చదువూ సంధ్యలు లేనిది. నువ్వు అన్నీ తెలిసినదానివి. డిగ్రీ పాసయినదానివి నీకేం కష్టం చెప్పు. ఆవిడ నన్ను మాత్రం అనడంలేదా? నేనేడుస్తున్నానా? నువ్వూ ఎదురు సమాధానం చెప్పు" సలహా ఇచ్చింది మాధురి.

"నువ్వంటే రోజంతా బయటే వుంటావు? పెద్ద ఉద్యోగస్తురాలివి. దర్జాగా సంపాదించుకుంటున్నావు. కాబట్టి ఎదురు సమాధానం చెప్పినా జరిగిపోతోంది. నాకెలా జరుగుతుంది?" ఎదురు ప్రశ్న వేసింది అరుణ.

"నేను పెద్ద ఉద్యోగం చేస్తున్నాను. వేలకువేలు సంపాదిస్తున్నాను అంటే ఎంత శ్రమపడితే ఈ స్థాయికి వచ్చాను. నువ్వూ కష్టపడు. బి.యీడీకి కట్టు లేదా కంప్యూటర్ నేర్చుకుని ఏదైనా ఉద్యోగంలో చేరు. అవన్నీ కాదంటే ఈ డిగ్రీతోనే ఏదో ఉద్యోగం సంపాదించుకో. అదీ కాదంటే ఇంట్లో నలుగురు పిల్లలని పోగుచేసి ట్యూషన్లు చెప్పు. కాలక్షేపమూ అవుతుంది. నాలుగు డబ్బులూ వస్తాయి. చేతినిండా పనివుంటే ఈ వరసన ఏడిచి మనసు పాడుచేసుకునే తీరికే వుండదు" నచ్చచెప్పింది మాధురి.

"ఇవన్నీ జరిగేవి కావులే మాధురీ. ఆవిడేదో పుల్లపెట్టక మానుతుందా. నేనేదైనా మొదలుపెట్టినా నా దోవన నన్ను నడవనిస్తుందా. ఆమధ్య ఓసారి ఇన్‌స్టాల్‌మెంటు మీద చీరెల వ్యాపారం పెడతానంటే చీరెలమ్మే వ్యాపారంచేసి ఇంటి పరువుతీస్తావా? అని యాగీచేసింది. దాంతో మీ బావగారు వద్దన్నారు" అంది అరుణ.

"చూడక్కా... జీవితంలో ముందుకి పోవాలంటే, శ్రమకీ అడ్డంకులకీ భయపడకూడదు. అప్పుడేదో జరిగింది కదా అని వదిలేసి వూరుకుంటే ఎట్లా చెప్పు. ఎదురించి పోరాడాలి. నీకెందుకు నువ్వు ఏదైనా మొదలుపెట్టు. నీకు నేను సపోర్టు ఇస్తాను. ఏం సహాయం కావాలన్నా చేస్తాను" అంటూ ధైర్యం చెప్పింది.

దాంతో అరుణకి కాస్త ఆశ కలిగింది. "నాకు చీరెల వ్యాపారం పెట్టాలని వుంది మాధురీ. మా పుట్టింటి దగ్గర మంచి చీరెలు నేస్తారు. చౌకగా దొరుకుతాయి. తెప్పించి వాయిదాల పద్ధతిని అమ్ముతాను" అంది.

"మరింకేం శుభస్యశీఘ్రం. నేను పెట్టుబడి పెడతాను. వెంటనే ఆ పని ప్రారంభించు" అంటూ ప్రోత్సహించింది.

పదిరోజులు గడిచేసరికి చీరెల వి.పి.పి. పార్సిలు వచ్చింది. చిన్న బోర్డు తయారుచేయించి కొట్టుదగ్గర కట్టించింది మాధురి.

విషయం గ్రహించి విరుచుకుపడింది మీనాక్షమ్మ.

"హమ్మో ఎంతకి తెగించావే అరుణా! నేను వద్దన్న పనిచెయ్యడానికి నీకెంత ధైర్యం? దాని అండ చూసుకుని నువ్వూ బరితెగించి పోతున్నావు. నాకు గనక కోపం వచ్చిందంటే మనిషిని కాదు. మర్యాదగా ఈ పని మానేయ్. లేకపోతేనా?" అంటూ గర్జించింది.

అరుణ బెదిరిపోయింది కానీ మాధురి మాత్రం తొణకలేదు. "లేకపోతే ఏంచేస్తారు? ఏంచేస్తారో చెప్తే మేమూ విని ఆనందిస్తాం. మనిషన్న తర్వాత ఆమాత్రం స్వతంత్రం లేకపోతే ఎట్లా! స్నేహితులతో బాతాఖానీలూ. మేట్నీ సినిమాలూ అంటూ మీరు కాలక్షేపం చేస్తే లేని తప్పు అక్క

ఇంటిపట్టున వుండి చీరెల వ్యాపారం చేస్తే వచ్చిందా? అక్క ఈ పని మానదు. నేను మాననివ్వను. ఏంచేస్తారో చేసుకోండి. చస్తానంటారా చావండి. లేదూ మమ్మల్ని ఇల్లొదిలి పొమ్మంటారా ఆ మాట చెప్తే సాయంత్రానికి ఎవరిదోవన వాళ్ళం పోతాం. కాదు మీరే ఇల్లొదిలి పోతానం టారా ఎక్కడికి పోతారో చెప్తే టికెట్లు రిజ ర్వుచేసి సామాన్లు సర్ది రైలెక్కిస్తాం. ఏం చేస్తారో త్వరగా తేల్చి చెప్పండి" అంది ఠీవిగా నిలబడి.

ఏమీ చెప్పలేక, ఏమీ చెయ్యలేక గొణుక్కుంటూ లోపలికి వెళ్ళిపోయింది ఆవిడ. ఆ వ్యాపకం పెట్టుకున్న తర్వాత అరుణ ప్రవర్తన చాలా మారింది. సంతో షంగా వుండసాగింది. మీనాక్షమ్మ మింగ లేక కక్కలేక అవస్తపడసాగింది.

ఒక్కొక్కరినే తగిన రీతిన బాగుచేస్తున్న మాధురి దృష్టి శ్రీలక్ష్మిమీద పడింది. పొద్దున్నే అందరికంటే ముందు స్నానం చేసి టిఫిను చేసేసి టి.వి. ముందు కూర్చుంటుంది. రాత్రి దాకా అక్కడే వుంటుంది. అన్నీ అక్కడికే అందించాలి. ఏమైనా తేడావస్తే నోరుపెట్టుకుని పడిపో తుంది.

వారం అంతా ఆఫీసు హడావిడిలో గడ పడం, ఆదివారాలు భర్తతో బయటికి వెళ్ళడంతో బిజీగా వున్న మాధురి మొదట్లో శ్రీలక్ష్మి ధోరణి గమనించలేదు. తీరా గమ నించాక ఆవిడ వాలకానికి చిర్రెత్తుకొచ్చింది.

★ ★ ★

ఓరోజు సాయంత్రం అలవాటుప్రకారం సోఫాలో కూర్చుని టి.వి.చూస్తూ "తల నెప్పిగా వుందర్రా కాస్త స్ట్రాంగ్‌గా కాఫీ తెచ్చి ఇవ్వండి ఎవరైనా" అని కేకపెట్టింది. మీనా క్షమ్మ ఎక్కడికో వెళ్ళింది. అరుణా, మాధురీ వంటింట్లో వున్నారు. ఆ కేక విని ఆదరాబా దరా కాఫీ కలుపుతున్న అరుణని వారిం చింది.

"ఏమిటదీ? ఆవిడకి అందించడానికి మనమేమైనా పనిమనుషులమా? అంతగా అయితే వచ్చి తీసుకువెళ్తుందిలే" అంది.

"ఎందుకొచ్చిన గొడవ మాధురీ మళ్ళీ అరిచి గోలచేస్తుంది? " అంది అరుణ.

"అరిస్తే అరిచిందిలే. ఇలా అందరికీ భయపడితే అయినట్లే" అనేసింది మాధురి. రెండుసార్లు అరిచి కాఫీ రాకపోవడంతో సుడిగాలిలా దూసుకువచ్చింది శ్రీలక్ష్మి.

"ఏం వదినా పిలిస్తే వినిపించడంలేదా! చెవుల్లో చెట్లు మొలిచాయా? " మాధురి వంక చూడనైనా చూడకుండా అరుణని నిలదీసింది.

"ఆవిడకేం చెట్లు మొలవలేదు. నీకే మొలిచాయి నెత్తిన కొమ్ములు. ఇక్కడ పని లోవున్నాం కనిపించడంలేదా! అయినా అన్నీ అక్కడికి తెచ్చి అందించడానికి అక్కడ నువ్వు చేస్తున్న రాచకార్యం ఏమిటో!" సూటిగా అడిగింది మాధురి.

"ఓ చెంప తలనెప్పితో చస్తుంటే కాస్త కాఫీ అడిగితే అన్ని మాటలంటావా? " అంది ఏడుపు గొంతుతో.

"దినం అస్తమానం టి.వి చూస్తూ కూర్చుంటే తలనెప్పిరాక ఏమౌతుంది? వచ్చి కాఫీ కలుపు, నువ్వు తాగి మాకూ ఇవ్వు. కాస్త ఆ పనీ ఈ పనీ చేస్తే తలనెప్పి కాస్తా ఎగిరిపోతుంది" అంది సరదాగా!

"ఏమిటీ నేను కాఫీ కలిపి మీకివ్వాలా? ఇంటి ఆడపడుచుని. ముగ్గురన్నల మధ్య ఒక్కర్తినే ఆడపిల్లని. అపురూపంగా పుట్టి పె రిగినదాన్ని. నాకు పని చెప్తావా. గతిలేక మీ ఇంట్లో పడున్నందుకేగా నాకీ అవ మానం" అంది ఏడుస్తూ శ్రీలక్ష్మి.

"గతిలేక మా ఇంట్లో పడున్నావని నువ్వే అంగీకరించావుకదా! ఇక ఈ వెధవవేషాలు ఎందుకు? మొగుడినీ సంసారాన్నీ ఎలాగూ వదిలేశావ్! వేరే దారి చూసుకుని నీ బతు కేదో నువ్వు బతుకుతావేమో అంటే అదీ చెయ్యవు. ఎంతసేపూ విగ్రహంలా కూర్చుని,

కూర్చున్నచోటికే అన్నీ తెప్పించుకోవాలంటే ఎంతకాలం సాగుతుంది. ఇకనైనా బుద్ధితెచ్చుకుని కాస్త పనిలో సాయం చెయ్యి" అంటూ దులిపేసింది.

దాంతో ఏడిచి మొత్తుకుని తల్లితో చెప్పుకుంది శ్రీలక్ష్మి. కోడల్ని ఏమైనా అంటే ఎదురుతిరిగి మరో నాలుగు అంటుంది. అందుకే నోరు మూసుకుని వూరుకుంది మీనాక్షమ్మ. "ఏంచేస్తాం తల్లీ ఇదంతా మన ఖర్మ. అనుభవించక తప్పుతుందా!" అనేసింది.

ఆరోజు తర్వాత శ్రీలక్ష్మికి మర్యాదలు తగ్గిపోయాయి. అందరూ తలో పనీ చెప్పసాగారు. ఇక ఇక్కడే వుంటే తన గతి అధోగతేనని గ్రహించుకుని తట్టాబుట్టా కట్టుకుని భర్త దగ్గరికి వెళ్ళిపోయింది శ్రీలక్ష్మి.

ఆ మరుసటి వారంలోనే రాజేష్‌కి ఢిల్లీలో మంచి ఉద్యోగం వచ్చింది. తమ ఇంట్లో వచ్చిన మార్పులను నిశితంగా గమనిస్తున్న రాజేష్ ఆ మార్పులకు కారణం అయిన చిన్నవదినని సలహా అడిగాడు.

"ఉద్యోగం చూడబోతే మంచిది. అంత



దూరం వెళ్తానంటే అమ్మ గొడవ చేస్తుంది? ఏంచెయ్యను వదినా!" అన్నాడు.

"నీ భవిష్యత్తుకోసం తప్పక వెళ్ళాలి రాజేష్. ఇక అమ్మగారి విషయం అంటావా! ఆవిడ ఇలా తయారుకావడంలో పరోక్షంగా మీ పాత్రా వుంది. చెప్పే తీరున చెప్పి ఒప్పించాలిగానీ ఆవిడ మాటే వేదవాక్కు అనుకుంటే ఎలా? తల్లిని గౌరవించాలి కాదనను. కానీ హద్దులుమీరితే అందరికీ అశాంతి, అసౌకర్యం. ఆవిడకి నచ్చచెప్పి నువ్వు వెళ్ళు" అని సలహా ఇచ్చింది మాధురి.

కొడుకుని ఆపడానికి నానా విధాలా ప్రయత్నించి సాధ్యంకాక నిస్సహాయంగా వుండిపోయింది మీనాక్షమ్మ. రాజేష్ వెళ్ళాక అత్తగారు ఎక్కడ వుందా అని వెతికిన మాధురికి తులసికోట దగ్గర కూర్చుని నిశ్శబ్దంగా ఏడుస్తున్న అత్తగార్ని చూడగానే జాలివేసింది.

ఆదరంగా పక్కన కూర్చుని వీపుమీద చెయ్యివేసింది "అత్తయ్యా! ఏమిటిది? రాజేష్ ఎక్కడికి వెళ్ళాడని? మంచి ఉద్యోగం కోసం మరో చోటికి వెళ్ళాడు అంతే కదా!" అంది ఓదార్పుగా.

"వాడిని వదిలి ఒక్కనాడు కూడా వుండలేదు"

"ఇన్నాళ్ళూ అవసరం రాలేదు కాబట్టి వుండలేదు. ఇప్పుడు అవసరం వచ్చింది కాబట్టి వుండాలి" అంది ఆప్యాయంగా.

"నీకేం తెలుసు. భర్త అస్తవ్యస్తం మనిషి. నేనెంత కష్టపడి ఈ పిల్లలని పెంచుకొచ్చానో ఆ భగవంతుడికి ఎరుక!" ఉక్రోషంగా చెప్పిందావిడ.

"పిల్లలను పెంచడం తల్లిదండ్రుల బాధ్యత, తండ్రి అంతంతమాత్రం మనిషి అయినా మీరు ధైర్యంగా, వంటరిగా మీ బాధ్యత నెరవేర్చారు. అందుకు మీరు నిస్సందేహంగా అభినందనీయులు. కానీ ఆ బాధ్యతకు మూల్యం చెల్లించమనడం ఏం న్యాయం చెప్పండి? మీరు శ్రమపడి పెంచారు కాబట్టి ఎంతవయసు వచ్చినా పిల్లలు అదుపాజ్ఞలలో వుండాలని ఆశించడం, మీరు సుఖపడలేదు కాబట్టి ఇప్పుడు మీ కోడళ్ళని సుఖపడవద్దనడం ఇదేమైనా సమంజసంగా వుందా? " నిలదీసి అడిగింది మాధురి.

"మీరూ పెద్దవారవుతున్నారు. మీ పద్ధతి మార్చుకోండి. గతం మర్చిపోండి. మామగారికి ఇప్పుడు మీరంటే ఎంతో గౌరవం. ఆయన పట్ల సానుభూతిగా వ్యవహరించండి. మీ పిల్లలనుండి ఏమీ ఆశించకుండా మీరు సుఖంగా వుండండి అని వాళ్ళకు చెప్పండి. ఆ తర్వాత వారివద్దనుండి మీరు ఆశించిన దానికంటే ఎక్కువే పొందుతారు. అదీ గౌరవాభిమానాలతో, బెదిరిపోతూ కాదు"

వినడానికి కష్టంగావున్నా ఆ మాటల్లోని నిజాన్ని గ్రహించింది మీనాక్షి. "నన్నేం చెయ్యమంటావు మాధురీ? " అంది దీనంగా.

"మీకేం తక్కువ అత్తయ్యా, లక్షణంగా ముగ్గురు కొడుకులు వున్నారు, భర్తవున్నారు, స్వంత ఇల్లుంది, ఆర్థికమైన ఇబ్బందులులేవు. లక్షణంగా యాత్రలకు వెళ్ళి రండి. ఇల్లు దాటి బయటికి వెళ్తే మనిషికి మార్పుగా వుంటుంది. నాలుగూ చూసినట్లూ వుంటుంది" అంది ఆదరంగా.

పోనీ ప్రయత్నించి చూద్దాం అనుకున్న మీనాక్షమ్మ అందుకు అంగీకరించింది. ముందు ఆ ప్రస్తావనకి బెదిరిపోయాడు బలరామయ్య. మాధురే నచ్చచెప్పింది. "జరిగినది ఏదో జరిగిపోయింది. ఇకముందైనా ఆవిడని సుఖపెట్టడం మీ బాధ్యత" అని చెప్పింది.

మొత్తంమీద దంపతులు యాత్రలకి ప్రయాణం అయ్యారు.

"మీకేం తీసుకురాను? " రైలు దగ్గర అడిగింది మీనాక్షమ్మ కోడళ్ళని.

"నాకు బెనారస్ పట్టు చీర" అంది అరుణ కాస్త సంకోచిస్తూ.

"వజ్రంలాటి మా అత్తగారిని సానబెట్టి మెరుగులు దిద్ది తీసుకురండి" అంది మాధురి అత్తగారిని కావలించుకుని.

★ ★ ★

పసిబిడ్డకి ఘనంగా నామకరణం జరిగింది. మహీత్ అని పేరు పెట్టారు. మధు, మాధవిలు తమతమ స్నేహితులను అందరినీ పిలిచారు. పెద్ద హోటల్లో ఘనంగా పార్టీ ఇచ్చారు. అందరూ వచ్చి పసివాడిని ఆశీర్వదించారు. బహుమతుల వర్షం కురిసింది.

పిల్లవాడి ఫంక్షన్ కాబట్టి పిల్లలందరూ వస్తారు. వారి వినోదం కోసం మేజిక్ షో ఏర్పాటు చేశారు. ఆ మెజీషియన్ చేసే విన్యాసాలకు పిల్లలేకాక పెద్దలూ కేరింతలు కొడుతూ ఆనందించారు.

మహీత్‌ని అందరూ ఆశీర్వదించారు. వీడు తల్లిలా ఉద్యోగం చేస్తాడా? తండ్రిలా ఇంటిపట్టున వుంటాడా? అని అడిగారు కొంతమంది. పెద్దయ్యాక వాడే నిర్ణయించుకుంటాడు అన్నాడు మధు నవ్వుతూ.

ఇరవై ఒకటవరోజున శాస్త్రోక్తంగా ఉయ్యాల పేరంటం జరిగింది. తాతగార్లిద్దరూ బజార్లన్నీ గాలించి కళాత్మకంగా వుండే ఉయ్యాల కొని తెచ్చారు. అమ్మమ్మ, నాయనమ్మ పోటీలుపడి మిఠాయిలు చేయించి పేరంటాళ్ళ కోసం బహుమతులు అమర్చి హడావిడి పడ్డారు.

పార్టీరోజున మొత్తం బాధ్యత తనపై వేసుకున్న మధు ఆ ఫంక్షన్ పూర్తిగా పెద్దవాళ్ళకి వదిలేసి కొడుకుతో ఆడుకుంటూ కూర్చున్నాడు. ఆ వేడుక కూడా సరదాగా గడిచిపోయింది.

మరో పదిరోజులుండి ప్రయాణం కట్టారు భవాని, భానుప్రతాప్. అసలుకంటే వడ్డీ ముద్దు కాబట్టి మనవడిని వదలలేక వదలలేక వదిలివెళ్ళారు. వాళ్ళు వెళ్ళిన వారంరోజులకే డ్యూటీలో జేరింది మాధవి.

ముందుగానే పీడియాట్రీషియన్‌తో మాట్లాడి ఫీడ్ గురించిన సలహాలు తీసుకుని బాబుకి పోతపాలు కూడా అలవాటు చేయడంవల్ల శ్రమ ఏమీకాలేదు. భర్తమీద ఎనలేని నమ్మకం వుండడంవల్ల "వస్తానా మహీ! మళ్ళీ సాయంత్రం వస్తాను" అని చెప్పి వాడి బుగ్గమీద ముద్దుపెట్టుకుని వెళ్ళింది.

కానీ సాయంత్రందాకా వుండలేనేమో అని దిగులుపడిపోయి ఆఫీసుకి చేరగానే ఫోన్ చేసింది. "మధ్యాహ్నం లంచ్‌కి వచ్చేస్తాను. సాయంత్రం దాకా వాడిని చూడకుండా వుండలేను" అని చెప్పింది.

"మహారాణీలాగా వచ్చేయ్. నాకూ మా అబ్బాయికీ కూడా నీమీద చాలా దిగులుగా వుంది" అన్నాడు మధు. లంచ్‌కి వచ్చేసి వాడికి పాలు ఇచ్చి వెళ్ళిపోయింది.

ఇది కాస్త శ్రమతో కూడిన వ్యవహారమే. అరగంట ఇంట్లో గడపడానికి రానూపోనూ గంట డ్రైవింగ్. అయితే అయింది అని అదే దినచర్య చేసుకుంది మాధవి.

మరో నెల వుండి మూడోనెల రాగానే ప్రయాణం అయింది భారతి. మరికొన్నాళ్ళు వుండేదే! కానీ భర్తకు ఇబ్బంది కాబట్టి బయలుదేరింది. బాబుని చూడడానికి పనిపిల్లను ఎవర్నైనా పెట్టుకోమని కొడుక్కి ఎన్నోవిధాల నచ్చచెప్పింది.

ససేమిరా అన్నాడతను. "నా బంగారు తండ్రిని పనివాళ్ళకి అప్పగించను. నేనే చూసుకుంటాను" అని చెప్పాడు.

బాబు వచ్చాక మధుకి బాగా పని పెరిగింది. వాడికి స్నానం చేయించడం, పాలు పట్టడం, ఫారెక్స్ తినిపించడం, ఆడించడం, నిద్రపుచ్చడం అన్నీ వేళకి జరగాలి. అవిగాక వాడి సీసాలు ఉడకబెట్టడం వంటి అదనపు పనులు కూడా వుండనే వున్నాయి. వెరసి ఇరవై నాలుగ్గంటలూ కొడుకు సేవతోనే సరిపోతోంది.

సితార్ మూలపడింది. ప్లాన్లు వగైరా గీసేపని చెట్టెక్కింది. ఏదో గబగబా వంట పని, ఇంటిపనీ తెమిల్చేసుకుని కొడుకుతో ఆడుకుంటూ కూర్చోటం.

మగవాడు ఏదో ఇంతకాలం ఎలాగో గడిపేశాడు. ఇకముందు వుంది ముసళ్ళ పండగ అని ఆనందపడ్డారు ఇరుగుపొరుగులు. కానీ శ్రావ్యంగా జోలపాటలు పాడి కొడుకుని నిద్రపుచ్చుతూ ఆడవాళ్లను మించి పోయేలా చంటివాడి పాలనా, పోషణా చూసుకుంటున్న మధుని చూసి మరో సారి ముక్కుమీద వేలేసుకున్నారు.

మహీత్‌కి ఆరో నెల వచ్చింది. పాకడం వచ్చేసింది. అదివరకులా ఒకచోట కూర్చోకుండా అటుపోనూ, ఇటుపోనూ. బొద్దుగా ముద్దుగా బోసినవ్వులు నవ్వుతూ ముద్దులు మూటకడుతున్నాడు.

మాధవి ఆఫీస్‌లో చాలా బిజీగావుంది. ఏదో ప్రత్యేకమైనపని అప్పగించారు. ఏ కాస్త అటూ ఇటూ అయినా కంపెనీకి నష్టం కోట్లలో వుంటుంది. ఆ పనంతా మాధవి భుజస్కంధాలపై పడడంతో ఊపిరి సలపనంత బిజీగావుంది మాధవి.

అయినా ఎంతో ఉత్సాహంతో ఉరకలు వేస్తూనే పనిచేస్తోంది. పనికి భయపడడం గానీ వెనుకంజ వేయడంగానీ మాధవికి అలవాటు లేనేలేదు కదా.

"ఈ పని బాగా చేస్తే నాకెంతో గుర్తింపు వస్తుంది" అంది మధుతో.

"అంతకంటే కావల్సింది ఏముంది? చూడ్రా నాన్నా మమ్మీకి ఇంకా మంచిపేరు వస్తుందిట" అన్నాడు కొడుకుని ముద్దుపెట్టుకుని.

అహోరాత్రులూ శ్రమించి పనిపూర్తిచేసింది మాధవి. బొంబేకి వెళ్ళి వారికి ఇదంతా చూపించి ఆమోదం పొందాలి. ప్రెజెంటేషన్స్, సెమినార్లు. అన్నీకలిసి నాల్రోజులు ప్రోగ్రాం. ఓ రోజుముందు ఒకరోజు వెనుక.

బాబు పుట్టాక అన్నిరోజులు వదిలివెళ్ళడం అదే మొదలు. లక్ష జాగ్రత్తలు చెప్పి బయలుదేరి వెళ్ళింది మాధవి. వెళ్ళగానే ఫోన్ చేసింది. మర్నాటినుండి ప్రోగ్రాం మొదలు. పొద్దున్న, రాత్రి ఫోన్ చేస్తూనే వుంది. ఏ పూట విశేషాలు ఆ పూట చెప్తూనే వుంది. అనుకున్న దానికంటే ఎక్కువగా మెచ్చుకుంటున్నారు అందరూ. ఇకరేపూ ఎల్లుండి అతి ముఖ్యమైనవి. అవి కూడా ఓకే అయిపోతే ఇక నాకు తిరుగు లేదు" అంది ఆ రాత్రి.

ఆ తరువాతి రోజు. ఆవేళ ఆదివారం మధ్యాహ్నం. మూడుగంటలు అయింది. బాబుని తీసుకుని మేడమీద బాల్కనీలో కూర్చున్నాడు మధు. బాబు పక్కనే ఆడుకుంటున్నాడు. పుస్తకం తిరగేస్తూ వాడిని పలకరిస్తూ కుర్చీలో కూర్చున్నాడు మధు. కాస్త ఏమరచేసరికి బాబు పాకుతూ మెట్లదగ్గరకు వెళ్ళాడు.

అదిరిపడి చేతిలో పుస్తకం గిరాటువేసి రెండంగల్లో మెట్ల దగ్గరకు చేరాడు మధు. అప్పటికే ఆలస్యం అయింది. మెట్లమీద చెయ్యివేసి బేలెన్స్ తప్పి బంతిలా కిందికి దొర్లాడు చంటివాడు. పదిమెట్లు దొర్లి మధ్యలో వంపుదగ్గర ఆగిపోయాడు. కెవ్వుమంటూ గుక్కపెట్టి ఏడిచి అంతలోనే నిశ్శబ్దంగా అయిపోయాడు.

స్థాణువైపోయిన మధు, ఒక్క పరుగున బాబుదగ్గరకు వెళ్ళి వాడిని ఎత్తుకున్నాడు. వాడిమొహం అంతా రక్తసిక్తమైంది. స్పృహలోలేదు. నిలువెల్లా వణికిపోయాడు మధు. దుఃఖం ముంచుకురాగా ఏం చెయ్యాలో అర్థంకానట్లు నిలబడిపోయాడు. వెంటనే తెలివి తెచ్చుకుని బాబునలాగే భుజానేసుకుని బీరువాతీసి డబ్బు జేబులో కుక్కుకుని, మెయిన్‌డోర్ లాక్‌చేసి కారులో బాబుని పడుకోబెట్టి దగ్గరలో వున్న డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళాడు.

"నావల్లకాదు అసలే ఆదివారం. నా




దగ్గర స్టాఫ్ కూడాలేరు. మీరు పెద్ద హాస్పిటల్‌కి తీసుకెళ్ళండి" అన్నాడు గాయానికి కట్టుకట్టి. అక్కడినుండి తిన్నగా సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్‌కు వెళ్ళాడు. వాళ్ళు బాబుని లోపలికి తీసుకువెళ్ళగానే మామూలుగా వాడిని చూసే పీడియాట్రీషయన్‌కి ఫోన్ చేశాడు.

"వెంటనే వస్తున్నాను" అంది ఆవిడ.

అప్పటివరకు స్థబ్దంగా పనులు చేసుకుపోయిన మధుకి అప్పుడొచ్చింది దుఃఖం. బయటనే వున్న ఎస్.టి.డి. బూత్‌కి వెళ్ళి గుంటూరు ఫోన్ చేశాడు. భారతే తీసింది.

"ఏమిట్రా, ఈవేళప్పుడు చేశావ్?" అంది గాబరాగా.

జరిగిన విషయం చెప్తుంటే గొంతు పూడుకుపోయింది. అవతల ఆవిడకీ చచ్చేంత భయంవేసింది. "ఎప్పుడు పడ్డాడురా? అసలైనా ఎలా పడ్డాడు? దెబ్బ బాగా తగిలిందా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపిస్తుంటే,

గభాల్న వచ్చి ఫోన్ లాక్కుని క్లుప్తంగా రెండుమాటలు మాట్లాడి "నేనూ అమ్మా బయలుదేరుతున్నాం" అని చెప్పేసి ఫోన్ పెట్టేశాడు రాజశేఖరం.

తండ్రితో మాట్లాడి మాధవికి చెప్దామా అనుకుని కూడా సంకోచించి ఆగిపోయాడు మధు. మళ్ళీ హాస్పిటల్లోకి వెళ్ళాడు. సరిగ్గా అప్పుడే వచ్చింది పీడియాట్రీషియన్.

"కంగారు పడకండి. నేను వచ్చేశాగా. నేను చూస్తాను" అంటూనే లోపలికి వెళ్ళిపోయింది. అరగంట తర్వాత బయటికి వచ్చింది.

వచ్చీరాగానే "కంగారేంలేదు. బాబు లక్షణంగా వున్నాడు" అంది చిరునవ్వుతో. వేయిదేవుళ్ళకు దణ్ణం పెట్టుకున్నాడు మధు.

"తలమీద దెబ్బ తగిలింది. నాలుగు కుట్లు వేశాం. వేయకపోయినా ఫర్వాలేదు కానీ మచ్చ వుండిపోతుంది కదా! అందుకే వేశాం. బాబు కండీషన్ బాగానే వుంది. మీరు కావాలంటే ఇంటికి తీసుకువెళ్ళచ్చు కానీ పడగానే స్పృహ తప్పాడు కదా! అందుకే ఎందుకైనా మంచిది నలభైఎనిమిది గంటలు అబ్జర్వేషన్లో వుంచితే మంచిది అన్నారు ఇక్కడి డాక్టర్. ఆలోచిస్తే నాకూ అదే మంచిదనిపిస్తోంది. ఇక్కడ వుండడానికి మీకేం ఇబ్బంది వుండదు. కాబట్టి అలాగే చేద్దాం అన్నాను" అంది తాపీగా.

గుండె ఝారుమంది మధుకి. "ఎందుకు డాక్టర్? ఏమైనా సీరియస్సా?" అన్నాడు కంగారుగా.

"అబ్బే అలాంటిదేమీలేదు. చెప్పానుగా జస్ట్ అబ్జర్వేషన్‌కోసం. అంతే... రేపులేదు ఎల్లుండి ఇంటికి వెళ్ళిపోవచ్చు" అందావిడ.

మాధవికి ఈ విషయం చెప్పాలా వద్దా అనే మీమాంసలో కొట్టుకుపోతున్న మధు పరిస్థితి అంతా వివరించి ఆవిడనే సలహా అడిగాడు.

"అంత అర్జెంటుగా పిలిపించే అవసరం అయితేలేదు. వూరికే చూచాయగా చెప్పండి. మీ పేరెంట్సు వస్తున్నారని చెప్పారుగా. మీకు సాయంగా వాళ్ళుంటారు" అంది డాక్టరు.

బాబుని స్పెషల్ రూమ్‌లో వుంచారు. కబురు అందుకుని మాధురి, భాస్కర్ పరిగెట్టుకుని వచ్చారు. వాళ్లని చూడగానే ప్రాణం లేచివచ్చింది మధుకి.

"చూశారా ఎంతపని జరిగిందో? నేను అక్కడే వున్నాను. చూస్తూనే వున్నాను. నా కళ్ళెదురుగానే జరిగింది ప్రమాదం. నాకు చాలా గిల్టీగా వుంది" అన్నాడు.

"ఏం చేస్తాం? మన చేతుల్లో వుందా? ఏదో పిల్లలు పడుతూనే వుంటారు. దేవుడి దయవల్ల ప్రమాదం ఏమీలేకుండా బయటపడ్డాం. మీరు ఏదేదో వూహించుకుని బాధపడకండి. బాబంటే మీకెంత ప్రాణమో మీరెంత బాగా చూసుకుంటారో మాకు తెలి

యదా? " అంది మాధురి ఓదార్పుగా.

"ఏం ఫర్వాలేదు. మీరేం కంగారు పడ కండి. నేను కేస్ షీట్ చూశాను. బాబుకేం భయంలేదు. దెబ్బ కూడా త్వరగానే మాని పోతుంది" ధైర్యంచెప్పాడు భాస్కర్.

"ముఖ్యంగా మిమ్మల్ని ఎందుకు రమ్మ న్నానంటే నేనింకా మధుకి ఈ విషయం చెప్పలేదు. చెప్పాలో చెప్పకూడదో నిర్ణయిం చుకోలేకపోతున్నాను. మీరేం సలహా ఇస్తారు? " అనడిగాడు.

సీరియస్‌గా ఆలోచించింది మాధురి. "ఈ పూట ఫ్లైట్ ఎలాగూ అందదు. రేపే క్రూషియల్ డే. ఇప్పుడు అర్ధాంతరంగా వచ్చేస్తే ఇన్నాళ్ళ శ్రమా వృధా అయిపో తుంది. అదీకాక ఇప్పుడది వచ్చిమాత్రం చేసేది ఏముంది. మనందరం వుండనే వున్నాం. మీ అమ్మానాన్నగారూ రానేవస్తు న్నారు. అందులోనూ దానికి తగని కంగారు. అది కంగారు పడడమే గాక ఇత రులనీ కంగారు పెట్టేస్తుంది. వద్దులెండి. ఎలాగూ ఎల్లుండి రానే వస్తుంది. అది వచ్చేసరికి మీరు ఇంటికే వెళ్ళిపోతారేమో" అంది.

టాక్సీలో రాత్రి పదిగంటలు దాటాక వచ్చారు రాజశేఖర్, భారతి. మనవడిని చూసి ఏడిచేసింది భారతి. "పండంటి బిడ్డమ్మా ఎవరి పాపిష్టి కళ్ళు పడ్డాయో ఏమో ఇంత పాటుపడ్డాడు. వాడికంత మంచిబట్టలూ, అలంకారాలూ వద్దురా అంటే వీడు వినిపించుకోడు. నలుగురిక ళ్ళల్లో పడేలా తయారుచేసి తగుదునమ్మా అని ఊరంతా తిరుగుతాడు. ఇక దిష్టి తగ లక ఏం చేస్తుంది? "

"చాల్లే ఊరుకో. దారంతా సణిగి చంపే శావు ఇంత గొంతువేసుకుని. ఇక్కడ కూడానా? హాస్పిటల్ వాళ్ళు విన్నారంటే వెధవ న్యూసెన్స్ నోరు మూసుకోమం టారు" అని కసిరాడు రాజశేఖరం.




కొడుక్కి ధైర్యంచెప్పాడు. "ఏం భయంలే దులేరా? ఈ వయసులో పిల్లలు ఇంతే. నువ్వూ అంతే, రెండేళ్ళు వెళ్ళేదాకా శరీ రంలో ఏదోభాగం బాండ్ ఎయిడ్ వేసే వుండేది" అన్నాడు అదేమంత పెద్ద విషయం కాదని తేల్చేస్తూ.

మాధవి విషయం తల్లిదండ్రులతో చర్చిం చాడు. "వద్దులేరా నాయనా! దూరాభారం కబురు. నామటుకు నాకే ఈ మాట వినే సరికి పై ప్రాణం పైనే ఎగిరిపోయింది. తల్లి మనసు తల్లడిల్లిపోతుంది. అసలే బేల మనసుది బిడ్డ. ఒంటరిగా వుంది. తట్టుకో లేదు. ఇక్కడ మనం అందరం వున్నాంగా చాల్లే. వచ్చాక తెలిసినా ఫర్వాలేదు" అంది భారతి. రాజశేఖరం కూడా భార్యనే బలప రిచాడు. మాధవికి చెప్పొద్దని నిర్ణయించుకు న్నాడు మాధవ్.

అత్తగారు మామగార్లకు మాత్రం ఫోన్ చేసి పరిస్థితి వివరించాడు. ముందు కాస్త కంగారు పడినా విషయం తెలుసుకుని సర్దు కున్నారు వాళ్ళూనూ. "రేపు పొద్దున్న ఓసారి ఫోన్‌చేసి చెప్పండి" అన్నారు.

★ ★ ★

ఆ రాత్రి చాలా ఆలస్యంగా హోటల్‌రూ మ్‌కి వచ్చింది మాధవి. రాగానే ఫోన్‌చే సింది. ఎంతసేపు మోగినా జవాబు లేకపోయేసరికి మాధురికి ఫోన్ చేసింది. "మా ఇంటికి ఫోన్ చేస్తే రెస్పాన్స్‌లేదు. ఏమయింది? ఎక్కడికి వెళ్ళాడు మధు? " అని అడిగింది.

"లైన్ చెడిపోయిందేమో మరి. సాయంత్రం కలిశాం మేమందరం" అంది మాధురి.

ఇంకా ఏదో అడగబోతుంటే "ఎలా జరి గింది ఇవ్వాళ? " మాట మార్చింది. "ఓ ఎక్సెలెంట్. బియాండ్ మై ఎక్స్‌పెక్టేషన్" అంటూ వివరాలన్నీ చెప్పుకొచ్చింది మాధవి.

అంతా విని అభినందించింది మాధురి. "చాలా పొద్దుపోయింది. ఇక రెస్ట్‌తీసుకో.

రేపునేను వెళ్ళి మధుని ఫోన్ చెయ్యమని చెప్తాలే" అనేసి ఫోన్ పెట్టేసింది.

మరునాటికి బాబు నార్మల్‌గా అయిపో యాడు. తెల్లవారగానే తల్లిని కొడుకుదగ్గర వుంచి వెళ్ళి భార్యకి ఫోన్ చేశాడు. మామూ లుగా మాట్లాడ్డానికి చాలా శ్రమపడవలసి వచ్చింది. ఆ మార్పు గమనించనే గమనిం చింది మాధవి.

"ఏమిటి? అలా వున్నారేం? ఒంట్లో బాగోలేదా? " అంటూ పదిసార్లు అడిగింది.

"ఏం లేదు. కాస్త జలుబు చేసింది. తగ్గి పోతుంది ఏం ఫర్వాలేదు" అనిచెప్పి తప్పిం చుకున్నాడు. కొడుకెలా వున్నాడని అడిగితే వాడికేం రాజాలా వున్నాడు అని సమాధానం చెప్పాడు.

"సర్లే, నేను ప్రోగ్రాం ప్రకారం రేపు వస్తున్నా" అంది మాధవి.

మాధవితో మాట్లాడుతూ వుంటే తప్పుచే సిన భావం మనసులో ముల్లులా గుచ్చుతూనే వుంది.

మర్నాడు బాబుని డిశ్చార్జ్ చేస్తారేమో అని అడిగాడు మధు. మధ్యాహ్నం స్పెషలిస్ట్ వస్తారు. ఆయన ఓసారి చూసేస్తే పంపిం చేస్తాం అన్నారు.

అలా అయితే తను ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళడం వీలవదు. కాబట్టి ఫోన్‌చేసి ఆఫీసు కారుని తీసుకువెళ్ళమని చెప్పాడు. తను అటునుండి ఇంటికి వచ్చేసరికి కాస్త ముందే ఇంటికి చేరిపోతాం అనుకున్నాడు మధు.

తీరా ఆ స్పెషలిస్ట్ రావడం కాస్త ఆలస్యం అయింది. వచ్చాక బాబుని చూడ్డానికి రావ డంతో మరికాస్త ఆలస్యం జరిగింది. ఆ తర్వాత పేపర్లు తయారుచెయ్యడం సంత కాలు పెట్టడం బిల్ కట్టడం వగైరా తతం గానికి మరి కాస్త సమయం పట్టింది. అన్నీ ముగించి ఆదరాబాదరా బయలుదేరారు.

విమానం దిగి బయటికి రాగానే మధు, బాబు బదులుగా ఆఫీస్ డ్రైవర్ కనిపించేస రికి తెల్లబోయింది మాధవి. "నువ్వు వచ్చావేం? అయ్యగారు రాలేదా? " అని అడి గింది. "ఏమో తెలియదు మేడమ్. నన్ను వెళ్ళమంటే నేను వచ్చాను" అన్నాడు అత గాడు.

మధుకి ఒంట్లో బాగా లేదేమో రాలేదేమో అనుకుంది మాధవి. ఇల్లు చేరగానే ఇంట్లో పనిమనిషి మాత్రమే వుండేసరికి, "అయ్యగా రేరి లక్ష్మి? " అని అడిగింది.

"ఆస్పత్రినుండి బయలుదేరారుట అమ్మా. ఫోన్ చేశారు అయ్యగారు" అంది పనిమ నిషి.

"హాస్పిటలా? హాస్పిటల్‌కి ఎందుకె ళ్ళారు? అయ్యగారికి ఎలావుంది" కాస్త కంగారుపడింది మాధవి.

"అయ్యగారు బాగానే వున్నారు. బాబుకి దెబ్బ తగిలింది కదమ్మా. రెండ్రోజుల్నుండి ఆస్పత్రిలోనే వున్నాడుగా" చెప్పింది.

పక్కన బాంబుపడ్డట్టు అదిరిపడింది మాధవి. "బాబుకి దెబ్బ తగిలిందా? "

"అదేమిటమ్మా మీకు తెలియదా? మెట్ల మీంచి దొర్లిపడ్డాడుగా. తల పగిలింది. ఎంత రక్తమో నా కళ్ళు తిరిగిపోయాయి. చాలాప్ర మాదం చేసిందిట" వున్నది కాస్త అయితే గంపంత కల్పించి మరీ చెప్పింది లక్ష్మి.

తల గిర్రున తిరిగింది మాధవికి. "ఎక్కడ ఏ హాస్పిటల్లో వున్నాడు" కొనప్రాణాలతో అడిగింది.

అయ్యగారు రాసిచ్చిన కాయితం చూపిం చింది లక్ష్మి. గిర్రున వెనక్కి తిరిగి వెళ్ళి కార్లో కూలబడింది మాధవి వెనకనుండి లక్ష్మి చెప్పేది వినిపించుకోకుండానే.

కారు బయలుదేరింది. బాబుకోసం తను తెచ్చిన బహుమతులన్నీ కళ్ళముందు మెది లాయి. దుఃఖం తన్నుకొచ్చింది. రుమాలుతో కళ్ళొత్తుకుంది.

హాస్పిటల్‌ముందు కారు ఆగగానే తలుపు తీసుకుని లోపలకు పరిగెట్టింది. రిసెప్షన్ దగ్గర అడిగితే ఫలాన రూమ్ అని చెప్పారు. లిఫ్ట్‌కోసం కూడా ఆగకుండా

రెండంతస్తులూ ఎక్కి రూమ్‌లోకి వెళ్ళి చూస్తే ఖాళీ. పేషెంట్ ఎక్కడ అని అడిగితే ఎవరూ సరీగా చెప్పలేదు. "మరి ఆ పిల్లాడో కాదో తెలియదుగానీ ఇందాక ఒక పిల్లాడికి బాగా సీరియస్‌గా వుంటే ఐ.సి.యుకి తీసుకెళ్ళారు" అంది వరండా తుడుస్తున్న పనిమనిషి.

దడదడలాడుతున్న గుండెను అదుపులో పెట్టుకుంటూ ఐ.సి.యు దగ్గరకు పరిగెట్టి వివరాలు అడిగింది. అక్కడ అడగమనీ అక్కడికి వెళ్తే ఇక్కడికి వెళ్ళమనీ పరుగులు పెట్టించారు. చివరకు తెలిసింది ఆ పిల్లవాడు తనకొడుకు కాదని. కిందికి వెళ్ళి కనుక్కోమన్నారు. మళ్ళీ ఈసురోమని కిందికి వచ్చి అడిగింది.

ఒకటిరెండు ఫోన్లు చేసి "ఆ బేబీని డిశ్చార్జ్ చేశారుట మేడమ్" అని చెప్పారు. ఒళ్ళు మండిపోయింది మాధవికి. "ఆమాట ముందే చెప్పొచ్చుగా. ఇందాక అడిగితే ఫలాని రూమ్‌కి వెళ్ళమన్నారు. గంటనుండి హైరానపడి చచ్చాను. ఏవిటీ ఇన్‌ఫర్మేషన్ ఇవ్వడం" అంటూ విరుచుకుపడింది.

"సారీ మేడమ్ ఓ గంటకిందటే డిశ్చార్జ్ చేశారుట. ఆ ఇన్‌ఫర్మేషన్ మాకు రాలేదు" అన్నారు వాళ్ళు అతిమామూలుగా.

గిర్రున వెనక్కి తిరిగి వచ్చి కార్లో కూర్చుంది. "ఇంటికేనా అమ్మా!" అడిగాడు డ్రైవరు. "అవును" అంది మాధవి.

మాధవి అటువెళ్ళగానే వచ్చారు మధు, రాజశేఖర్, భారతి, బాబు. లక్ష్మి అంతా చెప్పింది. "నేను పిలుస్తున్నా వినకుండా వెళ్ళిపోయారు అమ్మగారు" అంది చివరిగా.

"ఓసి నీతెలివి తగలెయ్యా! బజారుకెళ్ళారనో మరొకటో చెప్పి ఏడవచ్చుగా" కోపగించుకున్నాడు మధు.

"ఏమో మరి అమ్మగారడిగితే చెప్పేశాను" అంది బుర్రగోక్కుంటూ.




"ఎంత కంగారు పడిందో ఏమో. నేను వెళ్తాను" అంటూ బయలుదేరాడు మధు.

"మళ్ళీ చెరోదారీ అయిపోతారేమోరా. ఇక్కడే వుండు వచ్చేస్తుంది" అంది భారతి.

భార్యకోసం గేటుదగ్గరే నిలబడ్డాడు మధు. ఇంకా రాలేదు ఇంకా రాలేదు అని కాలుగాలిన పిల్లిలా తచ్చాడుతూ కంగారుపడుతూ వుండగానే వచ్చేసింది మాధవి.

కారాగీఆగకుండానే కిందికి దిగేసింది. మధూ అంటూ ఎదురొచ్చిన భర్త చేతిని తోసేసింది. "ఏడీ బాబు ఎలావున్నాడు" అంటూ లోపలికి పరిగెట్టింది. తలమీద కట్టుతో కాస్త వడిలినట్లు పడుకుని నిద్రపోతున్న బాబుని చూడగానే బావురుమని ఏడుస్తూ వాడిపక్కన కూలబడింది. "నీకేమయింది నాన్నా! ఏమైందిరా నీకు? " అంటూ వాడి చేతిని ముద్దుపెట్టుకుంటూ ఏడుస్తున్న కోడలిని చూస్తుంటే భారతి కడుపు తరుక్కుపోయింది.

సెలైన్ పెట్టిన చేతిని పట్టుకునేసరికి నెప్పివేసిందో లేక తల్లి ఏడుపుకే లేచాడో బాబులేచి ఏడుపు మొదలుపెట్టాడు.

భార్యని ఓదార్చడంకోసం దగ్గరికి వచ్చిన మధు బాబుని ఎత్తుకున్నాడు. భారతి బయటికి వెళ్ళిపోయింది మెల్లిగా. భర్త దగ్గరనుండి కొడుకుని లాక్కుంది మాధవి.

కోపం, ఉక్రోషం, అనుభవించిన టెన్షన్ అన్నీ ఏకంకాగా భర్తమీద విరుచుకుపడింది.

"నువ్వసలు మనిషివా రాక్షసుడివా? నా బిడ్డకు ఇంతప్రమాదం జరిగితే నాతో మాటమాత్రమైనా చెప్పకుండా దాచిపెడతావా! నాకై నేను అడిగినా ఏవో కుంటిసాకులు చెప్తావా? ఏమిటసలు నీ ఉద్దేశ్యం"

ఏనాడూ తను చూడని మాధవిరూపం చూసి అదిరిపడ్డాడు మధు.

"మధూ నామాటవిను. ఆవేశపడకు. నీ దగ్గర దాచానంటే కారణాలున్నాయి" శాంతపరచడానికి ప్రయత్నించాడు.

విసిరికొట్టింది మాధవి. "ఏమిటా కార

ణాలు. పసిబిడ్డకు అంత ప్రమాదం జరిగి హాస్పిటల్లో పడుంటే కన్న తల్లిని నాకు చెప్ప కుండా దాచడానికి ఏం కారణం వుంది"

"నీ ప్రోగ్రాం పాడవుతుంది"

అతనిమాట అతని నోట్లో వుండగానే "పాడైతే పాడైంది నా ప్రోగ్రాం. పోతే పోయింది నా ఉద్యోగం. బిడ్డకంటే అదె క్కువా నాకు? అంతగా అయితే రిజిగ్నేషన్ వాళ్ళ మొహాన పారేసి వచ్చేదాన్ని. ఉద్యోగం లేకపోతే అడుక్కుని తెచ్చైనా నిన్ను పోషించేదాన్ని" అంది ఆవేశంగా.

సున్నితమైన చోట దెబ్బ తగిలినవాడిలా బాధపడ్డాడు మధు.

"ఎంతైనా మగవాడివికదా, కడుపుతీపి నీకేం తెలుస్తుంది? అదే నేను ఇంట్లోవుండి నువ్వు ఏ ఆఫీసు పనిమీదో బయటికి వెళ్ళుంటే ప్రథమకర్తవ్యంగా నిన్ను వెతికి పట్టుకుని కబురందించేదాన్ని. మగవాడివి కదా, నీది రాతిగుండె. అందుకే అంతశ్రమ పడదల్చుకోలేదు సరికదా నాకై నేను ఫోన్ చేసినా చెప్పలేదు"

ఆ అభాండాలను, ఆరోపణలను సహించ లేకపోయాడు మధు. అతనికీ కోపం వచ్చింది. "ఏమిటా అర్థంలేని మాటలు. నేను చెప్పేది విని పరిస్థితి అర్థంచేసుకుని అప్పుడు నాది తప్పనిపిస్తే నన్ను ఏమైనా అను. అసలు జరిగిందేమిటో తెలుసుకో కుండా నోరుపారేసుకుంటావేం? నీకు తెలిస్తే అనవసరంగా కంగారుపడతావు అని దాచిపెట్టాను" విసురుగానే సమాధానం చెప్పాడు.

"కంగారుపడితే పడతాను. అయినా కంగారుపడిపోడానికి నేనేం పసిపిల్లనా? పరిస్థితి నాకు వివరంగా చెప్తే రావాలో మానాలో నేను నిర్ణయించుకునేదాన్ని"

"ఏమో నీకింత కోపం వస్తుందని నేను అనుకోలేదు. అప్పటికీ మాధుర్నీ, భాస్కర్నీ, అమ్మానాన్నలని, డాడీమమ్మీలని అందరినీ అడిగాను. అందరూ నీకు చెప్పొద్దనే అన్నారు"

అతని మాటలకు మరింత ఉక్రోషంతో విరుచుకుపడింది మాధవి. "అంటే అంద రికీ తెలుసు కానీ నాకు మాత్రమే తెలియ కుండా దాచావ్. అంతేగా... పన్లోపని ఊళ్ళో అందర్నీ సలహాలు అడగకపో యావా? "

ఆ వ్యంగ్యానికి ఒళ్ళు మండింది మధుకి. "నేనేం ఊళ్ళోవాళ్ళని సలహాలు అడగలేదు. శ్రేయోభిలాషులు కాబట్టి వాళ్ళతో చర్చిం చాను. అయినా నాదే బుద్ధితక్కువ. నీవైపునుండి ఆలోచించకుండా అప్పుడే ఫోన్‌చేస్తే సరిపోయేది. బోలెడన్ని తెలివితే టలున్నాయి ఎందుకు? అసలేవిటి విషయం? ఏం జరిగింది అని అడగడం, తెలుసుకోవడం మానేసి నీ ఇష్టంవచ్చినట్లు మాట్లాడతావేం? నేనెంత హింస అనుభ వించానో, నేనెంత మథనపడ్డానో కాస్తం తైనా అర్థంచేసుకోవేం! అవునులే ఆడబుద్ధి పోనిచ్చుకున్నావు కాదు. ఎదుటివారి బాధ అర్థం చేసుకోకుండా ఆడిపోసుకోవడం మీ జన్మహక్కుకదా!" తనూ వ్యంగ్యపు బాణం విసిరి బదులు తీర్చుకున్నాడు.

తోకతొక్కిన త్రాచులా లేచింది మాధవి. "నిజమే మరి నేను ఆడబుద్ధి పోనిచ్చుకు న్నాను కాదు. సరే. మరి మీరు మాత్రం మగబుద్ధి పోనిచ్చుకున్నారా! సంపాదించి తెచ్చిపోస్తుంటే హాయిగా ఇంటిపట్టున వుంటున్నా మీ పౌరుషం తగ్గిందా. తప్పు చేసి కూడా సమర్థించుకోడం మరి మీ జన్మ హక్కు!"

మొహాన వేడినీళ్ళు కొట్టినట్లు అయింది మధుకి. హాల్లోనుండి వద్దనుకున్నా చెవుల బడుతున్న ఈ ఘర్షణ వింటున్న రాజశే ఖరం, భారతి కూడా తుళ్ళిపడ్డారు. భారతి లోపలికి వెళ్ళబోతుంటే చెయ్యిజాపి వారిం చాడు రాజశేఖరం.

"తెచ్చిపోస్తున్నానని బాధపడద్దులే. నేనూ బయటికివెళ్ళి ఉద్యోగం చేసి నాలుగు

డబ్బులు సంపాదిస్తాను" అన్నాడు మధు.

ఇవతల పిల్లవాడి గురించి మాట్లాడుతూ అతనలా అనడంతో మరింత పేట్రేగి పోయింది.

"మహారాజులా సంపాదించుకోండి. నన్నూ నా కొడుకునీ పోషించాల్సివస్తుందని మాత్రం భయపడకండి. మాకున్నది మాకు చాలు" అనేసింది.

విసురుగా బయటికి వచ్చి నుంచున్నపాటున ఇంట్లోంచి బయటకు వెళ్ళిపోయాడు.

నెత్తిన చేతులు పెట్టుకుని కూర్చున్నారు భారతి, రాజశేఖరం. "ఏవిటండీ ఇది. మొన్నటికిమొన్న పసిబిడ్డ అంతపాటుపడడం. చిలుకాగోరింకల్లా వుండే వాళ్ళిద్దరూ ఇలా ఘర్షణపడడం. ఏవిటిదంతా? చూస్తుంటే దుష్టగ్రహ ప్రభావంలా వుంది. పోనీ ఓసారి తెనాలి వెళ్ళి మన శాస్త్రిగారికి వీళ్ళ జాతకాలు చూపించుకువస్తారా? " అంది భారతి.

"చాల్లే వూరుకో. ఓ చెంప పిల్లలు పోట్లాడుకుంటున్నారే అని మథనపడుతుంటే జాతకాలు, చక్రాలూ అంటావేం. నీకీమధ్య చాదస్తం ఎక్కువౌతోంది" కసిరాడు ఆయన.

మధ్యాహ్నం భోజనాలవేళ అవడంతో మెల్లిగా లోపలికి వెళ్ళింది భారతి. "మధూ భోజనం చెయ్యమ్మా! ఆలస్యం అవడం లేదూ! బాబు దగ్గర నేను కూర్చుంటానులే..." అంది ఏమీ జరగనట్టే.

"నాకొద్దమ్మా ఆకలిలేదు!" అంది ముభావంగా.

"ఎందుకుండదు? ప్రయాణం చేసివచ్చావు. పిల్లలకేవో దెబ్బలు తగుల్తూనే వుంటాయి. దానికోసం ఇంత దిగులుపడితే ఎలాగమ్మా? అయినా వీడికేమైందని. రెండ్రోజుల్లో కుట్లు విప్పుతారు. అలా అభోజనంగా వుండకూడదు, పద" అంటూ బలవంతాన లేవదీసింది.

సాయంత్రం అయింది. రాత్రి అయింది. మధు ఇంటికి రాలేదు "ఏ ఫ్రెండ్ ఇంటికో వెళ్ళివుంటాడు. వాడే వస్తాడు పడుకోండి" అన్నాడు రాజశేఖరం. మర్నాడూ రాలేదు. ఆ మర్నాడూ రాకపోయేసరికి కాస్త కంగారుపడ్డారు.

రాజశేఖరం వెళ్ళి మధు పాత ఫ్రెండ్ని కలిశాడు. మరో స్నేహితుడి రూమ్లో వుంటున్నట్లు తెలిసింది. అక్కడికి వెళ్ళాడు వెతుక్కుంటూ.

లుంగీ కట్టుకుని పడుకుని వున్నాడు మధు. తండ్రిని చూడగానే లేచి కూర్చున్నాడు. "మహీత్ ఎలావున్నాడు నాన్నా? " అని అడిగాడు ఆత్రంగా.

"బావున్నాడురా రేపు స్టిచెస్ విప్పుతారు" చెప్పాడు రాజశేఖరం.

"మరి అమ్మకు బాగా శ్రమ అవడంలేదూ వాడిని చూసుకోడం" అడిగాడు.

"ఎందుకూ? మాధవి శెలవు పెట్టి ఇంట్లోనే వుందిగా!" అన్నాడాయన.

'బాంబేనుండి రాగానే ఊపిరిసలపని పనుంటుంది మధూ. అవన్నీ సెటిల్ చేసేస్తేగానీ లాభంలేదు. ఓ నెల్రోజులు తిండి ప్రాప్తం, నిద్రపాప్తం లేనట్లే. అని ఎన్నోసార్లు తనతో చెప్పింది మాధవి మరి ఎలా? ' అనుకున్నాడు మధు ఆశ్చర్యంగా. అంతలోనే 'పోన్లెద్దూ నాకెందుకు' అనేసుకున్నాడు.

"ఇంటికి రాకుండా ఇక్కడేం చేస్తున్నావురా? " తండ్రి మాటలకు ఆలోచనల్లోంచి బయటపడి "ఏదైనా ఉద్యోగం చూసుకుందామనుకుంటున్నాను నాన్నగారూ!" అన్నాడు.

"నీకిప్పుడు ఉద్యోగం చూసుకునే అవసరం ఏమిట్రా? అయినా నువ్వు కూడా బయటికి వెళ్తే బాబునెవరు చూస్తారు? " అన్నాడాయన.

మౌనంగా వుండిపోయాడు మధు. "మాధవి చిన్నపిల్ల. ఆవేశంలో ఏదో తొందరపడి ఒకమాట అన్నదే అనుకో. దాన్నింత సీరియస్గా తీసుకోవాలా? " నచ్చ

చెప్పాడు రాజశేఖరం.

"మనసులో వున్న ఆలోచనలే ఆవేశంలో బయటపడతాయి నాన్నగారూ! అసలు నాదే తప్పు. మరికాస్త లోతుగా ఆలోచించి ఏదో ఉద్యోగం చేస్తూ వుంటే బాగుండేది" గంభీరంగా సమాధానం చెప్పాడు మధు.

"సర్లే ఇప్పుడు ఆలోచించావుగా. ఇపుడు చేద్దువుగాని ముందు ఇంటికిరా" అన్నాడు తండ్రి.

"మాధవి తీసుకురమ్మని పంపించిందా!"

"లేదురా. నేనే వచ్చాను"

"తర్వాత వస్తానులే. మీరు వెళ్ళిరండి" అన్నాడు.

ఎన్నివిధాల నచ్చచెప్పినా వినలేదు. మందలించినా తలొంచుకుని వూరుకున్నాడు. చివరికి విసుగేసి ఇంటికి వచ్చేశాడు.

మాధవి, భారతి హాల్లోనే కూర్చుని వున్నారు. భర్త రాగానే అడిగింది భారతి "ఏమైంది? బాబు కనిపించాడా? "

"కనిపించక ఎక్కడికి పోతాడు? వాసు రూమ్‌లో వున్నాడు" తాపీగా చెప్పాడు ఆయన.

"వాసు రూమ్‌లోనా అక్కడేం చేస్తున్నాడు? " ఆశ్చర్యంగా అడిగిందావిడ.

"ఉద్యోగం కోసం వెతుకుతున్నాడుట"

"ఉద్యోగమా? వాడికెందుకు? ఉద్యోగం ఇంత హఠాత్తుగా కావాలంటే మాత్రం దొరుకుతుందా? ఎన్నాళ్లు పడుతుందో! అంతదాకా అక్కడే వుంటాడటనా? " అడిగింది చిరాగ్గా.

"ఏమో నాకేం తెలుసు? ఈ పిల్లలతో ఇదే గొడవ. వాళ్లకు తోచింది చేస్తారే తప్పించి మనమాట వింటారా? వాళ్లిష్టం. ఏదో పెద్దవాళ్లం కాబట్టి చెప్పి చూస్తాం మన నోటిదురద ఆపుకోలేక" అన్నాడాయన.

ఈ సంభాషణ అంతా వింటూవున్న మాధవి మెల్లిగా లేచి లోపలికి వెళ్లిపోయింది.

'మధు ఉద్యోగం చూసుకుంటాడా? చిన్నా చితకా ఉద్యోగాలు చెయ్యడం నాకు ఇష్టంలేదని చెప్పింది అతడేగా. ఇప్పటికిప్పుడు ఎక్కడ దొరుకుతుంది? దొరికేదాకా అక్కడే వుంటాడా? ' అన్నీ ప్రశ్నలే. సమాధానాలు లేని ప్రశ్నలు. 'సరేకానీ అతనిష్టం. ఇల్లొదిలి పోయింది అతను. తిరిగి రావలసింది కూడా అతనే' అనుకుంది పంతంగా.

మరో నాలుగు రోజులు గడిచాయి. బాబు పూర్తిగా కోలుకున్నాడు. "ఇక మనం వెళ్దామా? ముందు పెట్టిన శలవుకాక మరో నాలుగు రోజులు పొడిగించాను కూడాను. మళ్లీ పొడిగిస్తే వాళ్లు ఏడుస్తారు" అన్నాడు రాజశేఖరం.

"చదవేస్తే వున్న మతిపోవడం అంటే ఇదే. నేనెలా వస్తాను. ఇంట్లో పసిబిడ్డ. అది ఆఫీసుకి వెళ్తుంది. నేనుంటాను మీరు వెళ్లండి" అంది భారతి.

"ఎన్నాళ్లుంటావ్? " అడిగాడాయన.

"ఏమో నాకు మాత్రం ఏం తెలుసు? చూద్దాం కొన్నాళ్లు. ఆపై భగవంతుడి దయ" అనేసింది భారతి.

ఆయన వెళ్లిపోయాడు. వీళ్లిద్దరికీ గొడవలు వచ్చాయని అందరికీ తెలిసింది. హమ్మయ్య అనుకుని ఆనందపడ్డారు కొందరు. 'అయ్యో పాపం చూడచక్కని జంట. కన్నుల పండుగగా వుండేవారు. ఏం గొడవలు వచ్చాయో ఏం పాడో' అనుకున్నారు ఇంకొందరు.

అందరికంటే బాధపడింది మాధురి. అసలా విషయం వినగానే నమ్మలేదు. ఏప్రిల్ నెల నడుస్తోందేమోనని కేలండరు చూసింది. కాదని నిర్ధారించుకుని వెంటనే స్నేహితురాలి దగ్గరకు పరిగెట్టింది. జరిగినది అంతా తెలుసుకుని ఛడామడా తిట్టింది. "అతన్నలా అనడానికి నీకు నోరెలా వచ్చిందే. అప్పుడా పరిస్థితుల్లో ఎవరున్నా అలాగే చేసేవారు. ఎక్కడ నీ కెరి



యర్ దెబ్బతింటుందో అని తాపత్రయపడి నందుకు బాగానే బుద్ధి చెప్పావ్" అంది.

మాధవికి కోపం వచ్చింది. "ఇదీ నీకు అనుభవం కాలేదుకాబట్టి ఇలా మాట్లాడుతున్నావ్. కన్నబిడ్డ ముఖ్యమా? ఉద్యోగం ముఖ్యమా! రేపు నీకు బిడ్డ పుట్టాక నీకే తెలుస్తుంది. వాడికింత ప్రమాదంగావుంటే నేనక్కడ రికామిగా వుండిపోయాననే ఆలోచనే నన్ను కలిచివేస్తోంది" అంది విసురుగా.

"సర్లే! జరిగింది ఏదో జరిగిపోయింది. ఇప్పటికైనా మించిపోయింది లేదు. వెళ్లి మధుతో మాట్లాడు. సారీ చెప్పి ఇంటికి తీసుకురా" సలహా చెప్పింది మాధురి.

"ఏవిటీ నేను వెళ్లి క్షమాపణ చెప్పాలా? ఎందుకు? నేనేం తప్పు చేశానని. ఏదో ఓమాట అనుకున్నంత మాత్రాన ఇల్లొదిలి పోవాలా? తప్పుచేసింది ఆయనగారే. కాబట్టి తనే వచ్చి నాకు సారీ చెప్పాలి" అంది పంతంగా.

"అదికాదే, మగవాడు తనంతట తను రావాలంటే అభిమానంగా వుండదా? " నచ్చ చెప్ప చూసింది.

ఛర్రుమంది మాధవి. "అదుగో అక్కడే నాకు చిర్రెత్తుకొచ్చేది. పురుషాహంకారం అని మనం సరిపెట్టుకోడం ఎందుకు? ఎవరు తప్పుచేస్తే వారే లొంగిరావాలి. మళ్లీ మగవాడు అంటూ ప్రత్యేకత ఒకటా? నేను చచ్చినా వెళ్లను" అని కుండబద్దలు కొట్టి చెప్పేసింది.

ఇక ఇది వినదు ఉడుంపట్టు దీనిది అని నెత్తి బాదుకుని మధు దగ్గరికి పరిగెట్టింది. అంతా విన్నాడు మధు.

"మీకు తెలియదా మాధురీ. మగవాడినన్న అహంకారం, ఆ వంకన అధికారం చెలాయించాలన్న మూర్ఖత్వం నాకేనాడూలేవు. కానీ తనైనా పరిస్థితి అర్థం చేసుకోవాలికదా! ఇక ముందు ఇలా చెయ్యకు. నా మనసుకి కష్టం కలిగింది అని చెప్తే నేనూ సంతోషించేవాడి నికాదా! బాబు పట్ల ప్రేమాభిమానాల్లో నేనేమైనా తేడా చూపించానా? మళ్లీ అక్కడ మాతృప్రేమ కన్నకడుపు అంటూ వెధవ సెంటిమెంట్లు ఎందుకూ? నా తప్పు వుంటే క్షమాపణ చెప్పుకోడం కాదు కాళ్లు పట్టుకోడానికైనా సిద్ధమే. కానీ నా తప్పు లేనప్పుడు క్షమాపణ చెప్పమనడం ఎంతమటుకు న్యాయమో మీరే ఆలోచించండి" అన్నాడు.

ఇంకేం చెప్పాలో అర్థంకాలేదు మాధురికి.

"మరో నాల్రోజులాగి చూద్దాం. అప్పటికి ఆవేశాలు కాస్త చల్లబడతాయి. తెలివితేటలు పనిచేస్తాయి. వాళ్లదోవన వాళ్లను వదిలేద్దాం" అన్నాడు భాస్కర్.

ఒక నెలరోజులు గడిచాయి భారంగా. మధుకి ఎక్కడో మధ్యప్రదేశ్‌లో ఉద్యోగం దొరికిందనే వార్త, మాధవికి ప్రమోషన్ వచ్చిందనే వార్త ఒకేసారి తెలిశాయి.

అవడానికి రెండూ శుభవార్తలే అయినా విని మరింత అయోమయావస్థలో పడిపోయారు ఆ దంపతుల శ్రేయోభిలాషులు.

ఫోన్ చేసి తల్లితో మాట్లాడాడు మధు.

"చాలా సంతోషం కన్నా" అందావిడ.

"రెండు మూడు రోజుల్లో బయలుదేరి వెళతానమ్మా" అని చెప్పాడు. "మంచిది నాయనా!" మళ్లీ చెప్పింది.

"నువ్వు నాతో రా అమ్మా" అడిగాడు.

"నేనెలా వస్తానులేరా! నాకు సవాలక్ష బాధ్యతలున్నాయి. అన్నీ వదిలించుకుని వున్న పాటున పారిపోలేనుకదా! నువ్వెళ్లు" కాస్త నిష్ఠూరంగానే చెప్పేసింది.

ఏం మాట్లాడాలో తోచనట్లు వుండిపోయాడు మధు. తల్లి ఏమైనా చెప్తుందేమో అని కాసేపు చూసి ఆవిడేం మాట్లాడకపోవటంతో "సరేనమ్మా వెళ్లేముందు నిన్ను కలుసుకునే వెళ్తానులే" అని చెప్పి ఫోన్ పెట్టేశాడు.

పక్కనే వుంది మాధవి. అది భర్త ఫోన్ అని తెలుస్తూనే వుంది. అత్తగారు ఏమైనా చెప్తుందేమో అని కాసేపు చూసింది. ఆవిడ కూనిరాగాలు తీస్తూ ఉండటం చూస్తుండేస





రికి ఆపుకోలేక "మీ అబ్బాయి ఫోనేనా ఏమిటి విశేషం? " అంది ఏదో ఆసక్తిలేనట్లు నటిస్తూ.

"ఏముంది. తోచీతోచనమ్మ తోటికోడలు పుట్టింటికి పోయింది అని సామెత చెప్పినట్లు వీడు మధ్యప్రదేశ్ వెళ్ళి ఉద్యోగం చేస్తాడుట. తనకి తోచదు. ఒకరు చెప్తే వినడు. చిన్నప్పటినుండీ ఇంతే తలతిక్క వెధవ. చంపుకు తినేవాడు" విసుక్కుంది.

ఆ మాటకి మాధవికి కాస్తకోపం వచ్చింది. "చెప్పేతీరున చెప్తే ఎందుకు వినడు? మీకంత ఓపిక వుండేదికాదేమో. అంత మాత్రాన తలతిక్క అదీఇదీ అనడం ఎందుకు? " అంది చిరాగ్గా.

విచిత్రంగా చూసి తల తిప్పుకుంది భారతి. "ఓ యబ్బా మాలావు బయలుదేరావులే వాడిని వెనకేసుకు రావడానికి. వాడి మీద ప్రేమ కొట్టుకుపోతోంది" అనేసింది.

చివాల్న అక్కడినుంచి లేచివెళ్ళిపోయింది మాధవి.

'ఈ పెద్దవాళ్ళతో ఇదోగోల. ఒకటి మాట్లాడితే తక్కువ రెండు మాట్లాడితే ఎక్కువ' అనుకుంది. అంతలోనే అంతరాత్మ నిలదీసింది. ఎవరీ పరిస్థితికి కారణం? ఎవరివల్ల ఇలా జరిగింది. నవ్వుతూ నవ్విస్తూ ఆహ్లాదంగా వుండే భర్త స్థానంలో ఈ చాదస్తం అత్తగారు ఉండడానికి కారణం ఎవరు? అంతలోనే పశ్చాత్తాపం కలిగింది. పాపం పెద్దావిడ. కొడుకు ఇల్లొదిలి వెళ్ళిపోయినా కోడల్ని మనవడిని చూసుకుంటోంది ఆ పుణ్యాత్మురాలు. ఇన్నాళ్ళుగా ఒక్కమాట పరుషంగా మాట్లాడి ఎరుగదు.

కొడుకు రమ్మన్నా వెళ్ళనంది. కానీ ఇలా ఎంతకాలం ఆవిడ తనని అంటిపెట్టుకుని వుంటుంది? ఆవిడవెళ్తే తన పని? డబ్బు పారేస్తే మనుషులు దొరుకుతారు. కానీ వాళ్ళు స్వంతవాళ్ళు అవుతారా! అవన్నీ అలా వుంచి సంసారం ఏమవుతుంది? మధు అంతదూరం వెళ్ళిపోతాడా! ఆ ఆలోచనే భరించలేకపోయింది. ఏడుపు వచ్చింది.

అసంభవం, మధులేని బతుకు వ్యర్థం. ఏమైనాసరే మధుని ఆపాలి. అతను వాళ్ళ అమ్మను చూడకుండా వెళ్ళడు. ఆవిడ కోసమైనా ఇంటికి రాకమానడు. అప్పుడు తనే క్షమాపణ చెప్పి వెళ్ళవద్దని వేడుకుంటే సరిపోతుంది అని ఆ ముహూర్తం కోసం వేచి వుంది మాధవి. ఆఫీసుకి శెలవు పెట్టేసింది. ఇంట్లోనే వుండిపోయింది.

★ ★ ★

మధుతో మాధవి ప్రమోషన్ గురించి చెప్పింది మాధురి. వచ్చే జీతం, పెరిగే సౌకర్యాలు వివరించింది. "అంతా బాగానే వుంది. తెలివితేటలూ అమోఘం. లేనిదల్లా లోకజ్ఞానం ఒక్కటే. తలపొగరు కావలసినంత, దానికి సాయం మూర్ఖత్వం" అంది చిరాగ్గా.

మధుకి మనసు చివుక్కుమంది. "అవేమీ కాదండీ! మనసులో ఏమీ దాచుకోదు. మొహాన అనేస్తుంది అది బయటివాళ్ళకి మొండితనంగా, మూర్ఖత్వంగా కనిపిస్తుంది" అన్నాడు.

"అబ్బా భార్యమీద ఈగ వాలనివ్వడం లేదు. ఇంత ప్రేమైతే ఎలా చెప్పండి. ఇంకో నాల్రోజులు గడిస్తే ఎవరి దోవ వారిది. ఇక మాధవి పట్ల మీ ప్రేమాభిమానాలు తగ్గించుకుంటే మంచిది"

అక్కడినుంచి వెళ్ళిపోయాడు మధు.

మాధురి మాటలు అతని మనసును తూట్లు పొడిచాయి. నిజమే వెళ్ళిపోతే ఉద్యోగం ఉంటుంది. నెల తిరిగేసరికి డబ్బు వస్తుంది? ఎందుకు? ఎవరికోసం? మధు వుండదు, బాబు దగ్గర వుండడు. ఇంకెవరి కోసం కష్టపడాలి? హఠాత్తుగా విరక్తి కలిగింది. ఎందుకొచ్చిన ఉద్యోగం? లక్షణంగా ఏ ఆశ్రమానికో పోతేసరి. అనిపించింది.

మధు, బాబు, తమ ఇల్లు గుర్తువచ్చింది. కళ్ళనీళ్ళు తిరిగాయి. 'లాభంలేదు. భార్యాబిడ్డల్ని వదిలేసి బతకలేడు. మాధవి తన

ప్రమోషన్ విషయం చెప్పడానికి వస్తుంది. రాకపోయినా కనీసం ఫోనైనా చేస్తుంది. ఆ సంతోషం తనతో పంచుకోకుండా వుండలేదు. మాధవి రాగానే మధూ నేను వంటరిగా వుండలేను అని చెప్పి జరిగిన తప్పిదానికి క్షమాపణ చెప్పుకోవాలని నిర్ణయించుకు న్నాడు.

తను రావటంలేదని ఆ కంపెనీవారికి టెలిగ్రాం ఇచ్చేశాడు. ఎక్కడికైనా వెళ్తే ఈలోగా మాధవి వచ్చి వెళ్లిపోతుందేమో అని గుమ్మం కదలకుండా కూర్చున్నాడు.

రెండ్రోజులు గడిచిపోయాయి. అటు మధూ ఇటు మాధవీ ముళ్లమీద కూర్చు న్నట్లు వున్నారు. వేచివేచి విసిగి పోయారు. ఎవరైనా కల్పించుకుని మధ్యవర్తిత్వం వహిస్తే బాగుండునని తాపత్రయపడ్డారు. కానీ ఎవరూ పట్టించుకోటంలేదు.

"కొడుకు కోసం పచ్చళ్లు పిండివంటలూ సర్దుతున్న అత్తగార్ని చూస్తే అరికాలి మంట నెత్తికెక్కింది మాధవికి. 'ఈవిడకి చీమకుట్టినట్లైనా లేదు' అని విసుక్కుంది. ఆ కోపం పని మనిషి మీద చూపించింది.

తెల్లవారితే మధు ప్రయాణం. అతను రానే లేదు. ఈవిడగారే అన్నీ సర్ది ఉత్తరం రాసేసి మనిషి చేత పంపించి చక్కా కూర్చుంది. ఆ ఆశ కూడా అణగారిపోగా దిగాలు పడిపో యింది.

అటు మధు అవస్థ కూడా అలాగే వుంది. మాధవి రానేలేదు. తెల్లవారితే లెక్కప్రకారం తన ప్రయాణం అని తెలిసీ రాలేదంటే ఇక రాదు. పాపం తన మనసెంత కష్టపడిందో లేకపోతే ఇంత మొండి పట్టుపట్టదు. ఇక లాభంలేదు తనే వెళ్లాలి. వెళ్లి మనసువిప్పి చెప్పుకోవాలి. అర్ధరాత్రి పన్నెండింటికి బైక్ మీద బయలుదేరాడు మధు.

అటుపొర్లీ ఇటు పొర్లీ లేచి కూర్చుంది మాధవి. 'అయినా తనదే బుద్ధి తక్కువ. ఉద్యోగరీత్యా ఎంతమందిని బతిమాలడం లేదు తెల్లవారిలేస్తే. కట్టుకున్న భర్తని చేసిన తప్పుకి చెంపలు వేసుకుని క్షమాపణ అడగడా నికి ఇంత సంకోచం ఎందుకు. ఇక ఆలస్యం చేస్తే జీవితం అంతా బాధపడాలి' లేచి వున్న పాటున కారు తీసుకుని దూసుకుపోయింది.

అర్ధరాత్రి అంకమ్మ శివాలు అన్నట్లు అర్జెంటుగా నైటీలోనే కార్లో వెళ్లిన కోడల్ని గమ నించి గుండె నిండా ఊపిరి పీల్చుకుంది భారతి.

అర్ధరాత్రి రోడ్డు ఖాళీగా వుంది. దూసుకు పోతున్నాడు మధు. ఒకటీ అరా కార్లు ఎదు రవుతున్నాయి. టర్నింగ్ దగ్గర వేగంగా ఎదు రొచ్చిన కారుని చూసి వెధవ ఎవడో పూటుగా తాగివున్నాడు అని తిట్టుకున్నాడు. అంతలోనే ఏదో అనుమానం వచ్చి బైక్‌ని ఆపి వెనక్కి తిరిగి చూశాడు. అనుమానం నిజమే అది తమ కారే.

గిర్రున బైక్ తిప్పి వెనక్కివచ్చాడు. కారు దగ్గర ఆపి బైక్ దిగాడు ఒక్కంగలో వెళ్లి డోర్ తీశాడు. కార్లోకి వచ్చిన భర్తను కౌగలిం చుకుని బావురుమంది మాధవి.

తన బాధంతా వెళ్లబోసుకుంది. క్షమాప ణలు చెప్పుకుంది. "నువ్వు లేకుండా నేను బతకలేను" అంది.

"నేను చెప్పాలనుకున్నవి అన్నీ నువ్వు చెప్పేస్తే ఎలా? నాదే తప్పు" అంటూ మొద లుపెట్టి మనసు విప్పి చెప్పుకున్నాడు.

"నువ్వు ఎక్కడికీ వెళ్లద్దు. కావాలంటే ఆ ఉద్యోగం ఏదో ఇక్కడే చెయ్యి" అంది మాధవి.

"నేనెక్కడికీ వెళ్లను. ఇక ఉద్యోగం అంటావా? నా భార్య దర్జాగా లక్షలకి లక్షలు సంపాదిస్తూ వుంటే ఉద్యోగం చెయ్యాల్సిన ఖర్మ నాకేమిటి? నేను రాజాలా ఇంట్లో వుండి మా బాబుని పెంచుకుంటాను. ఈ పాపాయిని ప్రేమగా చూసుకుంటాను" అన్నాడు మధు.

ఇద్దరూ ఒకరి కౌగిలిలో ఒకరు ఇమిడిపోయి తృప్తిగా నవ్వుకున్నారు.







# చతుర కతలు

## సిటీ-కిటీ

ప్రతిమకి చెప్పీ చెప్పీ విసిగిపోయింది గీతా టీచర్. ఎన్నిసార్లు చెప్పినా ఆరవతరగతి చదువుతున్న ఆ పాప కొన్ని ఇంగ్లీషు పదాలను అలాగే పలుకుతుంది. మళ్లీ ఈరోజు కూడా 'యూనివర్శిటీ' ని 'యూనివర్కిటీ' గా పలికింది. అలాగే 'ఎలక్ట్రిసిటీ' ని 'ఎలెక్ట్రికిటీ' గా పలికింది. అలా సిటీ వచ్చే పదాలన్నిటినీ 'కిటీ' అనే పలుకుతుంది. పోనీ ఆ పాపకు



'సి' అనే అక్షరం పలకడం రాదా అంటే అదీ కాదు. పదాల చివర అలా 'సిటీ' వచ్చినప్పుడు మాత్రమే 'కిటీ' అని పలుకుతుంది. ఆ పాప కావాలని అలా చేస్తుందో లేక ఆ పదాలను అలా పలకాలనే భావం చిన్నప్పటినుంచీ ఆ పాప మెదడులో బాగా కూరుకుపోయిందో అర్థంకాలేదు గీతకు.

ఏది ఏమైనా ఈ విషయాలన్నీ ఆ పాప పేరెంట్స్ తో మాట్లాడాలని నిశ్చయించుకుంది గీత. ఆక్సిడెంటల్‌గా ఆరోజే సాయంత్రం భర్తతో పాటు మార్కెట్‌కి వెళ్లినప్పుడు ప్రతిమ డాడీ రావు కనిపించాడు. పలకరింపుగా నవ్వాడు. ఆ టైమ్‌లో మాట్లాడడం సరికాదని తెలిసినా గీత మాట్లాడకుండా ఉండలేకపోయింది. "ఈ మధ్య మీ పాప ఇంగ్లీషులో చాలా పదాలను ఒకే విధంగా తప్పుగా పలుకుతోంది. ఎన్నిసార్లు చెప్పినా సరిదిద్దుకోవడం లేదు." అంటూ వివరంగా చెప్పింది రావుతో.

అంతావిని చివరకు ఆయన "నేనూ చెప్పానండీ. బట్ ఆ పాప 'కెపాకిటీ' నే అంత." అంటూ గుడ్‌బై చెప్పి వెళ్లిపోయాడు.

'కెపాసిటీ' ని అతను పలికిన తీరు చూసి డంగైపోయింది గీత. తేరుకునేంతలో అతను ముందుకెళ్లిపోయాడు.

రెండుమూడు రోజుల తర్వాత ఫ్రెండింట్లో ఏదో ఫంక్షన్‌కని పిలిస్తే వెళ్లింది గీత. అక్కడ ప్రతిమ మమ్మీ కనిపించింది. ఆమెతో ఆమాటా ఈమాటా మాట్లాడుతూ చివరకు ప్రతిమ ప్రాబ్లెమ్ గురించి చెప్పింది గీత.

అప్పుడు ఆమె "ఏం చేస్తాం టీచర్! ఎన్ని

సార్లు చెప్పినా వినదు ప్రతిమ. పోనీలెండి మీరు ఈ విషయాన్ని వాళ్లందరి మధ్యా 'పబ్లికిటీ' చేయొద్దు. ఎవరన్నా వింటే నవ్వుతారు" అంటూ వెళ్లిపోయింది.

ఆ ఉచ్ఛారణ వినగానే చేష్టలుడిగి చూస్తూండిపోయింది గీతా టీచర్.

–బి.నరహరి

## అలాగ

రాజారావు, రమాప్రభ ఇద్దరూ ప్రేమించి పెళ్ళిచేసుకొన్నారు. ఇద్దరిదీ ఒకటేమతం. ఒకటే కులం. అయినా వాళ్ళ పెళ్ళికి పెద్దలు అంగీకరించలేదు. అప్పటికే ఏదో గవర్నమెంటు సంస్థలో ఉద్యోగం చేస్తున్నాడు రాజారావు. ఆ ధైర్యంతోనే తమ అంగీకారం తెల్పని పెద్దలను ఎదిరించి మరీ పెళ్ళి చేసుకున్నాడు రమాప్రభని. కొత్తలో ప్రేమ



జంటకు అంతా బాగానే వుంది. ఒకరి లోపాలు మరొకరికి పొరపాట్లుగా తోచలేదు. ప్రేమ యాత్రలకు బృందావనాలు... కాశ్మీరాలు అంటూ తిరుగుతూ కాలక్షేపం చేసారు కొన్నాళ్లు. మరి కొన్నాళ్ళు 'కులుకులొలుకు చెలి చెంత నుండగా వేరే స్వర్గము ఏలనో' అంటూ కూనిరాగాలు తీసుకుంటూ గడిపేసారు.

ప్రేమవేడి కాస్తా చల్లారేసరికి అసలు నైజాలు బయటికొచ్చాయి. చీటికి మాటికీ విసుక్కోవడాలు, ఒకరిమీద ఒకరు అరుచుకోవడాలు అధికమయ్యాయి. మొదట్లో ఒప్పులుగా కన్పించిన వన్నీ ఇప్పుడు తప్పులుగా అన్పిస్తున్నాయి. రమాప్రభ నోరు కాస్త జాస్తి. రాజారావు బద్ధకస్తుడు. ఇవ్వాళ చెయ్యవలసిన పనిని ఓ నాల్గురోజులు పోయిన తర్వాత చూద్దాంలే అంటాడు. ఏ పనిలోనూ సుంత కూడా సాయంరాని మొగుడి మీద కారాలు మిరియాలు నూరుతూ వుంటుంది అస్తమానూ రమాప్రభ. ఊరకనే రుసరుసలాడే పెళ్ళాంని తప్పించుకు తిరుగుతూ వుంటాడు రాజారావు. అలా... అలా రోజులు గడిచి పోతున్నాయి, సంసారంలో సరిగమలు పలక్కపోయినా.

ఓ రోజు మధ్యాహ్నం బజారు నుంచి వచ్చాడు రాజారావు. జోరుగా హుషారుగా ఈలవేసుకుంటూ మరీ వచ్చాడు. వస్తూనే "ప్రభా... ప్రభా" అని పిలుస్తూ లోపలికి వచ్చి సోఫాలో కూలబడ్డాడు.

"అబ్బబ్బ... ఏమిటా అరవడాలు...

చిన్న కునుకు కూడా తీయనియ్యరుకదా" అంటూ విసుక్కుంటూ వచ్చింది రమాప్రభ.

"అరవడాలూ... అరవ కత్తీ కాదోయ్. నేనెప్పుడూ నీ మాట విననసీ, ఎదురింటి వెంకటలక్ష్మి మొగుడు ఆవిడ గీసిన గీటు దాటడనీ అంటావ్ కదూ"

"అవునూ... అందులో అబద్ధమేముందిగ నక. ఉన్న మాటే అన్నాను. అంతేనా వెంక టలక్ష్మి అంట్లు తోముకుంటూంటే చక్కగా తొలిచి షెల్ఫులో పెడతాడు పాత్రల్ని. తను బట్టలకి సబ్బుపెట్టి ఉతికితే అతను డాబామీద ఆరేస్తాడు. ఇంకా ఎన్నో ఎన్నో చేస్తాడు చేతిలో పనందుకుంటూ. మీరూ ఉన్నారు ఎందుకూ" ఈసడింపుగా అంది రమాప్రభ మూతి విరుచుకుంటూ.

"అవును కదూ! ఇన్నాళ్ళకి నాకూ ఆ వెంకటలక్ష్మి మొగుడులాగా చెయ్యాలనిపి స్తోందుస్మీ..."

"నిజంగానా..." విస్తుపోతూ అంది రమాప్రభ.

"నిజంగానే ఏమిటి. అక్షరాలా నిజం... నిజంగా నిజం. ఆ వెంకటలక్ష్మి మొగుడు లేదూ... వాడు వాడి పెళ్ళానికి విడాకులి చ్చాట్ట. నేను కూడా అలాగ... వాడు చేసినట్టే చేద్దామని అనుకుంటున్నాను"

రమాప్రభ "హా" అని అరవడం, కళ్ళు తిరిగి దభీమని కింద పడ్డం రెండూ ఒకే సారి జరిగాయి.

**-సూరిపండు**

---

## అర్థింపు

ప్రియమైన రాము,

నా గురించీ, దేశమంతటా తిరుగుతూ తాగుడు వ్యసనానికి వ్యతిరేకంగా గత పదేళ్లుగా నేను సాగిస్తున్న పోరాటాన్ని గురించీ నువ్వు వినే ఉంటావు. నిర్వహిస్తూ, తాగుడు వ్యసనం నుండి ప్రజలను దూరం చేయడా నికి హితబోధనలు చేస్తున్నాను. ఆల్కహాల్ వల్ల మనిషి ఎంతగా ఆర్థికంగా, శారీరకంగా, సామాజికంగా, నైతికంగా



నేను గుంటూరు వచ్చినప్పుడు జరిపిన ప్రార్థనాసభల్లో కూడా నువ్వు నన్ను చూసి ఉండవచ్చు

ముందు చెప్పినట్టుగా భారతదేశం అంతటా నేను తిరుగుతూ ప్రార్థన సభలు

కృంగి, కృశించి, క్షీణించి, నశించిపోతాడో బోధిస్తున్నాను.

నాతోపాటు నిత్యం ఓ స్నేహితుడు,

భక్తుడు అయిన స్వామిని తీసుకువెడుతుండేవాడిని. సంస్కారం, దైవభక్తి గల మంచి కుటుంబంనుంచి వచ్చిన స్వామి 'తాగుడు వల్ల మనిషి ఎలా నాశనం అవుతాడు' అన్న దానికి మంచి ఉదాహరణ. నిత్యం మితిమీరి తాగడం అతని ప్రవృత్తి.

ప్రతీ సభలో స్వామి నాతోపాటు వేదిక మీదికి వచ్చి ఆసనాన్ని అలంకరించి పెగ్గు మీద పెగ్గు తాగుతూ ఉంటాడు. ఆ సమయంలో గట్టిగా ఆవులిస్తూ, వాతావరణాన్ని పాడుచేసే గాలిని వదులుతూ, ఎర్రటి భయంకరమైన కళ్లతో, భక్తసముదాయం వంక పిచ్చి చూపులు చూస్తూ, ముక్కులో వేళ్లుంచుకుంటూ, శబ్దమయేలా త్రేన్చుతూ ఆడవాళ్లను చూసి అసహ్యకరమైన సైగలు చేస్తూ, తనలో తను మాట్లాడుకుని, నవ్వుకుంటూ కూర్చునుంటాడు.

ఆల్కహాల్ వల్ల మంచి మనిషి ఎంతగా నాశనం అవుతాడో ప్రజలకి సూచించడానికి అతన్ని నేను చక్కటి ఉదాహరణగా వాడుకుంటూ వస్తున్నాను.

అయితే నెల క్రితం దురదృష్టవశాత్తూ కడపలో సభ జరిగాక స్వామి మరణించాడు. దాంతో నేను ఈ నెల అనుకున్న సభలకి హాజరు కాలేకపోయాను. కారణం స్వామిలాంటి ఉదాహరణగా నాకు మరొకరు దొరక్కపోవడమే.

నీ బంధువు గోపాలం నా మిత్రుడని నీకు తెలియకపోవచ్చు కానీ నీ భార్య తండ్రి, నీ అత్తగారు, నేను స్వామిలాంటి వ్యక్తి కోసం వెతుకుతున్నానని తెలియగానే అందుకు నీ పేరు సూచించారు. నువ్వు దయచేసి స్వామి స్థానం భర్తీ చేస్తూ, ఈ దైవకార్యంలో పాల్గొనెదవా? నీ అంగీకారాన్ని నువ్వు పంపించాలని అర్థిస్తూ ఉన్నాను.

ఆశీస్సులతో

స్వామీ నిర్మలానంద.

—యం. ఊహ

---

## ఏం చేస్తారు?

అమెరికాకి ఇండియానుంచి ఎక్కువమంది చదువు, ఉద్యోగాల నిమిత్తం వెళ్తున్నారని మనకు తెలుసు. ఈ సంగతి అమెరికాలోని వాళ్లకీ తెలుసు. ఏమిటీ మన నైబర్ హుడ్‌లో (కాలనీలో) బ్రౌన్ రంగు ఏషియన్స్ ఎక్కువవుతున్నారు? అనుకుంటారు అక్కడ వాళ్లు.

అలా అనుకునే వాళ్లలో ఒకడు మిస్టర్ క్రిస్టఫర్. న్యూజెర్సీలోని వెస్ట్‌విండ్‌సర్ అనే చిన్న ఊళ్లో గత అయిదేళ్లలో ఇండియన్స్ అనేకసార్లు డబుల్ అవడం గమనించిన అతనికి క్రమంగా ఇండియా పేదదేశం అని, అక్కడివాళ్లు పొట్టచేత పట్టుకుని అమెరికాకి వస్తూంటారన్న భావన కలిగింది. దాంతో ఇండియన్స్ అంటే చిన్నచూపు కలిగింది. వాళ్లు ఎక్కడ తారసపడ్డా ఇండియన్స్ గురించి అవమానకరంగా మాట్లాడ్డం అలవాటు చేసుకున్నాడు.

అలాగే ఓ రోజు క్రిస్టఫర్ మెక్‌డొనాల్డ్ రెస్టొరెంట్‌కి వెళితే అక్కడ ఓ టేబుల్ ముందు కూర్చుని బ్రేక్‌ఫాస్ట్ చేస్తున్న ఓ సుబ్బారావు తారసపడ్డాడు. మిగిలిన అన్ని టేబుల్స్ ఖాళీగా ఉన్నా క్రిస్టఫర్ కావాలని సుబ్బారావు టేబుల్ దగ్గరకి వెళ్లి కూర్చున్నాడు. సుబ్బారావు ఓసారి తలెత్తి అతని వంక చూసి మళ్లీ మౌనంగా బ్రెడ్ తినసాగాడు.

అమెరికన్స్‌కి బబుల్‌గం అలవాటెక్కువ. దానికి నిదర్శనమన్నట్లు క్రిస్టఫర్ జేబులోంచి ఓ చూయింగ్‌గం పేకెట్‌ని తీసి చింపి బబుల్‌గం నోట్లో ఉంచుకుని దాన్ని నములుతూ సుబ్బారావు వంక చూశాడు. తర్వాత అడిగాడు.

"మీ ఇండియన్స్ బ్రెడ్ మొత్తం తింటారా?"

# ఏరిన ముత్యాలు

★ ఉద్గ్రంధాలలోని ఆనందానుభూతిని వెలికి తీయగలిగినవాడే సద్విమర్శకుడు.

–ఫ్రాన్స్

★ సత్యం, జ్ఞానం, ధర్మం, దయ, శాంతి, క్షమ ఈ ఆరూ ఆప్తులైన బంధువులు మనిషికి.

–రూసో

★ అజ్ఞానం తరచుగా క్షమార్హమౌతుంది. కానీ అజ్ఞానంగా ఉండాలనే పట్టుదల క్షమార్హంకాదు.

–బ్రంటన్

★ మూల్యం లేకుండా పొందే వస్తువులకు ఒక్కొక్కసారి అధికంగా చెల్లించవలసి వస్తుంది.

–ఐన్‌స్టీన్

★ జ్ఞానం బరువునివ్వవచ్చు కానీ బుద్ధి నైపుణ్యం కాంతినిస్తుంది. చాలామంది ప్రజలు తూకం వేయకుండానే చూసి గ్రహిస్తారు.

–చస్టర్‌ఫీల్డ్

★ మనలో ఉన్నదాన్ని ఇతరులలో కూడా మనం చూస్తాం. మనచుట్టూ ఎప్పుడూ బురదనే చూస్తే మనలో కూడా ఎక్కడో బురద వుందని అది రుజువు చేస్తుంది.

–ది మదర్

★ నువ్వు భగవంతుణ్ణి ప్రేమిస్తే చాలదు. భగవంతుడు నిన్ను ప్రేమించేటట్లు నడుచుకోవాలి.

–బాబా

★ ఉత్సాహం లేకుండా ఎవరూ ఏ గొప్పతనాన్ని సాధించలేరు.

–ఎమర్సన్

★ జీవితంలో కలవరపాట్లకు నష్టపరిహారంగా దేవుడు మనకు ఆశను ప్రసాదించాడు.

–ఓల్టేర్

★ నీ సంతృప్తికోసం భుజించు, ఇతరుల సంతృప్తికోసం బట్టలు ధరించు.

–గాంధీ

★ పప్పును తినాలనుకున్నవాడు మొదట కాయను పగలకొట్టాలి. కీర్తిని కోరేవాడు నిరంతరం శ్రమించాలి.

–ఫ్రిమాన్

సేకరణ: పట్నంశేషంశెట్టి

అవునన్నట్లుగా తలూపాడు సుబ్బారావు.

"మేం బ్రెడ్ చుట్టూవున్న నల్లటి భాగాన్ని తినం. లోపలి తెల్లటి భాగాన్నే తింటాం. మిగిలింది ఫ్యాక్టరీకి పంపుతూంటాం. దాంతో మళ్లీ బ్రెడ్‌లు తయారు చేసి ఇండియాకి ఛారిటీగా పంపుతుంటారు"

సుబ్బారావు ఏం మాట్లాడలేదు. అతను ఆ బ్రెడ్‌కి జామ్ రాసుకోవడం చూసి చెప్పాడు ఆ అమెరికన్ మళ్లీ,

"మీ ఇండియన్స్ సీసాల్లోని జామ్‌నే తింటారా? "

"అవును"

"మా అమెరికన్స్ తాజా పళ్లని తింటాం. అలా తిన్నాక మిగిలిన గింజలని, తొక్కలని ప్రాసెస్ చేసి దాంతో జామ్‌ని తయారుచేసి




దాన్ని ఇండియాకి ఎక్స్‌పోర్ట్ చేస్తాం"

సుబ్బారావు మళ్లీ ఏం మాట్లాడలేదు.

అతను మటన్ సాండ్‌విచ్‌ని తినడం చూసి అడిగాడు క్రిస్టఫర్ మళ్లీ.

"మీ దేశంలో మేక ఎముకలు కూడా కూరలోకి వస్తూంటాయా? "

"అవును"

"మా దేశంలో మా వంటకాల్లో కేవలం మాంసం మాత్రమే వస్తుంటుంది. ఎముకలని ప్రాసెస్ చేసి దాన్ని ఫేస్ పౌడర్‌గా మార్చి ఇండియాకి ఎగుమతి చేస్తాం"

ఈసారి సుబ్బారావు క్రిస్టఫర్ మొహంలోకి చూశాడు. అతను చూయింగ్ గం నములుతూ నవ్వుతున్నాడు.

తన చేతిలోని సాండ్‌విచ్‌ని పక్కనపెట్టి అడిగాడు సుబ్బారావు.

"మీరు కండోమ్‌లని ఉపయోగించాక ఏం చేస్తుంటారు వాటిని? "

"పారేస్తాం. మీరు? ఇంకోసారి వాడతారా? " అవహేళనగా నవ్వుతూ అడిగాడు.

"అవును... మేం వాటిని పారేయం. ఫ్యాక్టరీకి పంపితే అక్కడ ప్రాసెస్ చేసి వాటితో చూయింగ్ గంలు చేస్తారు. వాటిని అమెరికాకి ఎగుమతి చేస్తుంటాం. అమెరికాకు రాకమునుపు ఇప్పుడు మీరు తింటున్న బ్రాండ్ చూయింగ్‌గం తయారుచేసే ఫ్యాక్టరీలోనే నేను పనిచేసేవాడిని" అని చెప్పి సుబ్బారావు మళ్లీ కామ్‌గా సాండ్‌విచ్‌ని అందుకుని దాన్ని తినసాగాడు.

–పృథ్వీరాజ్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.

